The Largest Circulated Telugu Monthly

# చతుర

జూన్ 1997

రూ. 7/-



కామరాజు బ్రహ్మానందరావు

వేదనభూమి

నవలల పోటీలో ప్రథమ బహుమతి పొందిన నవల

# చతుర ప్రపంచం

## చిత్ర కళావ్యాపారి

ఒక గొప్ప చిత్రకారుడు చక్కని చిత్రం గీయడం గొప్ప విషయమే అయినా, దాన్ని అంత గొప్ప చిత్రంగా గుర్తించగలిగే విమర్శకుడు కూడా వుంటేనే ఆ చిత్రానికి విలువ.




అలాంటి కళావిమర్శకుల్లో ప్రఖ్యాతిగాంచిన వ్యక్తి జార్జ్‌విల్డెన్‌స్టన్. అంతేకాదు అనేక అద్భుత చిత్రాలను కొని, అమ్మడంలో ఈయనది అందెవేసిన చెయ్యి. కళాకృతులను ఎంచడంలో ఈయన గొప్ప న్యాయనిర్ణేతగా పేరుగాంచాడు. ఒక్క చూపుతో ఎదుట వున్న చిత్రంయొక్క గుణగణాల్నీ, వ్యాపార విలువల్నీ లెక్కగట్టగల మేధోవంతుడు. ప్రపంచంలోని అత్యంత మేధావంతులయిన ఆర్ట్ ఎక్స్‌పర్ట్‌లలో ఒకరుగా పేరుగాంచాడీయన. ఎప్పుడయినా చిత్రాలకు ధరలు నిర్ణయించవలసి వచ్చినప్పుడు చిత్రకారులమధ్య లేదా కళావిమర్శకులమధ్య బేదాభిప్రాయాలొస్తే వారు వెనువెంటనే జార్జి సలహా ననుసరించి న్యాయనిర్ణయం చేయడం కద్దు. ఆయనదే తుదినిర్ణయం అవుతుంది.

ఎప్పుడయినా చిత్రాల వేలం పాట జరిగినపుడు, కొనుగోలుదారులు చిత్రాలవైపుకన్న జార్జ్ ముఖంవైపు చూస్తూ ఆయన ముఖ కవళికల ననుసరించి పాటను పెంచుతూ పోతారు. ఓ చిత్రంముందు జార్జ్ నిలబడే సమయాన్నిబట్టి ఆ చిత్రం గొప్పతనాన్ని అంచనా వేస్తారు కొందరు.

జార్జ్ విమర్శకుడే కాక గొప్ప వ్యాపారవేత్త కూడా. ఇతర వ్యాపారవేత్తల నాడి బాగా తెలుసుకోగలడు. చిత్రాలన్నీ చూసి

కవర్‌ఫోటో: వి. సత్యమూర్తి

బయటకు వచ్చాక అతని అసిస్టెంటుకు ఏదీ కొనాలో సూచన ఇస్తాడు. దాన్ని అతితక్కువ ధరకి కోడ్ చేస్తాడు అతగాడు. దాంతో ఆ చిత్రాన్ని పాడుకోవడానికి అంతగా ముందుకురారు వ్యాపారస్థులు. అప్పుడు ఆ చిత్రాన్ని ఏదోవిధంగా స్వంతం చేసుకుంటాడు జార్జ్. 1000 పౌండ్లకి కొన్న చిత్రాన్ని 20,000 పౌండ్లకి అమ్ముతాడు.

అయితే అప్పుడప్పుడు ఓ మంచి చిత్రాన్ని కొనడానికి ఎంత ఖర్చయినా వెనుకాడడు జార్జ్. అది మరొకరివద్ద వుండటాన్ని అతడు సహించలేడు. ఈ ప్రతిభా పాటవాలన్నీ అతడికి అతడి తండ్రి నాథన్ నుంచి సంక్రమించాయి. ఫ్రాన్స్ చిత్రకళా వ్యాపారులలో గొప్పవ్యాపారిగా పేరు పొందాడు నాథన్. అలాంటి వాతావరణంలో పెరగడంతో జార్జ్ కూడా ఈ విద్యలో ప్రావీణ్యాన్ని సంపాదించాడు. ఓ విధంగా చెప్పాలంటే తండ్రిని మించిన తనయుడు జార్జ్.

మొదట్లో నాథన్ ఓ బట్టల వ్యాపారి. అయితే అతడోసారి ఓ చిత్రాన్ని కొని ఎవరో అడగ్గా ఎక్కువ ధరకి దానిని అతడికి అమ్మాడు. దాంతో అతనికి ఈ వ్యాపారం లాభసాటిగా అనిపించింది. ఆయన చెప్పేది ఒక్కటే. ఓ చిత్రాన్ని కొనేటప్పుడు ఎలాంటి కష్టాన్నయినా భరించాలి. తిరిగి దాన్ని అమ్మేటప్పుడు మంచి ధర వచ్చేదాకా ఎన్నాళ్ళయినా వేచివుండాలి అనేవాడు. ఎప్పుడూ కొడుకును వెంటబెట్టుకుని మ్యూజియంలకి వెడుతూ వుండేవాడాయన.

ప్రస్తుతం జార్జ్‌వద్ద 2000 అరుదైన చిత్రాలున్నాయి. రెమ్‌బ్రాండెట్, రూబెన్, ఫ్రాయాంగెల్కో, ఎలెగ్రెకో, ఫ్రిగొనాండ్, పిసారో, వాన్‌గాగ్, గోగీ మొదలైన ప్రఖ్యాత కళాకారుల చిత్రాలు జార్జి వద్ద ఉన్నాయి. అవే తన అమూల్యమైన ఆస్థి అంటాడు జార్జ్.

చిత్రాల వ్యాపారానికి సంబంధించిన ఓ ఆఫీసు నడుపుతున్నాడు జార్జ్. ఎంతో మంది చిత్రాల నాణ్యతను తెలుసుకుందుకు వస్తారు అక్కడికి. ప్రపంచం నలుమూలల నుంచీ మంచి చిత్రాల తాలూకా సమాచారాన్ని అందుకునే ఏర్పాట్లు కూడా చేసుకున్నాడు జార్జ్. తన వ్యాపార వ్యవహారాలన్నీ స్టాఫ్ ద్వారానే చేయిస్తాడు జార్జ్. చిత్రకళా వ్యాపారుల్లో చాలామంది జార్జ్ ముఖం కూడా చూడకుండానే అతని సలహా సంప్రదింపులు పొందుతున్నారు. చిత్రకళపై చిన్నతనంలోనే ఎన్నో వ్యాసాలు రాశాడు జార్జ్.

## ఆరోగ్య రహస్యం

ప్రపంచంలో ఆశావాదులు, నిరాశావాదులు అని రెండు రకాల వాళ్లున్నారు. ఆశావాది ఎప్పుడూ సుఖంగానే వుంటాడు. తను కోరుకునే సుఖం సంతోషం ఎప్పటికయినా తనకి దొరక్కపోదు అని గట్టి నిర్ణయంతో జీవితాన్ని సంతృప్తిగానే గడుపుతాడు. ఎటొచ్చీ చిక్కంతా నిరాశావాదితోనే. అతడెప్పుడూ వ్యతిరేక భావాలతో వుంటాడు. జీవితంలో తనకేమీ లభ్యంకాదని, చావుతో తప్ప తన సమస్యలు పరిష్కరించబడవని, జీవనమార్గంలో ఎక్కడ చూసినా చీకటిదారులే, ముళ్లకంపలే అంటూ అర్థం పర్థంలేని మాటలతో, తను కుంగిపోవడమే కాకుండా ఎదుటివారిని కూడా నిరుత్సాహపరుస్తాడు. దొరికినదానితో సంతృప్తిపడక బతికున్నంత కాలం తనకేదో దొరకలేదని, అదింక దొరకదనీ వాపోతూవుంటాడు. అతడి మాటల్లో ఎప్పుడూ నిరాశాపూరిత, వేదనాభరిత పదజాలాలు దొర్లుతూవుంటాయి.

అందరూ తనకన్న ఎక్కువ సంతోషంగ ఉన్నారంటాడు. ఎవ్వరూ తనని ప్రేమించరని భావిస్తాడు. అందరూ తనని అశ్రద్ధ చేస్తున్నారంటాడు. తనకోసం ఎవరికీ 10





మినిషాలు టైము లేదంటాడు. ప్రపంచంలో అందమైన వస్తువే నాకు కనిపించలేదంటాడు. ఈవాళో రేపో చచ్చేదానికి కష్టపడటం మాత్రమెందుకంటాడు. ఎవరు ఏది మాట్లాడినా ఉత్త చెత్త అంటాడు.

అయితే మనస్తత్వ శాస్త్రవేత్తలు చెప్పేదేమంటే నిరాశావాదాన్ని ఏ మనిషయినా తనంతటతనే తగ్గించుకోగలరంటారు. దానికి ముందుగా వాళ్లు చేయవలసినది, నిరాశకి సంబంధించిన పదాలను తమ మాటల్లో తక్కువగా ఉపయోగించడానికి




ప్రయత్నించాలి. అలా చేయకపోతే అది ఇంతింతై అన్నట్టు మనిషిని ఆత్మహత్యకు పురికొల్పుతుంది. దీనినుంచి బయటపడటానికి సదరు వ్యక్తి మొట్టమొదట చేయవలసినపని ఏమంటే ఆశావాదం, నిరాశావాదం అంటూ రెండు లిస్ట్‌లను తయారుచేసుకోవాలి. 'ఎ' లిస్ట్ ఆశావాదమనుకోండి, 'బి' లిస్ట్ నిరాశావాదం. మృత్యువు, అసాధ్యం, చీకటి వగైరాలన్నీ 'బి' లిస్ట్‌లో చేరితే వాటికి ప్రతికూల పదాలన్నీ 'ఎ' లిస్ట్‌లో చేరతాయి. రాత్రి పడుకోబోయేముందు రెండు లిస్ట్‌లనూ దగ్గర పెట్టుకోవాలి. ఆరోజు తాను ఏ లిస్ట్‌నుంచి ఎన్ని పదాలను ఉపయోగించినదీ గుర్తు చేసుకోవాలి. క్రమంగా ఆయా పదాలను తగ్గించుకుంటూ లేదా పెంచుకుంటూ ఆశావాదాన్ని అవలంభించాలి. నిరాశావాదులతో స్నేహం చేయడం, వారితో ఎక్కువగా కలిసివుండటం ప్రమాదమే. చేతనయితే వారిలో కూడా ఆశావాదాన్ని ప్రేరేపించాలి. ఎప్పుడూ నవ్వుతూ నవ్విస్తూ హుషారుగా వుండేవాళ్ళతో సాధ్యమయినంతవరకు కలిసి వుండటానికి ప్రయత్నించాలి.

జీవితం అంటే పడుగూ పేకలాంటిది. ఎప్పుడూ కష్టాలే వుండవు. ఎప్పుడూ సుఖాలూ వుండవు. అందుకే రెండింటిని సమానంగా తీసుకుని ఆనందంతో బతికితే అతడు పూర్ణాయుర్దాయవంతుడే అవుతాడంటారు వైద్యులు. శారీరకరోగాలు కూడా మానసిక పరిస్థితిపై ఆధారపడి వుంటాయంటారు వైద్యులు. మనసును నిమ్మదిగా పెట్టుకుంటే శరీరం ఎప్పుడూ ఆరోగ్యంగానే వుంటుందంటున్నారు వైద్యులు.

# చతుర

సంపుటి : 20
సంచిక : 5
జూన్ : 1997

"చదువుకుంటాను బాబా..." అంటే "గొడ్లు కాయరా బాబూ!..." అని బతిమాలే తండ్రి...

ఆకలి, చిత్రహింసలకు కారకుడైన తాగుబోతు భర్త చావును మనసా, వాచా కోరుకునే భార్య...

మండే ఎండల్లో అగ్నిహోత్రుడికి ఆహుతైన గుడిశెలవాళ్లు రేపుగాక నేడు గడిచేదెలా అని అలమటించే ఆక్రందనలు...

కాసుకి కక్కుర్తిపడితే, ఒకడుగాక నలుగురి చేతపడి రాక్షసరతికి ఆహుతయిన నిర్భాగ్యురాలి వేదన...

లక్షలనుండి కోట్లకు ఎదిగే క్రమంలో మలుపులు తిరిగే రాజకీయవేత్తల పద్మవ్యూహాలు...

విభిన్న తరగతుల యధార్థజీవిత చిత్రణతో...

'చతుర' నవలల పోటీలో ప్రథమ బహుమతి పొందిన

## కామరాజు బ్రహ్మానందరావు రచన

# వేదనభూమి

ఈ నెల చతుర సమగ్ర నవల.



బస్తీకి కూతవేటు దూరంలోని ఎర్రమట్టి రోడ్డుకిరువైపులా ఏపుగా పెరిగిన సరివి తోటలు గాలికి నిదానంగా వూగుతున్నాయి. వాటి వెనకాల ఉన్న గున్నమామిడి తోటలు పూతపూసి పరిమళాలు వెదజల్లుతూ, నిండుగా బారులు తీరివున్నాయి.

ఆ తోటల పక్కన విశాలమైన చెరువు ఎండలో మెరుస్తూ నవ్వుతున్నట్లుంది. అందులో పది గేదెలు, విశ్రాంతిగా మోర లెత్తి పడుకుని ఉన్నాయి. గట్టున ఓ పదేళ్ళ బుడ్డోడు నిలబడి, ఆదుర్దాగా, దూరాన్న మెరకమీద ఉన్న గుడిసెలవైపు చూస్తు న్నాడు.

బక్కపల్చగా, నల్లగా, రెండు మూరల ఎత్తున్న ఆ బుడ్డోడి చేతిలో గొడ్లని అజమా యిషీ చేయటానికీ చద్దిబువ్వ మూట భుజాన తగిలించుకోటానికీ పనికొచ్చే మూడు మూరల సన్నటి వెదురుకర్ర వుంది.

ఆ గుడిసె బయట క్రమంగా జనం పోగౌతున్నారు. గుడిసె లోపల్నుంచి ఓ పెట్టెపట్టుకుని అక్క, తండ్రి, తల్లి బయటకొ చ్చారు.

"ఒరే బాలకిట్టాయ్‌గో, రారే, రా... రా" అని కేక వినిపించింది. ఆ కేక వినిపించ గానే, వాడి మొహం కళకళలాడినా ఆ వెంటనే విరక్తితో మాడిపోయింది. జారిపో తున్న నిక్కర్ని పైకి లాగి మొలతాడుతో మెలేశాడు.

"ఒరే! బాలకిట్టాయ్‌గో, రారే" అని తండ్రి కేకేశాడు. ఐనా అడుగు ముందుకు పడ లేదు. తలమీద చెయ్యివేసి గరుకుగా ఉన్న గుండు తడుముకున్నాడు.

నిన్నగాక మొన్న గుడిసెలకాడికి మంగలి రంగయ్యొవస్తే, పదేళ్ళ బాలకిష్టడిని, పదేళ్ళ సీతారావుడిని లాక్కొచ్చి కూర్చోపెట్టి నున్నగా బోడిగుండ్లు చేయించాడు సీతన్న.

"బాలకిట్టాయిగో రారే" మళ్ళీ కేక వినిపిం చింది.

బాలకిట్టాయి చిరాగ్గా చెరువువైపు చూశాడు. బర్రెలు మోరలెత్తుకుని ఆనం దంగా తేలిపోతున్నాయి. ఇప్పట్లో చెరువు వదలి గట్టెక్కేట్లులేవు.

బాలకిష్టడు, అయిష్టంగానే బయలుదే రాడు. వాడికి అమ్మ అయ్యలమీద చాలాకో పంగా వుంది. అనసూయక్కను బస్తీలో హాస్టల్లో పెట్టిచదివిస్తున్నారు. దానికి మంచి లంగాలు, జాకెట్లు కుట్టిస్తూ గారాబంగా చూసుకుంటారు. తననేమో మూడోక్లాస్ కాగానే బడి మానిపించి, గొడ్లు కాయమని కర్ర చేతికిచ్చి, ఎండవానల్లోకి తోలేశారు.

బాలకిష్టడు గుడిసెలు సమీపిస్తూ, కష్టం మీద ఏడుపు ఆపుకుంటున్నాడు.

దగ్గరకు రాగానే "పెట్టెత్తుకో. డొంక బాట కాడికిపా. ఎనక మేం వత్తాం" అన్నాడు రోగిష్టిమారి సీతయ్య.

తండ్రి మాట పూర్తికాకముందే అమాంతం నేలమీద కూలబడి ఏడుస్తూ తన అసంతృప్తిని ప్రదర్శించేడు.

చుట్టుపక్కల గుడిసెల్లోని పిల్లాజల్లా వచ్చి చుట్టూ పోగవుతుండగా "పెట్టెత్తకెళ్ళరా! నన్నరిపించకురా" అని కీచు గొంతుకతో అసహనంగా అనేసి ఆయాసపడిపోయాడు తండ్రి.

బాలకిష్టాయ్ నేలమీద బోర్లాపడి ఏడుస్తుండగా, సీతన్న నడుములమీద చేతులు వేసుకుని అసహాయంగా, నీరసంగా, విషాదంగా చూస్తున్నాడు.

గుడిసెలోంచి చెంచమ్మ బిరబిరా వచ్చి కొడుకుని లేవతీసి, చెంగుతో దుమ్ముదులిపి కన్నీళ్ళు తుడుస్తూ "మా అయ్యగా, పెట్టెత్త కపా" అని బతిమాలింది.

"నేను సతువ్‌కుంటా! నన్ను సతివిం

చందే"

"అట్నే సతివిత్తాం. పెట్టెత్తుకో"

బాలకిష్టడు ఏడుపు ఆపి కళ్ళు తుడుచుకుంటూ, అనసూయక్కను చూస్తూ నిలబడ్డాడు.

"అమ్మాయ్, బాగా సతువు. బడి చెప్పే అయ్యోరమ్మవు అవుతావో, ఆస్పత్రి కాడ నర్సమ్మ సేస్తావో, నీ యిష్టం, పొద్దాక ఏం సెప్పేది" అని తల్లి కూతురుకు సుద్దులు చెప్పింది.

"ఇహ పదండసే. పెట్టెత్తుకోరా కిట్టా" సీతన్న కీచుగొంతు ఆజ్ఞాపించింది.

"నేనెత్తుకోనుపో, నీవే ఎత్తుకెల్లు"

"ఎప్పట్నుంచే ఎదిరిత్తం నేర్చావ్. తప్పుడునాకొడకా. నీ మకురుతనం వొదిలిత్తా"

"నన్ను సతివియ్యి"

సీతన్న బూతులు లంకించుకుని కొడుకుని కొట్టబోయాడు. బాలకిష్టడు చెంచమ్మ వెనకాల నక్కేడు. చుట్టూ చేరిన పిల్లమూక చప్పట్లు చరిచి ఈలలేశారు. సీతన్న ఆయాసపడుతూ నిల్చున్నాడు.

ఆ గుడిసెల్లో జనాలకి ఈ కీచులాట, శీతాకాలపు ఎండలో, గిలిగింతలు పెడ్తూ కాలక్షేపంగా వుంది.

అనసూయ ఆకుపచ్చలంగా, తెల్లజాకెట్, పసుపురంగు ఓణిలో ముస్తాబై వుంది. ఆరో క్లాసనుండి హాస్టల్లో వుండి చదువుతూ, శలవులకి వచ్చి తల్లీతండ్రీ. తమ్ముళ్ళను చూసి పోతూ పదోతరగతిదాకా నెట్టుకొచ్చింది.

తన యీడు పిల్లలు తనను శ్రద్ధగా, గమనిస్తున్నందుకు బాలకిష్టడు మరీ రెచ్చిపోయాడు.

సీతన్న కొడుకుమీద అరచి అరచి ఆయాసపడుతూ, "ఓరే బాలకిట్టా, నీకు నా సేతిలో మూడిందియాల నాకొడ్కా" అని అరిచాడు.

"నన్ను ఆస్టల్లో ఏపియ్, సతువుకుంటా, నా వూసే నీకొద్దు"

"సేరిపిస్తానన్నాగా. అయ్యా. నా మాటినుకో. నాకు శానా సాలొచ్చేసింది. నన్ను సతాయించబాక" సీతన్న బతిమాల్తూ అన్నాడు.

అలసిన బాలకిష్టడికి తండ్రి మాటమీద నమ్మకం కల్గింది. తన తడాకా ఆ పోగైన జనాలకి చూపించాలనే కోర్కె కల్గింది. చేతిలోని కర్రతో, నేలమీద చరిచి "నేనిగను గొడ్లను గాయను ఫో. సతువుకుంటా, ఆస్టల్లో సేరి సతువుకుంటా" శపథంపలికి లేచాడు.

పెట్టె దగ్గరకు నడిచి తల గుడ్డచుట్టి పెట్టె నెత్తికెత్తుకుని ముందుకు అడుగులేశాడు. చెంచమ్మ నవ్వుకుంటూ, కూతురు పక్కన నిదానంగా నడుస్తున్నది. కోతల కెళ్ళిన వ్యవసాయ కూలీలు చకచకా యిళ్ళకు తిరిగొస్తున్నారు. దూరంగా బస్ హారన్ వినిపించింది. బాలకిష్టడు అక్క పాత డొక్కు పెట్టెత్తుకుని డొంక బాటన పరుగులంకించుకున్నాడు. దుమ్ము రేపుకుంటూ బస్సొచ్చి ఆగింది. అనసూయ బస్సెక్కింది. బాలకిష్టడి నెత్తిమీదనుంచి పెట్టె అందుకుంది. సీతన్న కీచుగొంతుతో "భద్రం, బాగా సతూంకో. జాగ్రత్త" అన్నాడు. చెంచమ్మ కళ్ళలో ఆదుర్దా, ఆనందం, బాలకిష్టడి కళ్లల్లో నీళ్ళు మెరుస్తుండగా బస్ బస్తీ వైపు కదిలింది.

సీతన్న కీచు గొంతుతో సణగటం మొదలుపెట్టేడు.

"చేసిన బాకీలు ఎట్టా తీరతయ్. పొద్దుకూకుల బడికెల్లి సతువుతానంటవ్. నీకు మూడు పూట్లా బొచ్చెలో బువ్వేడనుంచొస్తతిరా"

బాలకిట్టాయి అమాయకంగా చూశాడు.

"నే సతువుకుంటా. బడికెళ్తా గొడ్లకా యను పో" అని ఏడుపు లంకించుకున్నాడు. సీతన్న గుడిసె దారి పట్టేడు. చెంచమ్మ బతి మాలుతూ, కళ్ళ నీళ్ళు తుడిచి,

"యీపాలికి చెరువుకాడికెళ్ళి పోరే కిట్టా. వీరయ్య కాపు యింట్లో బువ్వ తిని గుడిసె కొచ్చెయిలె, మా అయ్యగా పద. గొడ్లెటన్నా ఎల్తాయ్" అంటూ బుజ్జగించింది.

బాలకిష్టడు, సణగతా చెరువువైపు లగె త్తాడు.

★ ★ ★

చెంచమ్మ పదేళ్ళ కిందట బస్తీలో లాయర్ గారింట్లో పాచి పని చేసేది. సీతన్న సైకిల్ రిక్షాతొక్కేవాడు.

అప్పట్లో వాళ్ళ పని కాస్త జోరుగా వుండేది. మూడుపూట్లా కడుపునిండా కూడు వుండేది. ప్లీడర్‌గారు, పాతచొక్కాలు, పంచలు సీతన్న అడగ్గానే యిచ్చేవాడు. ఆయన భార్య గూడా చెంచమ్మని కని పెట్టి వుండేది. ప్లీడర్ రెండో అమ్మాయి మంజుల, చెంచమ్మ కూతురు అనసూయ ఐదేళ్ళ పిల్లలు.

మంజుల పట్టు పరికిణి, పట్టు జాకెట్ తొడుక్కుని పూల్జడేసుకుని అక్షరాభ్యాసం రోజున, కొత్త పలకమీద ఓంనమఃశివాయ దిద్దించుకుని, వాళ్ళమ్మ వొళ్ళో కూర్చుంది.

చెంచమ్మ నా దృశ్యం ప్రభావితం చేసింది.

"మన అనసూయకి సతువు సెప్పిద్దాం" అంది. ఐదు రూపాయలు సంపాదించి రిక్షాషెడ్‌లో యిచ్చేసిన సీతయ్య, కళ్ళమీద నిద్ర ముంచుకొస్తుండగా "అట్నే" అని చాప మీద బొక్కబోర్లా పడుకుని నిద్రలోకి జారి పోయాడు.

చెంచమ్మ తన మనసులోని కోర్కెను ప్లీడరు భార్య మాణిక్యమ్మ చెవినేసింది.

"అంట్లుతోమేదాని కూతుర్కి గూడా చదువూ, పూలజడానా? ఔరా! పులిని చూసి నక్క వాతపెట్టుకున్నట్లుంది గాని మరోలా లేదు" అని చీవాట్లేస్తుందేమో అని భయపడ్డది చెంచమ్మ.

మాణిక్యమ్మ ఆశ్చర్యంగా కళ్ళు పెద్దవిచేసి "అవునే చెంచమ్మా మీ పిల్లగూడా మంజుల తోటిదేగా దానిచేత పలకా బలపం పట్టించు. వృద్ధిలోకొస్తుందేమో చచ్చింది యింకేం పూలు పూస్తుందనుకున్నామా ఆసన్న జాజితీగే నిత్యం నీళ్ళుపోస్తూ పాదు చేసి వదిలేప్పటికి చూస్తువుండగానే చిగుళ్ళు, రెమ్మలు ,కొమ్మలు వేసిందా! పందిరేశామా! యిప్పుడు విరగబూస్తున్నదిగా! ప్రతీదీ అంతే! మన సంకల్పం మంచిదై మన కృషి చక్కగా వుంటే ఫలితాలు గూడా బావుం టాయి" అని జీవిత సత్యాన్ని గుర్తుచేసింది.

మాణిక్యమ్మ ఆశీర్వదించినట్లుగానే అన సూయ సన్నజాజి తీగలాగా చదువులో అల్లుకుపోతున్నది.

పలుకుబడితో హాస్టల్లో సీటు సంపాదిం చుకుని, అవాంతరాలను దాటుకుంటూ పదో తరగతిలోకొచ్చేసింది, అనసూయ.

ఈమధ్యలో చిక్కులు వచ్చి పడ్డాయి.

సీతన్న కుటుంబానికి అంత అండ మళ్ళీ దొరకలేదు. పీడరు గుమస్తా హనుమయ్య సీతన్నకు చిల్లరమల్లర నోటిసహాయాలు చేస్తుంటాడేగాని అండగా వుండలేని స్థితి ఆయనది. పులిమీద పుట్రలాగా సీతన్న రిక్షాని లారీ గుద్దేసింది. ఆ ప్రమాదంలో సీతన్న పదిరోజులు హాస్పిటలు పాలైనాడు.

రిక్షాలో కూర్చున్న నడికారు మనుషులిద్ద రికి బాగా దెబ్బలు తగిలి నెల్రోజులు హాస్ప టల్లో కట్లు కట్టించుకుని పడుకున్నారు.

రిక్షా మాత్రం రూపం కోల్పోయి మెలికలు




గిరిగి నజ్జు నజ్జైయింది.

సీతన్న హాస్పటల్లో వుండగా, పోలీసులబె డద, రిక్షా యజమాని బెదిరింపులు, తట్టుకో లేకపోయాడు. లారీ ఓనరు వెయ్యి రూపా యలిచ్చుకుని పోలీసులనుండి, రిక్షాయజ మాని నుంచి తనను తాను రక్షించుకు న్నాడు. పోలీసులంటే సీతన్నకు, అతని తండ్రికి అమిత భయం. యిప్పుడు కొత్తగా రిక్షాయజమాని వచ్చి అదరకొడ్తున్నాడు. రిక్షా సీతన్న నిర్లక్ష్యం, అసమర్థతవల్ల నాశ నమైంది. కాబట్టి రిక్షా ఖరీదు కట్టమని హాస్పటలుకొచ్చి సతాయించాడు.

అసలది డొక్కురిక్షా, దాన్ని గతిలేక సీతన్న లంకించుకున్నాడుగాని మరో డ్రైవర్ దాని మొహం వంక చూడడని సీతన్నకూ, ఓనరుకూ తెల్సు. ఆమాటే సీతన్న అనేప్ప టికి రిక్షా ఓనర్‌కు మహాకోపంవచ్చి "ఈటౌన్లో నీకు రిక్షా దొరకదు నా కొడ్కా నేతల్చుకుంటే ఏందనుకుంటున్నావో" అని మీసం మెలేశాడు.

ఆమాట నిజమే. అప్పట్లో రంగయ్య నలభై రిక్షాలకు ఓనరు. ఆయన రిక్షాషెడ్డె పుడూ సందడిగా వుండేది.

రెక్కాడితేగాని డొక్కాడని బక్క జనం రిక్షా కార్మికులు రంగయ్య కాళ్ళావేళ్ళాపడి రిక్షా సంపాదించుకుని, కుటుంబాలను పోషించుకునేవాళ్ళు ఎక్కువ మంది ఏనా దులే! ఆయన షెడ్‌లోనే రిక్షాలు తీసుకునే జనం వాళ్ళు. పైగా ఆయన, మున్సిపల్ కౌన్సిలర్! రిక్షాలవల్లే బాగుపడ్డాడు. డాబాక ట్టేడు. టాక్సీలు నడిపాడు. పోలీసులతో సత్సంబంధాలున్నాయి. ఫలితంగా సీతన్న హాస్పటల్నుంచి బయటపడి రోడ్లపాలైనాడు.

"నా కొడకా! నేతల్చుకుంటే నీకీ టౌన్లోనే రిక్షా దొరకదు. బికారిముండాకొడకా! నూట యాభై యిస్తానని నోటు రాయి. రిక్షా నా షెడ్లోది వేసుకో. అద్దెతోపాటు రూపాయి కల్పియివ్వు. నోటు చెల్లపెట్టుకో" అని ఓన ర్‌గారు సలహా యిచ్చాడు. నోటు రాయ మని షెడ్‌లో నిలేశాడు.

ఈ విషయం రిక్షా యూనియన్‌కి తెల్సింది.

వాళ్ళు రెండొందల మంది, ఎర్రజండాలూ పుకుంటూ, రంగయ్య రిక్షా షెడ్ వెదురు కర్రల తలుపును వూడపీకి లోపల కొచ్చి సీతన్నను తీసుకొచ్చేశారు.

ఆ సంఘటనకు రంగయ్య బెదిరాడు. రిక్షా కార్మికులకు నాయకత్వం వహించిన బాషా అతను రిక్షా కోటయ్య షెడ్‌లోని వాడు. రంగయ్యకు నలభై రిక్షాలుంటే కోట య్యకు డెబ్బయి రిక్షాలున్నాయి. రిక్షావా ళ్ళతో కలుపుగోలుగా, ఉదారంగా ప్రవర్తి స్తాడు.

సీతన్నకు మంచి రిక్షాయిచ్చి తోలుకోమ న్నాడు కోటయ్య.

సీతన్న కొంతకాలం పళ్ళ బిగువున రిక్షా తొక్కేడు. వేసవి గాడ్పుల కాలం వచ్చే సింది. రిక్షా పగలు వెయ్యలేకపోతున్నాడు. రాత్రిళ్ళు నిద్రకాయల్లేకపోయాడు.

"ఒరేయ్ సీతన్నా, మనకి యీ రిక్సాలచ్చి రావురా, పదెకరాల సరివితోట కొట్టుడు చాన్సొచ్చిందినాకు, నీవు వత్తావంట్రా?

ఆడే ఆ కాలవకట్టమీనే గుడిసెలేసుకో వచ్చు సర్వి తోపులు నరుక్కోవచ్చు చేతి నిండా పన్లు దొరకతయి. కాలవుంది. చేపల వేటకెళ్ళొచ్చు, దాపునే మామిడితోటలుం డాయి. కాపలాకి కుదరొచ్చు వరి చేలు న్నాయి ఎలకలు పట్టుకోవచ్చు తాటితోపు లుండాయి. కమ్మటి నికార్సయిన కల్లు చవగ్గా దొరుకుద్ది. యింతకంటే యింకేం కావాల్రా సిన్నాన్నా. నీకంటే చిన్నోడ్నే, ఒప్పుకున్నా, నా మాటాలకించిరా నాతోరా" అని చెవినిల్లు కట్టుకుని చెప్పాడు నర్సయ్య. సీతన్న చిన్నతాత మనవడువాడు.

సీతయ్య మెత్తబడ్డాడు.

నర్సయ్య నవ్వుతూ "ఆ కాలవకట్ట మీంచి సూస్తే ఈ బస్తీమీని సినిమా హాలు లైటు గూడా ఆపట్టది. బస్తి గూడా దగ్గిరే చీటికి మాటికి సిల్మాలకెళ్ళొచ్చు, బాగా ఆలోసించుకో. నీవు రిక్షా తొక్కలేకుండున్నావా! నీ ఆరోగ్గెం సెడిందిగా. నీ భార్యతో కూడపలుక్కోని సెప్పు" అంటూ బాగా పురెక్కించాడు.

సీతన్న ఈ మాట చెంచమ్మ చెవినేశాడు. అపుడు చెంచమ్మ బాలకిష్టడ్ని కడుపుతో వుంది. సీతన్న చెప్పిందంతావిని, నర్సిగోడు చెప్పింది సబబుగానే వుందనేసింది.

"కాలవకట్టమీదెకే పోదాం ఆడ మనాళ్ళ కొంపలుండాయి. ఆడ రద్దీ వుండదు. బతకలేక పోతావా? నీవు రిక్సాలు ఎయ్యలేకుంటివి. రేత్తిళ్ళు నిద్దర కాయలేకుంటివి. ఆడకేపోదాం పద" అన్నది.

ఆ తర్వాత వారం తిరక్కముందే కాలవ కట్టమీద నాలుగు కొత్త గుడిసెలు తల ఎత్తినయి.

సర్వితోటల కొట్టుడు పని దొరికింది. చెంచమ్మ సీతన్న కల్సి, సరివి మొదళ్ళు పెకళించి, పేళ్ళేసి, మోపులు కట్టి, బస్తీమీదకొచ్చి కట్టెలమోపు లమ్ముకుని పొట్టలు గడుపుకునేవాళ్ళు. చేపలు పట్టేవాళ్ళు. మామిడి తోపులకు పళ్ళ సీజన్లో కాపలాలుండేవాళ్ళు. కొత్త కొత్త తరహాల్లో బతుకులీడుస్తూ, నెలలను ఏళ్ళను గడిపేస్తున్నారు.

కర్రా కంప పోగేసి, కట్టెమోపులు కట్టి, నెత్తికెత్తుకుని బస్తికెళ్ళి, అమ్ముకొచ్చేది చెంచమ్మ. సీతన్న పక్కనుంటే ఆడికంటే ఎక్కువ చాకిరి చేసేది చెంచమ్మ.

రెండేళ్ళకిందట అగస్మాత్తుగా ఓ రైసు మిల్లు లేచింది. అందులో ఆడకూలిగా చేరింది. రోజూ మానెడు బియ్యం యిస్తారు. చెంచమ్మ చాకిరితోనే మూడు పూట్లా వాళ్ళంతా బువ్వతినగల్గుతున్నారు.

ఆ పైనొచ్చే రకరకాల కుటుంబ తాకిళ్ళకి పిల్లోళ్ళని గొడ్లకి మలిపి, ఆసాముల్దగ్గిర అప్పులు తెచ్చుకుని నెట్టుకొస్తున్నారు. సీతన్న రోగిష్టి మారోడైనా, చేపలు, కప్పలు పట్టటానికి తయారై, పదిరోజులు పాటుపడి యిరవైరోజులు మంచానపడి మూల్గుతుంటాడు.



బాలకిట్టడు గొడ్లను కాల్వకట్టమీదకు తోలుకెళ్ళకుండా, ఎగ్గొట్టి తిరుగుతున్నాడు. సద్ది బువ్వదుత్త, పొయ్యికాడ పార్నొకి అయిపు లేకుండా పోయాడు.

సీతారావుడు, సద్దినీల్లు తాగి, చేతికర్ర పట్టి, అన్న చొక్కా తొడిగి గొడ్లు తోలుకెళ్ళటానికి, ఆసావులిళ్ళ ఛాయలకు పరిగెత్తాడు.

బాలకిట్టడికి తొడుక్కోటానికి వేరే చొక్కా లేదు. వీపుమీద బదాబదల్లా చినిగిన నీలం చొక్కా వాడ్ని చూసి నవ్వుతా వేలాడుతుంటే బాలకిట్టడికి రోషం ఏడుపు పెగుల్చుకొస్తున్నాయి.

"మా బాబుగా దాన్నే తగిలించుకుపో. రేపు బస్తీమీదకెళ్ళి ఎర్ర బనీను, పచ్చ బనీను తెత్తాగా, కొడకా!" అంటూ తల్లి గడ్డం పట్టుకు బతిమాల్తుంటే వాడు మొరాయిస్తూ, ఏడుస్తున్నాడు. సీతన్న పొయ్యి

కాడకూకుని చలికాచుకుంటూ "లంజొొడహ, నేను నీ వగిసులో బెత్తెడు గోచి పెట్టుకొని తిరిగారా లంజొొడహ. నిక్కరి, సొక్కా మొగం ఎట్టాంటిదో తెల్వదు. కమ్మటి సొక్కా ఏసుకెళ్ళటానికేం తెగుల్రా? సిన్నోడు పాపం సర్దాపడీ పూటకి నీ సొక్కా ఏసుకెల్తే ఆగం సేత్తున్నావా భాంచెత్" అంటూ పెద్దరికం చేశాడు.

"నాకు నిక్కరి గూడా లేద్రా నీయమ్మ...

అని బాలకిట్టడు తండ్రిని తిట్టి, గోచినే బిర్రుగా బిగించి మొలతాడుకి వెనక వైపున బాగా రెండు చుట్లు మెలిపెట్టి, పెద్ద అంగలు రెండేసి, వేలాడే చొక్కాను సర్రున లాగి మీదేసుకుని, గుడిసెలోంచి బయటకొచ్చేసి "నేను గొడ్లకాడి కెగనూకతున్నా, కూడుతిన్ను, బువ్వదుత్తా వద్దు పోండి" అంటూనే బూతులు తిట్టా బిరబిరా పెద్ద పెద్ద అంగలేసుకుంటా ఆ గొడ్లకాడ బుడ్డోడు సమ్మె ప్రకటించేసి, ఎండిపోతున్న కాలవకడ్డంబడి, విశాలమైన ఆరుబయల్లోకి పారిపోయాడు. గుడిసెలో గొంతుక్కూచుని వీడి పోకడ చూస్తువుండిపోయాడు సీతన్న.

చెంచమ్మ సీతన్న మీదకి గయ్యిమని లేచింది.

"నేనేదో ఆడ్ని బామాలి, సద్దిదుత్త చేతికిచ్చి మంచ్మాటలు సెప్పి ఆడ్ని ఆసావుల గొడ్లకాడికి మళ్ళేత్తుండగా మద్దిన నీ పితకలాటం ఏందీ? ఆడ్కి తిక్కరేగే కూతలు కూస్తివి. విప్పుడెట్టా? ఆసావులు బూసావుల గొడ్లు ఆడ పలుపుతాళ్ళు గుంజుకునూ కుతుంటాయా? ఆటి సంగతేవిటి మరి సెప్పు" అని పెనిమిటిని నిలదీసింది.

"నేనేమన్నానే నీయమ్మ. ఆడ్ని ఎనకేసు కొత్తావ్. ఆడ్ని నీవే సెడనూకేవ్. ఆడికి గోచితో తిరగటానికి నామోషా. వరెవా? కాలం ఎట్టా చెడిపోతోంది. మేము పెళ్ళీడు వగిసులో గూడా గోచి పోసుకునే తిరిగే టోల్లం. వీడికి నిక్కరి, అంగి, బనీనా, కాలికి సెప్పులా? ఈడు ఏనాదినా కొడకా? కాపోరి కొడుకా? " అని చాలెంజి చేశాడు.

"పొయ్యి కాడ్నుంచి లెగ్సి ఆడ్ని పట్టకరా ముంగల, వాడయిపు లేకుండా లగెత్తతాడు. బిర్నపో ముంగల"

"నీయమ్మ. తప్పుడు.. జా, తప్పుడు నా కొడకల్లారా" అంటూ, గుడిసెలోంచి మోకాళ్ళమీద వంగొని నడుస్తూ, బయట పడి, దూరంగా, సన్నగా నేలకి మూరెడెత్తున, చేతులూపుకుంటా బిరబిర్న పోతున్న గోచిపాతరాయుడ్ని కోపంగా, అసహనంగా, దిగులుగా, బాధగా చూస్తూ, "వొరే బాలకిట్టాయిగో. రార్రే" అని అరస్తా వాడెనకాల పడ్డాడు.

వాడు లగెత్తటం ప్రారంభించాడు. సర్వి తోట దగ్గరకెళ్ళనే వెళ్ళాడు. యింకో యాభై అంగల్లో, సర్వితోటలో దూరాడో కంటికి దొరకడు. చేతికసలు చిక్కడు.

"బాలకిట్టా నా కొడకో నీ గోరికట్టా. ఆగు ఆగరే... ఆగసే..."

బాలకిట్టడు ఆగేడు. ఆగి సీతన్నకు ఎదురుగా తిరిగి గోచిని చేత్తో చూపిస్తూ యిదిగో యీడికి కట్టు. దా" అనేసి వెనక్కి తిరిగి పరుగు లంకించుకున్నాడు. సీతన్న చూస్తూవుండగానే సర్వితోపులోకి ఎలుక లాగా దూరి కనుమరుగైనాడు.

సీతన్నకి కొడుకు మీద కోపంవచ్చింది. వాడి వుషారుకు నవ్వువచ్చింది. వీడీ రోజు తోపులంబడ, కంచలంబడ, కంపల్లో కాకి లాగా తిరిగి తిరిగి మధ్యాహ్నానికొస్తాడని తెల్చుకుని తను తన చిన్నతనంలో హాయిగా కాల్వలంబట, చెరువు కట్టలపైన, గనిగుంటలో, ఏటిచాయలో, ముంతమామిడితోపుల్లో, పొదల్లో, తాటితోపుల్లో ఎట్లా



తిరిగేవాడో! పుల్ల గంజినీళ్లో, నూకలసం గటో రాగంబలో తాగికడుపు నిండా ఎండ గాట్పుల్లో, ఘుంచులో, వానలో చేపలు పడుతూ ఎల్కలు, పందికొక్కుల కలుగుల్లో చేతులు పోనిచ్చి పట్టుకుని వేటాడేవాడో గుర్తుచేసుకున్నాడు. భుజంమీద పలుగు పెట్టుకుని తలగుడ్డపీలిక మొలకోపాతపీలిక చుట్టుకుని, చిట్టడవుల్లో, పొదల భూముల్లో, పొలంగట్లమీద పావులకు నక్కలకు బెదర కుండా బలాదూర్‌గా తిరిగేవాడు. చీకుచింతలు ఇప్పట్లా మనసుకు పట్టేవేకాదు. ఇప్పుడన్నీ పీకులాట్లే, పెనుగులాటే. మాయదారి బతుకైపోయింది.

సీతన్న కొడుకు వూసువదిలేసి తన చింతలాలోచిస్తూ పోరంబోకు బీడు భూమికడ్డంగాపడి దోవడొంకల్లేని ఆలోచనలతో కాళ్లు నడిపించినట్లల్లా నడుస్తూ బస్సులాగే సెంటర్లోకొచ్చాడు.

అక్కడ సీతన్న చూపు ముందుగా ప్రభుత్వ సారా దుకాణంమీద వాలబోయి మానేసి దాని కుడిపక్కనే కొత్తతాటాకుల పాక కనిపించగానే దానిమీద వాలి, అటూ యిటూ పొర్లాడింది.

సీతన్న మొల్లో పదిపైసలు గూడాలేవు. వంటిమీద చొక్కాలేదు. చెవుల్లో ఎంగిలిబీడీ మాత్రం వుంది.

చెంచమ్మ పాత చీరెముక్క తలకుచుట్టుకున్నాడు. అందులో పొగాకు కాడ ముక్కలు మూడో నాలుగో తుంపులున్నాయి. చేతులు వెనక్కి కట్టుకుని బక్కపీనుగలాగా నిలబడ్డాడు. చకాచకా నడ్చినందువల్ల రొప్పుగా వుంది. తనలో చావగూడా

చస్తుంది. ఒళ్లసలు కష్టం చేయలేకోపోతోందని గ్రహించాడు. గుక్కెడు కల్లుకు మొహంవాచిపోయే స్థితి దాపురించింది భగవంతుడా! అని పరితపిస్తుండగా "ఏందోయ్ బామర్దీ! సెంటర్లో నిలబడ్డావ్. చెవులో వెంగిలి బీడీ పెట్టి కప్పలు పట్టటం లేదా ఏనాదీ? " అంటూ హాస్యంగా పల్కరించాడు పోలయ్య.

"ఒరే పోలిగోవ్! వుద్యోగం చూసుకుని మిడ్సిపడగాకరా. నీవు కావిల్లో యీదిలంబడి బీడీ ముక్కలేర్రినావుగ్రదా బామర్దిగా. సరేగాని శాన కుశాలమీనుండావ్, కల్లు తాపించు నీ కడుపున పుడతా!"

"అట్నే తాపిత్తారా. అక్క బాగా సేకిరి సేసి సంపాదిత్తాందిగా! నా అల్లుల్లు ఆ సావుల కాడ బతుకుతుంద్రగా! అనసూయ ఆస్టల్లో సదువుతుండే. నీ కేవిరా బామర్దీ"

అని పోలయ్య సీతన్న తలగుడ్డ వూడలాగి గాలిలోకి యిసిరేశాడు.

పోలయ్యతోపాటు వచ్చిన నలుగురు ఏనాదులు నవ్వి, సీతన్నని ఆట పట్టించటానికి తయారై ఆ గుడ్డముక్కను సీతయ్యకు దొరక్కుండా ఒకడు దాన్నిపైనే పట్టుకున్నాడు.

కల్లు తాగబోతున్నాననే కుషీలో సీతన్న ఏమీ పట్టించుకోకుండా చిద్విలాసంగా నవ్వుతూ వాళ్ల కోతి వేషాలను వాళ్లకే ఒదిలేసి వాళ్లందరికంటే ముందుగా వెళ్లి కల్లు పాకలో చతికలపడ్డాడు.

తనపక్కనొచ్చి కూర్చున్న పోలయ్య చెవిలో "కప్పల సావుకారుకాడ పదిరోజుల

కూలి, రెండొందల యాభై దిగపడిపో యింద్రా తంద్రే. అందువల్ల గడవటం శాన కట్టంగుంద్రా. మీ అప్ప శాకిరిమీన నెగ్గు తుండా. నా సేతిలో రూపాయ సూసి వారంగావొత్తుంద్రా! పోలిగోవ్ నీవు నమ్మ తావోలేదోగాని..." సీతయ్య గొణిగాడు.

కల్లుముంత అందుకుని "నీవబద్ధం ఆడ వని నాకు తెలీదంట్రా బామర్దీ. ముంగల గొంతు తడుపు" పోలయ్య సీతన్నని ప్రోత్స హించాడు.

సీతన్న గటగట తాగేసి ముంతకింద పెట్టి నాలుకతో పెదాల్ని తుడుచుకుని తన ఎదురుగా కూర్చున్న సుబ్బడి భుజంమీ దున్న తన తలగుడ్డ ముక్కను అందు కుంటూ "సుబ్బోవ్, కాకినిక్కరు చొక్కా మీన పోలీసోడి అమ్మ మొగుడ్లా వుండావసే" అన్నాడు.

"బూట్లులేవుగదే మావా" అని నిరుత్సాహ పడ్డాడు సుబ్బయ్య.

"సర్కారోళ్లు యియ్యర్రా అల్లుడా మీకు!"

"ఆళ్లు సెప్పులిత్తారసే, మూడు జతల కాకి డస్ యిత్తారు సంవత్సరానికోపాలి"

"నాకో చొక్కాపొద్ది పార్నూకంద్రా సలికి సత్తన్నా" సీతన్న అందర్నీ కలిపి మొత్తంగా దేబిరించాడు.

"అట్నేలే యిత్తాంగాని నీవోపాలి మా కాలనీకిరా, అందర్నీ చూసినట్టుంటది. సొక్కా సంపాదించుకొన్నట్టుంటదీ"

"అట్నే రేపో మాపో వత్తా ఒకటి పార్నూకు"

వాళ్లందరిమధ్య నిశ్శబ్దం చోటుచేసుకుంది కొన్ని క్షణాలు.

పోలయ్య కాకిచొక్కా జేబులోంచి పది రూపాయల కాయితం తీసికొని, లేచి కల్లు బాన దగ్గరకెళ్లాడు.

కల్లుబానకు చుట్టూతా పసుపు పూసి, కుంకంబొట్లు పెట్టేడు కల్లు పాక యజ మాని. కుండమెడ చుట్టూ తెల్లచామంతి పూలదండ, సన్నజాజిపూలదండ కూడా చుట్టాడు.

పోలయ్య పదిరూపాయల కాయితాన్ని ఆ కుండచుట్టూ, మూడుసార్లు తిప్పి తలొంచి దణ్ణంపెట్టి "అమ్మా తల్లి మమ్మలసల్లగా చూడుతల్లే! నీ కొరతలేకుండా ఖాయితల్లే. మేం కోరేదదే తల్లే" అని మూడుసార్లు కుండను తాకి కళ్లకద్దుకుని, ఆ కుండ వెనుక కూర్చున్న యజమానికి నోటందిస్తూ "తవరా రాయుడుగోరా! తవర్దేనా పాక. ఇంక మాకేలోట్లేదన్నమాటే" నవ్వుతూ అన్నాడు.

రాయుడు నవ్వుతూ "ఓరి పోలయ్యా! మీ మునిసిపట్టివర్కర్లు, నాకెంతమంది ఎగ నూకి పోయారు. ఐనా మిమ్మల్ని నమ్ముతా నేవుండా, అప్పులిత్తానే వుండా, మంచి సరుకే సప్లై చేత్తుండా! ఒప్పుకుంటావా? " అని గల్లాపెట్లో నోటుపడేశాడు.

"వోలురవిటుగా మాం ఐదుగురం. పద్రూపాయల కల్లుపోయి సాలే"

"కూకో ముంతలొస్తాయి కూకో"

సీతన్న కాస్త పుంజుకున్నాడు.

"మీ ఆదిగాడెట్టా వున్నడ్రా బావా!"

"ఆడి పని మా బేజానున్నదిరా బామ్మర్దీ. ఆడేం సేశాడో తెల్సా. పాకీపన్చేయలేక వుద్యోగాన్ని రెల్లోళ్లకి వెయ్యి రూపాయలకి అమ్మకనూకిండు. రెండు నెల్లు వాడి కుటుంబం తిన్నంత తిన్నరు. తాగినంత తాగిన్రు. ఐపోయినాకా పళ్లు యికిలిస్తాకూ కున్రు. కూకుంటే కూడెట్టా? సర్కార్ వుద్యోగం నెల జీతాలేవోళ్లకి పది దినాలకు చాలవ్. ఇగనెట్టా. మరి నేల చూపులు సూట్టం తెల్చుగా. ఆమైన అంతా భుజాలికి గోతాలు భిగించుకుని యాదిలంబట గాజు ముక్కలు , యినపసావాన్లు, పాస్టిక్




డొక్కులు ఏరతా ఆ సాహెబుకాడ ఎంగిలి మెతుకులు నంజుతుంద్రు."

"ఓరెరే! గోతిలోంచి పీతిలోపడ్డారన్న మాట నాకుమల్లే"

కల్లు ముంతలు వచ్చాయ్. అంతా గట గటా తాగి త్రేన్చారు.

పోలయ్య రాయుడుగార్ని బతిమాలి తాబేటి బుర్రకాయ నిండా రెండ్రూపాయల కల్లుపోయించి దాని మూతికివున్న తాడును సీతన్న కుడిచేతికి భిగించి కట్టేస్తూ "మా చెంచక్కకి తాపించురా బామ్మర్దీ" అన్నాడు.

సీతన్న సంబరపడిపోయాడు.



మూడు ముంతల కల్లు ఫూటుగా తాగిన సీతయ్య తూలుతూ నిలబడ్డాడు. మిగతా వాళ్లు మత్తులో తలకిందులౌతున్నారు.

చెక్కరిక్షా తొక్కే కోటయ్య నిమ్మళంగా రిక్షా సీటుమీద కూర్చుని ఎక్కండసే, ఎండెక్కిపోతుంద్రే. మనం యిళ్లకాడికెళ్లేప్పటికి నడిజామౌద్దసే" అని తొందరచేశాడు.

అంతా ఎక్కి ఒకరి బుజాలొకరు వాటేసుకుని, తలలు వాల్చుక్కూచుని "తొక్కరా కోటా" అన్నాడొకడు.

సీతయ్య కుడిచేతి మణికట్టుకు తాబేటి కాయకు బిగించిన తాడ్ను బిర్రుగా చుట్టుకున్నాడు.

పోలయ్య పళ్లు బిగించి "బామర్దే, మా అక్కకి కల్లుతాపు. మద్దెదార్లో నీవ్ లాగించేవ్... నీ డొక్క చించిడోలు వాయిత్తా" సీతన్నను చూస్తూ చూపుడేలు మూడుసార్లు ఆడించాడు.

"నీసీ ఫూటుగా పోయించావ్‌గా పోలిగా ఇకన చుక్కనాకనుగా వుచ్చతో సమానం యామనుకున్నావో"

"సరే పద"

"అట్నే, మీరు కదలండి. నే ఎల్తుండా" అనేసి సీతన్న తూలుతూ మైదానానికి అడ్డంగా నడక సాగించాడు.

దోవలో ఆసావులెదురుపడి "ఏంద్రోయ్ సీతాయ్‌గో. కల్లు సీజనొచ్చేసిందన్న మాట. నీకు పట్టపగ్గాలుండవ్ ఇహన" అని అనుకుంటూ వెళ్లిపోతున్నారు.

"దండాలు సావులూ దండాలు, మీదార్న మీరు పొండి, నాదార్న నేపోతా. పగ్గాలు మీ యిద్దలకీ బిగియండి... నాక్కాదు" సీతన్న తనలో తను గొణుక్కుంటూ యింటిని సమీపించాడు.

కాల్వకట్టమీద ఏనాదులు తూలుతూ వచ్చే సీతన్నను ఈర్ష్యగా చూస్తూ నిల్చున్నారు.

సీతన్న తనవార్ని చూసి గొంతు పెంచేశాడు "ఆసావులు... భూసావులూ... నా ఎంటికతో సమానం... యాందనుకున్నారో'

"మీ గుడ్సెలు పీకించి గుట్టేసి తగల్బాకుతా! నా తడాకా చూపిత్తా! యాందనుకున్నారో! భాంచెత్" అనేసరికి...

"నీ గుడ్సిగూడా బుగ్గై పోద్దికద్రా" అన్నాడు నర్సిగోడు.

"పోనీయ్, ఇట్టాంటి గుడిసెలెన్ని కట్టేం. యింకెన్ని కట్టుకోవాలో. వాన్లు, వరదలు ఉప్పెన్లు, అగ్గిపెమాదాలు ఎన్ని సూశాంరా

ఏనాదీ? నీ వొరిగిపోయిన గుడ్సి ముంగల నాగేస్వర్రావ్ పోజేత్తుండావ్ నర్సిగోవ్, నీ తిత్తితీత్తా యావనుకున్నావో"

"నీకు వోడ్రా తాపిచ్చింది. మంచి శాన్సు కొట్టావ్‌కద్రా సీతయ్య సిన్నాన్నా" నర్సయ్య చేపల వల అల్లుకుంటా చెట్టునీడలో కూచుని వున్నాడు.

"ఓరేంద్రా అబ్బయ్య! మన పోలిగోడు, మన యాటగిరి కోటడు, మా మేనల్లుడు కత్తిసుబ్బడు, మా చిన్నతాత కొడుకు గంగడు, మునిసిపాలిటీలో పాకీపన్లు, పూడు పులు, కాలవలు లాగుడు వెట్టి పన్లుసేత్తా నెల జీతాలమీన జమీద్దార్ల పోకడకదంట్రా ఆళ్లది. చెంటర్ల నిలబడ్డ నన్ను కొత్త చెక్క రిక్షామీంచి కల్లుపాక కాడదిగి వాటేసుకెళ్లి పూటుగా తాపించారు. ఆళ్లూ పీకల్దాకాతాగి తూలతా రిక్షా ఎక్కేరు. నేనిటబడి, నా గుడ్సె కొత్తుండా"

"చాలుగాని గుడిసెకాడికిదా! పిల్లోడేడి? " అంది చెంచమ్మ సీతన్న చేతికివున్న తాబేటి బుర్రను చూస్తూ. ఆమెకు కల్లు తాగాలని మాకుతిగా వుంది.

"వత్తున్నా నీ అన్నదమ్ముడు నీకు తాపిం చమని రెండ్రూపాయల కల్లుపోసి అంపిం చిండు. తలాకూస్తి తాగండి" అని సీతన్న వచ్చి నేలమీద కూలబడ్డాడు. చెంచమ్మ ఒడుపుగా తాబేటికాయ తాడు క్షణంలో విప్పేసి చుట్టూ చూసింది.

చెంచమ్మకు వదినె వరసవాళ్లు, అప్పసె ల్లెళ్ల వరసవాళ్లు, తల్లి, అత్త వరసవాళ్లు నిమ్మళంగా రాబోతుండగా,

"రాండేసే, మా పోలిగోడు, నా అన్నత మ్ముడు అంపించిన కల్లు తలా కూత్తా తాగదాం రాండసే" అని అంటుండగా వాళ్లు ఈగల్లాగా ముసురుకున్నారు.

సీతన్న నర్సిగోడి దగ్గరకు చేరి "చేపలే టకు నన్ను పిల్చుకపోతావంట్రా" అన్నాడు.

"నీ కాడ వలేది. మొవ్వలు గూడాల్లే వాయే. పోనీ గేలపు సువ్వలన్నా వుండాయా? చేపల బుట్టన్నావుందా? "

సీతన్నకు రోషమొచ్చింది... నర్సిగాడి దగ్గర అన్నివుండి తన దగ్గర ఏమీలేకపోయి నందుకు.

"నాకాడ ఏంలేవు. కాలుసేతులు గూడా నిబ్బరంగా చాకిరిసెయ్యటంలా. నాకేం వొద్దసే. గుక్కెడు గంజినీళ్లు వొరిగిపోయిన గుడ్సెలో బారెడునేల, ముంతెడు కల్లుచాలు. నాకింకేవీ వొద్దు"

"మరి చెంచమ్మ పక్కలోకి వద్దా ఐతే"

"నాకాకుతిలేదు. అదే వొచ్చి వాటేసుకు పడుకుంటది"

"ఐతే సల్లగా సిన్నమ్మ యింకోడికాడికి నిన్నొదిలేసిపోద్ది"

"పోనీయసే.. నాకేం వొద్దన్నానా. నాకేం వొద్దసల, ఏనాది కాలనీ యిళ్లొద్దు. పెబుత్తం సాయం నాకొద్దు. పాకి వుద్యోగా లొద్దు. రిక్షాలొద్దు. గేదెలొద్దు. వలలొద్దు.

"అన్ని వద్దంటే ఎట్టే సిన్నాయనా? "

"నాకేం వద్దసే, కల్లు నీళ్లు, గంజినీళ్లూ సాలు ఆ..."

చెంచమ్మ బృందం కల్లు సాంతం తాగేసి తాబేటికాయను కుండల దగ్గర జార్చేసి కూలబడ్డారు.

వాళ్లలో ఓ యానాది స్త్రీ "జగమే మాయ! బతుకే మాయా! ఏదాలలో సారం యింతే నయా" అనే పాట ఎత్తుకుంది.

నర్సిగోడు వల అక్కడే పారేసి గుడిసె లోకి దూరి, డోలు తీసుకొచ్చి, మెడకు తగి లించుకుని దరువెయ్యసాగేడు.

కడుపుతో వున్న వాడి పెళ్లాం లేచి చేతులు తిప్పుతూ డాన్సు మొదలు పెట్టింది.




సీతన్న తప్ప అంతా పాటలు, డాన్సుల్లో లీనమౌతున్నారు. సీతన్న నేలమీదపడి దొర్లనారంభించాడు.

డోలు చప్పుడు సరివి తోపులదాకా విని పించినవి గావల్ను, అక్కడ దాక్కున్న బాల కిష్టడు పరిగెత్తుకుంటూ వచ్చి స్వజనంలో కలిశాడు.

వాడిని చూసి పిల్లోళ్లంతా చిందులు తొక్కనారంభించారు.

నర్సిగోడు డోలాపి, బాలకిష్టడి మెడకి తగి లించి, చిందులెయ్యటానికి తయార్రై, బాలకి ష్టడ్ని డోలు వాయించమన్నాడు.

బాలకిష్టడు డోలు వాయిస్తుంటే పిల్లలు, ఆడోళ్లు చిందులేస్తూ అలుపు సలుపు లేకుండా కల్లుకైపు దిగేదాకా, వళ్లు చెమ టలు పట్టి దిగకారేదాకా చిందులేశారు.

వాళ్ల కడుపులో ఆకలి మంటలు రేగగానే ఎవరి గుడిసెలోకి వాళ్లు జొరబడి గంజినీళ్లు తాగి త్రేన్చారు.

సూర్యుడు నడినెత్తిమీదకు వచ్చాడు.

★ ★ ★

మిట్టమధ్యాహ్న సమయంలో అబ్బ కొడు కులు, కళ్లలో ప్రాణాలు పెట్టుకుని మున్సిపా లిటీ వారి పాకికాలనీలో అడుగుపెట్టారు.

కాలనీ పాత పెంకుటిళ్ల వరసలతో కిక్కి ర్సిన జనంతో సందడిగా తయారైవుంది. పిల్లాజల్లా మొండిమొలలతో చింపిరిజుట్లు, చీమిడిముక్కులతో మట్టిలో, దుమ్ముగాలిలో అటుయిటు తిరుగుతూ ఆడుకుంటున్నారు. ప్రతి పెంకుటింటిముందూ పొయ్యిలు వెలి గించుకుని బువ్వలొండుకు తింటున్నారు. కొందరి కుండలింకా పొయ్యి మీంచి దిగ లేదు. ముసలిముతక చెట్లనీడలో నేలమీద గోనెపట్టాలు పర్చుకుని ఆకలి డొక్కలను నింపటానికి కాచుకుని పడుకున్నారు. ఉదయం ఆరుగంటలకే టౌనును శుభ్రం చేయటానికెళ్లిన ఏనాదులు గుంపులు గుంపులుగా వచ్చి కుటుంబాల్ని చేరుతు న్నారు. ట్రాక్టర్లమీద పోగేసుకొచ్చిన చెత్తాచె దారం పాకికాలనీ సమీపంలోని ఖాళీ ప్రదే శాల్లో గుట్టలు గుట్టలుగా పోగులు పెట్టు న్నారు. అప్పుడప్పుడు గాలికి కంపు రేగు తుంది. పెంట డబ్బాలను గుంటలో కుమ్మ రించేసి కాళీ డబ్బాలను ట్రాక్టర్ మీద కెక్కించేసి, చెమటతో తడ్సిన చొక్కాలతో, అలిసిన మొహాలతో, నీరసించిన శరీరాలతో అంతా తలలొంచుకుని కాలనీ బావి దగ్గ రకు చేరటం గమనించి అటునడిచాడు సీతన్న.

స్నానం చేస్తున్న పోలయ్య, దూరంనుంచే సీతన్నని చూశాడు. అతని వెనకాలున్న బాలకిట్టడ్నీ చూశాడు.

"ఎప్పుడొచ్చావోయ్ బామ్మర్దీ! అల్లుడ్నీ గూడా పట్టకొచ్చావా? మా యాతనలు సూపిత్తున్నావేంది ఆడికి" అన్నాడు.

"ఒరే బామ్మర్దీ... మన జల్మేపాడుజల్మ. అగసాట్లు, పొట్టతిప్పలు తప్పవ్‌గా. ఓపి కుంది, వుద్యోగం వుంది. నెల తిరిగే తలకి ఐదారొందలు చేతుల్లో కొత్తాయ్ మీకు. తల్దాచుకోటానికి కొంపలున్నాయి. నాను వున్నా, ఎందుకు? పెల్లాంబిడ్డల్ని సాకలే నోణ్ణి యదవనాయాల్ని" అని సీతయ్య యాష్టపడ్డాడు.

"ఆకల్మీనున్నట్టుండావ్. కూడు తింటేగాని సల్లపడ్డు జీవుడు" అని పోలయ్య గోచిపెట్టు కుని, పగలు చాకిరిలో చెమటపట్టి, మాసి పోయిన నిక్కరు చొక్కా శుభ్రంగా ఉతు క్కుని, కంచెమీధ ఆరేసుకున్నాడు.

ఒక్కొక్కరు నిక్కరు చొక్కాలను ఆరేసు కుని యిళ్ల దగ్గరకు చేరారు. స్నానం అయిన తర్వాత ఉల్లాసంగా కనిపించారు.

పోలయ్య నులకమంచం వెల్లికిలా వేసి "కూకొండస్" అని తండ్రి కొడుకులను

ఆహ్వానించాడు.

పోలయ్య పెళ్లాం పోలి సీతయ్య దగ్గర కొచ్చి "సీతన్న ఏంది యిట్టా సిక్కిపో యిండు. వదినట్టా వూరిపోతాంది. మాంచి కసాయాలు తాగాలసె. సెట్లుపేర్లు, ఆకుల పసరుకసాయం కాపించి తాటిబెల్లం కలుపు కొని తాగేసే, కొరమేనులాగొత్తావ్. మా నాయన తాగేటోడ్రే సీతన్న! నీవాపనిసె యసే" అంది.

"గచ్చాకు పుచ్చాకు కసాయాలు పన్సెయ్య వులేయే. గొప్ప విండిసన్లు చేపిచ్చుకోవాల. రోజూ గుడ్లు, నీచు పూటుగావాడాల. ముంగలమాకు కూడెయ్ కంచంలో" అన్నాడు పోలయ్య.

పోలి సత్తు గిన్నె చేతపట్టుకుని నాలుగి ళ్లలో నాల్గు ముద్దలు బువ్వ వేయించుకుని ఎర్రకారం, చేప్పుల్సు తెచ్చి సీతన్న , బాలకి ట్టడి కంచాల్లో సర్దింది.

తర్వాత తనకు, మొగుడికి సత్తు గిన్నెలో బువ్వవేసుకుని నులకమంచం ఎదురుగ్గా నేలమీద చతికిలపడ్డది.

"మధ్యలో గోంగూర పచ్చడి అటికె, దాన్లో కొయ్య గరిటపెట్టి, "ఏసుకోరే సీతన్న! పచ్చడి బాగుంది" అని చెప్పి పెద్దపెద్ద ముద్దలు నోటినిండా కుక్కుకుని నమలసాగింది.

పోలయ్య ఆకలిమీదున్నాడు. లటాలటా ఆరు ముద్దలు కారంతో కల్పి సగం గిన్నె కాళీ చేశాడు.

సీతన్నకు బువ్వ సహించటంలేదు. ముద్ద ముద్దకు సత్తుగళాసు నీళ్లు తాగేస్తూ, కారా నికి వగరుస్తూ, గుడ్లు మిటకరిస్తుంటే పోలి ఆశ్చర్యపోతున్నది.

"ఎందసే సీతన్న లెసతింటాడని నాల్గి ళ్లలో బువ్వ ఎత్తకొస్తే యీడు నాల్గు ముద్దలు మింగలేదె. నేను సూడు కంచం నాకేశాను"

"ఆడు కల్లునీల్లతో పొట్ట నింపతాడసే. అందుకే బువ్వ తిన్లేదేసీయన్న" రెండో గిన్నె కాళీచేస్తూ పోలయ్య సీతన్నని బుకాయిం చేడు.

సీతన్న గిన్నెలో చెయ్యి కడిగేసి, నీళ్లు తాగేసి బెవ్‌మని తేపాడు.

బాలకిష్టడుకి ఇంతమంది యానాదులు, కిక్కిర్సి గుంపులు గుంపులుగా, ఒకేరకం ఇళ్లల్లో జీవించటం చూట్టం ఇదే మొదటిసా రవటంవల్ల చాలా ఆశ్చర్యంగా వుంది. తన గుడిసెలకంటే, ఇరుకుగా, చుట్టూ గలీజుగా కాస్త దూరంలో పెద్ద పెద్ద చెత్తకుప్పలుతో వాతావరణం చెండాలంగా తయారై గవులు వాసనతో వుక్కిరి బిక్కిరి చేస్తున్నది.

బాలకిష్టడికి ఊహ తెల్సిననాటికి వాళ్ల కుటుంబం మామిడితోటలో చుట్టు గుడి సెలో, ప్రశాంతంగా వుండేది. మరికాస్త బుద్ధి వికసించేప్పటికి కాలవకట్ట పక్కన సర్వితోపుల దాపున పది చుట్టు గుడెసెల మధ్య వుండేది. చల్లటిగాలి, పెద్ద పెద్ద చెరువులు, చప్పుడు లేకుండా పారే కాలవ, రకరకాల పిట్టలు, వాతావరణం చాలా కులాసా కలిగించేది.

ఇక్కడినుంచి తొందరగా బయటపడాలని కంచం వేగంగా కాళీ చేశాడు.

పోలి కంచంనిండా బువ్వ, చేపలపుల్సు వేసింది. బాలకిష్టడు తలెత్తకుండా బువ్వ తిననారంభించాడు.

"ఓరె బక్కనాయాలుగా సడిసప్పుడు లేకో కుండా మింగటవేనా, మాటపలుకు లేదేంద్రా. బురదపక్కిలు పడతావేంట్రా" ఎద్దేవగా అన్నాడు పోలయ్య.

"ఇంకా మా కాలవ ఎండలేదు మావయ్యా"

"ఎండితే చేపలేటకెల్తావంట్రా? "

"ఎల్లను. బళ్లు తెరుస్తారుగా. ఆస్టల్లో సేరి సతువుకుంటా"





"ఒయబ్బో! సతుకుతావంట్రా! అచ్చురాలన్నీ రాస్తావంట్రా? " పోలి నవ్వుతా అడిగింది.

"పోలు రవిటుగా సదువుతా సిన్నమ్మా"

"నేను సినమ్మను కాన్రా. అత్తనిరా. నా కూతుర్నిత్తా కట్టుకుంటావా? "

"ఓ, సతువుకొంటందా? సదువుకునేదాన్నే కట్టుకుంటా"

"సదువుకొని ఏం సేత్తావ్? "

"పోలీసుపని సెత్తా. కాకపోతే బస్సు లారీ నడుపుతా"

"ఓరమ్మో ఓర్నాయనో అసాద్దుడివేరా అల్లుడా. మీ అబ్బని పెద్దైనాకా బాగా సూస్తావైతే"

" ఓ సూత్తా "అని కంచంలో ఆకరిముద్ద నోటినుండా నింపుకున్నాడు.

సీతన్న అన్నంతినేసి, పది అంగల్లో మేనల్లుడు సుబ్బయ్య క్వార్టరు దగ్గరకెళ్ళాడు.

సుబ్బయ్య కంచంలో కూడేసుకుని, నేల మీద గోతాంపట్ట పర్చుకుని తింటున్నాడు.

రేత్రీడకు రారేమావా. బువ్వతిని పొద్దన్న ఎల్దువుగాని" అనేసరికి సరేనన్నాడు

★ ★ ★

పచ్చిగడ్డి మోపెత్తుకు వస్తున్న వీరయ్యకు, గొడ్లదళారి గురవయ్య డొంకబాట దగ్గర కనిపించగానే మాట కలిపాడు.

"ఏం, కాపా, కల్లం గడికాడా, సారాదుకాణం కాడా తగల్టంలేదు సిత్రంగా వుందే"

"మరే, డాకటేర్ చెప్పాడు. ఇగన తాగేవా సస్తావ్. మానేశావా వుంటావని. వెయ్యి రూపాయలయ్యాయి రోగం తగ్గటానికి. రెండెకరాల గడ్డివామి వచ్చేది మ్చి..."

"ఊరకే సిక్కుల్లో సిక్కేవే పాపం. ఇప్పుడెట్టుండావ్ బావా"

"ఇప్పుడు పర్వాలే, యిట్టా చిన్నా సితక పన్లు చేత్తుండా. గొడ్లపని సగం నేనే సూసుకుంటున్నా. మా గొడ్లకాసే బుడ్డోడు. ఓ పూటొస్తే, మూడు పూట్లెగ నూకతాడు. సీతడు రోగిస్టి మారోడయ్యాడు. మధ్య యీ చాకిరి చెయ్యలేక సస్తన్నా బావా"

డొంకదాటివచ్చి, ప్రభుత్వ సారాదుకాణం సమీపించారు.

"నోరు తడుపుకుంటావా బావా"

"జేబులో విత్తనాల్లేవ్. నీకాడేమైనా వుంటే ఎల్దాంపా"

"ఐతే తొందరగా ఇంటికి పద. గొడ్లు మేతకోసం, మోరలెత్తుకోని చూస్తుంటాయ్. మూడేళ్ల మట్టి నా చేలో పంటేది? గడ్డేది. ఎల్లువలొచ్చి పైయేడూ నీళ్లు లేక కింద టేడు, నాట్లు సరిగా పడక యీఏడూ, మానోట్లో, గొడ్ల నోట్లో మట్టి కొట్టేడుగదా దేవుడు. బియ్యం కొనలేక, గడ్డి కొనలేక నానాచావు చస్తున్నాం గురవయ్య బావా ఛాఛా... యాతనలమారి బతుకైపోయింది. ఎదుగుబొదుగు లేదు. దిగనాసిల్లిపోతుంటాం అంటే నమ్ము"

ఇద్దరూ వీరయ్య ఇంటికొచ్చారు. పాడిగేదెల ముందు పచ్చిగడ్డి మోపేసి వీరయ్య తుండుగుడ్డతో మొహం తుడ్చుకున్నాడు. పాకలోంచి వీరయ్య భార్య వీరమ్మ వచ్చి మొగుణ్ణి చిరాగ్గా చూసి 'ఎప్పుడనంగా పోయావ్. విప్పుడా రావటం. గేదెలు అల మటించిపోతుండాయి" అని విసుక్కుని "ఇదన్నయ్యా మీ బావ పనిపాట్లు. నా సావు సదథమైపోతాంది. అరుగుమీన కూకో గురవయన్నా" అంది.

వీరయ్య బావిలోంచి ఇత్తడి బుంగతో నీళ్లతోడి, మొహం, కాళ్లు చేతులు కడిగి పాకలోకి చూసి "అనురాధా దాహానికి

మంచినీళ్లెత్తుకురామ్మా పెద్ద చెంబుతో" అని కేకేసి అరుగుమీద చతికిలపడ్డాడు. వీరమ్మ గేదెలముందు పచ్చిగెడ్డి విదిల్చి పాలు తీయటానికి కూర్చుంది.

ఎండేసిన పిడకల్ను పళ్ళికనిండా వేసుకుని వీరయ్య తల్లి కోటమ్మ గురవయ్యని చూసి "నీవటయ్యా అల్లుడా చానాళ్లకగపడ్డావ్. అంతా బాగుండారా" అని పల్కరించింది.

"ఆ బాగుండామ్ కోటమ్మత్తా. నీవెట్టుండావ్? "

"ఏదో కాలు, కన్ను బాగున్నదాకా యిట్టా చిన్నాచితకపన్లు చేస్తా సావాలిగదా. ఆడజన్మ పాడుగానూ"

అనురాధ నిగనిగ మెరిసే పెద్ద కంచుచెంబుతో నీళ్లు తెచ్చి, స్టీల్ గ్లాసులో పోసి తండ్రికి, గురవయ్యకి యిచ్చింది.

"మా అమ్మాయికీ ఏడన్నా మంచి మనువు సెప్పు నీ యిలాకాలో బావా"

"అట్నే. నీ కూతురు చక్కదనాల చుక్క. పనిమంతురాలు. కట్నం ఏమాత్రం ఇస్తావ్? "

కోటమ్మ కలుగచేసుకుని "ఎకరం పొలమిత్తాం. నీ కొడుకులెవరైనా రెడీగున్నారా, చేసుకో" అంది.

"సెతుర్లా! నిజ్జంగానేనా అత్తా"

"నా పుట్టింటి ఇలాకావోడిని. నా కడుపులో మాట అన్నా. ఆలోచించుకో నీ ఆడంగులతో. లగ్గాలు పెట్టుకొందాం" అంది కోటమ్మ.

"అట్నే! అట్నేవే అత్తా. మన సావిట్లో పడ్డ దూడలగపడ్డాయ్. అమ్మాలనుకుంటున్నావా బావా"

"మా ఇంట పుట్టిన దూడలు అమ్మమ్. ఆటిమీదే ఆశలు పెట్టుకుకూకున్నాం. ఈ ఏడు కూస్త జాగ్రెత్తగా మేపుకుంటే, వచ్చే యేడు నాల్గు మానికెల పాడి పిండద్ది మా ఆడది "

"అబ్బా! అంతదృట్టమా" వీరమ్మ పాలు తీసి రెండు ఇత్తడి చెంబుల్లోకి కొల్చిపోస్తూ, ముసిముసి నవ్వులతో అని "మా అనురాధ నోయింటిదాన్ని సెయ్యాల అన్నాయ్" అంది.

వీరయ్య లేచి చెంబులు పుచ్చుకుని "ఎల్దాంరా బావా హోటల్లోళ్లు ఎదురుసూస్తుంటారు" అనగానే గురవయ్యా లేచాడు బస్తీవైపు బయలుదేరారు.

"నీ కొడుకుని ఏపనిలో పెట్టావ్ బావా" గురవయ్య అడిగేడు.

"వాడ్నా. మా శీనడు మొన్నటిదాకా రెడ్డిగారి చిన్నకారు నడిపేడు. ఆయనెందుకో కశిరాడని మానుకున్నాడు. మాలావు అభిమానం మావోడ్కి. ఎవ్వరికాడా నికరంగుండడు. మా మేనత్తకొడుకు రాఘవయ్య లారి యూనియన్ లీడ్రు. వాడ్ని బతిమాలుకున్నా "బాబా మా శీనడ్ని నీ కనుసన్నట్లో పెట్టుకోరా తండ్రి. వాడి దోవచూసీరా" అన్నా మొన్న. ఆడ్ని నా కాడికి పంపియ్ అన్నాడు. మా వోడు ఎల్లేడో, లేదో ఆనేక తేల్చుకుంటా"

"నా పిల్లోళ్లిట్టాంటి నకరాల్ నూకరు. పొద్దున్నే లేచి, సద్దినీళ్లు తాగి తోపుడుబళ్ళేసుకుని కాయకసరు అమ్ముకుని సాయంత్రానికల్లా యాభైరూపాయలెత్తకొచ్చి వాళ్ళమ్మకీయాల్సిందే. లేపోతే రాత్రికి కూడుపెట్టదు. వాళ్లు రోడ్డుమీద రౌడిలైనా వాళ్లమ్మ కాడ, నాకాడా పిల్లులే. ఏందనుకున్నావో అంత కట్టుబాట్లో పెంచకొస్తున్నా"

"యీ కాలం కుర్రకారుతో యాగటం శానా కష్టంగుంది బావా. చివాట్లు పెట్తే యింటోంచి నూక్కెళ్లతాడేమో అని మా ఆడమంద మా శీనడ్ని గారాబం చేశాయి.





మా రామస్వామి, నా భార్య పెద్ద తల్లి కొడుకు నీకు తెల్సుగా బావా"

"నా కెందుకు తెల్వదూ. మా పాక దగ్గరే ఆయన పాక. బలేవాడివే బావా. రామసామి కుటుంబం మేము మాలావు సేహితులం. మంగమ్మ దొడ్డమనిషి, వాళ్ళ బ్బాయ్ సత్తెనారాయణ, మా శీను యీడు వాడే. ఇంట్లో తాగుబోతు తండ్రితో యాగ లేక ఐదేళ్లకిందట ఇంట్లోంచి పారిపో యాడు.

నాకెందుకు తెలీదు. బాగా తెల్సుగా"

"విను ముంగలనే చెప్పేది. అట్టా ఇంటోంచి నూక్కెళ్ళతాడనే మా శీనడ్ని వాడిష్టారాజ్యంగా పెంచాం. బొత్తిగా నిలక డలేని మడిసి, సంపాదించుకోవాలె అనే యావేలేదు వాడికి. ఈ యేడన్నా వాడు కుదురుకుంటే, వాడిగ్గూడా పెళ్లిచేసి ఒడ్డున పడతామనుకుంది. మర్సిపోబాకు. మా అమ్మాయినొచ్చి సూసుకోండి"

"అట్నే అన్నానుగా బావా"

"సరే పద. నాదారిటు. సినీమాహాలుకాడ హోటళ్లకందించాల పాలచెంబులు"

"నేనిటు కాలవకట్టనపోతా. ఆ పక్కంతా జనం తెగి పెరిగిపోతున్నారు. బస్సులు, లారీలు, రిక్షాలు యాడచూసినా సందు లేదు. నడవటానికే కష్టంగుంది"

"అవ్ ఇంకా పెరిగిపొద్ది బస్తీ. గుడిసె మీద గుడిసె కిటకిటలాడుతున్నారు."

"యాడన్నా మూడు సెంట్ల స్థలంకొని రెండు నిట్టాళ్ల పాక వేసుకోవాల. పిల్లోళ్లకు మాకు చాల్టంలే"

పెతిదాని రేట్లు పెరిగిపోతుండాయి. ఎన కటిదినాలే శాన మంచిరోజులు.

అవును. రూపాయకి నాల్గుశేర్లు బియ్యం. నాకు తెల్సు.

ఇప్పుడు కేజి ఎనిమిది రూపాయలు మ్బి.

★ ★ ★

కాలవకట్ట పక్కనే కొత్త రోడ్డు. టౌన్ మధ్య నుండే కాలవ పోవటంవల్లా, జనంరద్దీ లేక పోవటంవల్లా, పొద్దున్నే దిక్కుమాలిన జనం, ఇళ్ళల్లో పాయికానాదొడ్లు లేనిజనం, యీ కావలకట్టమీదే కూర్చోసాగేరు. లారీ లను కడగటానికి అక్కడే ఆపేవారు. కాల వకి బ్రిడ్జి కట్టేక కాలవకట్ట దిక్కు మొక్కు లేని మూకలకు తలదాచుకోటానికి నెల వైంది.

బ్రిడ్జి పక్కనే కాలవకట్ట మొదట్లో వెడల్పా యిన స్థలం ఖాళీగా కనిపించేప్పటికి, ఆ స్థలం విలువ సౌకర్యం తెల్సిన ఓ వ్యాపారి, పెట్రోల్ పంపు నిర్మించి 3 రంగులజండా ఎగరేశాడు.

ఆ హంగు చూసి ఓ లారీల యజమాని, వాటి రిపేర్లకు షెడ్ నిర్మాణం పూర్తిచేశాడు. కాలవకట్టమీద స్థలవసతి నీటివసతి చూసి లారీడ్రైవర్లు, మెకానిక్‌లు, క్లీనర్లు తలా కాస్త స్థలాన్ని ఆక్రమించి గుడిసె వేసుకుని దీపాలు వెలిగించారు.

క్రమంగా లారీల అవసరాలకు కావల్సిన బ్యాటరీ రీచార్జి, వెల్డింగ్ వల్కనైజింగ్ మెకా నిక్కులు షాపులు తెరిచారు. పల్లెల్లో బతక లేక వచ్చేసిన జనం, లారీలవల్ల బతుకుతె రువు చేసుకుని, చీకటిపడగానే తలదాచుకో టానికి చిన్న చిన్న యిరుకు గుడిసెలను కట్టుకున్నారు.

ఇంత సందడి గమనించిన గురవయ్యా, బతికిచెడిన రామస్వామి లారీ మురా అండ చూసుకుని దిట్టమైన రెండు నిట్టాడి పాక లేసుకున్నారు. ఈ గుడిసెవాసులకు సేవ చేయటానికి చిల్లరకొట్లు, టీ దుకాణాలు, కట్టెల అడితి, లాండ్రిషాపు వగైరాలు పుట్టాయ్.

జనంతో కళకళలాడుతూ కనిపించేప్ప టికి, సారా వ్యాపారస్థుల కన్నుపడి, తమ

బ్రాంచీలను తెరిచారు. "ప్రభుత్వ సారాదు కాణం" అని తెల్లక్షరాల ఎర్రబోర్డుతో ఓ గుడిసె వెలిసింది. "ప్రభుత్వ కల్లు అంగడి' ' అని నల్లబోర్డుమీద తెల్లక్షరాలతో ప్రత్యక్ష మైంది.

ఇంతమంది అలగా మూక పోగవటం గమనించి నాలుగు గుడిసెలలో కంపెనీలు పెట్టుకుని, పొట్టత్రం తీర్చుకోసాగేరు కొందరు స్త్రీలు.

ఆ కాలవకట్టమీద దరిద్రదేవత రాజ్యమే లుతూ, రోడ్డుకు కుడివైపు పట్టాభూముల్లో లేచిన పెద్ద పెద్ద మేడల్లో, వెలిగే ఐశ్వ ర్యంతో, శాంతియుత సహజీవనం చేస్తూ బతుకుతున్నది.

ఆ మేడల్లోని బస్, లారీ, టాక్సీ యజమా నులు, వీళ్లని అజమాయిషీ చేస్తూ, తమ లారీలను బస్సులను నిరాటంకంగా నడుపు కుంటూ, రాజసంగా, మగతగా బ్రతికేస్తు న్నారు.

గురవయ్యకు సంతానమే సంపద. నలు గురు కొడుకుల్లో ముగ్గురికి నాల్గు చక్రాల తోపుడుబళ్లు చేయించిచ్చి, రోడ్లమీదే బతకం డన్నాడు. వాళ్లు సిసింద్రీల్లా మహపెడస ధంగా, తోపుడుబళ్ల సెంటర్లా, జంకుగొంకు లేకుండా చెలామణైపోతున్నారు. ఒక్క పోలీస్‌లకు తప్ప, మరెవరికి తలొంచరు. వాళ్ళల్లో గోపిగాడు పోలీస్‌బాబులతో లావా దేవీలు చేయటంలో దిట్ట.

ఆరోజు సాయంత్రం ఐదుగంటలకే మెయిన్‌రోడ్ కూడలిలో నాల్గు చక్రాల బళ్లు, రకరకాల పళ్లతో నిండుగా రోడ్ మార్జన్‌తో ఉంచి, సారథులు పిచ్చిపాటి కబుర్లలో వుండగా, పోలీస్ విజిల్సు వినిపించాయి. మోటార్ సైకిల్ మీద యస్సై వచ్చి సెంటర్లో క్షణం ఆగి, వేగంగా వెళ్ళిపోయాడు. కానిస్టే బుల్, విజిలేస్తూ, బళ్ళవైపు వచ్చి "మీకెన్ని తూర్లు చెప్పినా లెక్కలేదు. కేసు రాస్తే కోర్టు చుట్టు తిరగలేక చస్తారని దయతలు స్తుంటే, రోడ్డుమీదే కాపరాలు పెట్టి కబుర్లా డుతుండ్రి మాపై ఆఫీసర్లేమో, మమ్మల్ని నోటికొచ్చినట్లు, బూతులు తిట్టెళ్లిపోతు న్నారు. ఏ్రా గోపిగాడు" అని చిందులె య్యగానే, గుంపులోంచి నల్లపేంట్ నల్లగళ్ల స్లాక్ తొడిగిన గోపి గుబురు జుట్టు సవరిం చుకుంటూ వచ్చాడు. "ఏంట్రా గురువుగార్కి కోపం తెప్పించారేంట్రా. మీ మూలంగా నా పిస్టేజికి ముప్పు వొచ్చేస్తది. బళ్లని ఎనక్కి నెట్టి, లైనుగా పెట్టండి" అంటు కేకలేస్తుం డగా, మోపెడ్‌మీద హెడ్ కాశిం వచ్చాడు. ఆగీఆగగానే గోపి అతని దగ్గరకెళ్లి నవ్వేసి సలాం చేశాడు.

"ఏందీ గోపీభాయ్, మీ బళ్ళన్నీ ట్రాఫిక్‌ని జామ్ చేస్తున్నాయని యస్సైగార్కి కోపం వచ్చింది. మీవోళ్లు మా నెత్తికెక్కేస్తున్నారు. మాపై వాళ్లు మమ్మల్ని వాయిస్తున్నారు" అని విసుక్కున్నాడు.

"మీ మాటనెప్పుడు ఎదిరించాం గురూ గారు. మీరుండమన్న తావుల్లోనే నిలుస్తా వున్నాంగా భాయ్‌సాబ్" ప్రాధేయపడ్డాడు గోపి నవ్వుతో.

"లైన్‌మీదకెన్ని కొత్త బళ్ళొచ్చాయ్"

"మా బేచికుర్రాళ్లవి పదొచ్చేయ్. మామిడి పళ్ళ సీజన్ రాగానే మరో పదో, పదిహేనో వస్తాయ్. ముందుగానే మీ చెవినేస్తుండా గదా"

"కొత్త బండ్లమీద నిండుగా సర్కు చూస్కుంటా, రోడ్‌రూల్సు మర్చిపోతుంట్రి. మీ చేతిలో ఆరంగుళాల కత్తులూ, తొమ్మి దంగుళాలవీ కనపడ్డాయా, యస్సైగారు పిడేస్తారు కామోష్. బ్రాందీషాపులకాడ అచ్చంగా మీ కుర్రనాయళ్ళే పోగవుతున్నార్ట. రాత్రి పది తర్వాత మీ వోళ్లు కనిపించారో స్క్వాడ్‌వాళ్లు మిమ్మల్ని కమ్ములు లెక్కపెట్టి స్తారు. జాగ్రత్త" కాశీం మోపెడ్‌మీద




కూర్చునే వార్నింగ్ ఇచ్చేసి ఓ క్షణం గంభీరంగా చూశాడు.

"మీరు చెప్పినట్లే వింటాం. యస్సైగార్ని ఆనక స్టేషన్‌కొచ్చి కలుస్తాగా భాయ్‌సాబ్" అంటూనే పాతిక చక్కెరకేళీలు, పెద్ద ద్రాక్ష గుత్తి, డజన్ కమలాలు, మోపెడ్‌కి అమర్చిన డిక్కీలో జాగ్రత్తగా సర్దేసి కాశీం మొహంలోకి చూశాడు.

మోపెడ్‌ను స్టార్టు చేసి వెళ్తూ "యస్సైగారి మాట మర్చిపోవాక గోపిభాయ్" అన్నాడు.

గోపి తెలివికి సహచరులు మెచ్చుకున్నారు. గోపి ముక్తాయింపుగా "యస్సైగార్ని మంచి చేసుకుంటే, యీ సెంటర్లో మన భరాటా సాగుద్ది. లేకుంటే గుడిసెల్లో కుండలు డాన్సు చేస్తాయి. రోడ్లమీద దుమ్ము ఎండల్లో మన అవస్థలు. యీ పోలీసోళ్ల దాష్టీకం, మన తిప్పలు..."

గోపి మాటలు ఆపేసి, ఇటువైపే వస్తున్న ఓ స్త్రీవైపు చూపు నిలిపేశాడు. మిగిలినవాళ్లు గూడా, ఆ స్త్రీని గమనించారు. ఒకడు ఈల వేయగా, మరోవాడు "చవక, చవక ద్రాక్ష, చక్కెరకేళీ కమలాలు తాజా సరుకు తాజా' అంటూ అరిచాడు. ఆ యువతి గుంపుని వోరగా చూసి వయ్యారంగా నడిచి గోపి బండిదగ్గరకొచ్చి "ఎంత" అని చక్కెరకేళిని చూపించింది.

"డజన్ పన్నెండ్రూపాయలే" గోపి ఆమె కళ్లల్లోకి చూస్తూ గొణిగాడు. "పాతికయ్యనా? "

"పాతిక నాకెందుకూ. ఒక్కదాన్నే. అరడజన్ చాలు బేరం చెప్పు."

"ఐద్రూరూపాయలకు పైసా తగ్గదు"

"తగ్గవా "కిసుక్కున నవ్వి, జారినపైటను క్షణం సర్దుకుని,"సరే ఇవ్వు" అంది.

"ఈ పూట నీదేబోణి" అని కత్తితో గెల కోసి ఆరు పళ్లు అందించాడు వేళ్లు తగిలేట్లుగా. రెండు చేతులు సహకరించుకున్నాయి. ఆమె కుడిచేత్తో రవిక ఎదరలోంచి ఐదురూపాయల నోటుతీసి గోపికిచ్చింది. చవకబారు సెంటు, పౌడర్‌వాసన, చెమటతో మాగిన నోటు గోపిలో కొత్త కోర్కెల కలలు రేపాయి "ద్రాక్షా, కమలాలు వద్దా" గొణిగాడు.

"డబ్బుల్లేవ్. రేపొస్తాలే యీ టయానికే' ఆమె వయ్యారంగా నడుస్తూ కనుమరుగైంది.

"గోపిగా నీమీద కన్నేసిందిరా కతిజా" అన్నాడొకడు.

"నీకు తెలుసుట్రా. యీ పిట్ట"

"రిక్షా బాషాగాడి చెల్లెల్రా. మొగుడ్నొదిలేసిన దాన్తో దోస్తు చేశావా నీకు కొత్తరకం తిప్పలు తప్పవ్‌రా బిడ్డా"

దూరంగా రిక్షాలో మైక్ వినిపిస్తున్నది. "లాట్రి టికెట్. రెండు లక్షలు, ఐదు లక్షలు. రేపే డ్రా. పది టిక్కెట్లే వున్నాయ్. అదృష్టవంతులు త్వరపడండి. మంచి తరుణం. మించిన దొరకదు."

"తలా రెండు టిక్కెట్లు కొందాం"

"రేయ్ యస్సైగారి మామూలు తలా యాభై రెడీగా వుంచండి. లేకపోతే మన జాతకాలు తారుమారైపోతాయ్"

★ ★ ★

కాలవకట్టమీద గుడిసెల బారు చీకట్లో నిద్రపోతున్న సమయంలో లారీడ్రైవర్ రామస్వామి చిత్తుగా తాగి తూలుతూ, పడుతూ లేస్తూ తన గుడిసెముందు కొచ్చి నిలబడలేక కిందపడ్డాడు.

గుడిసెలోపల బుడ్డిదీపం వెల్తుర్లో అన్నాలు తింటున్నారు. రామస్వామి భార్యని బండబూతులు తిట్టూ, నేలమీద దొర్లుతూ "నన్ను ఇంట్లోకి తీసికెళ్లవేలా...ం" అంటూ భార్యని కేకేశాడు.



ఇంట్లో వాళ్ళకి ఆ సమయంలో ఆ తాగు బోతు లోపలకొస్తే చేసే జాతర బాగా తెలుసు. వాళ్ళు తినే కంచాలను, అన్నం గిన్నెను నేలకేసి కొట్టాడు. చేతికి దొరికినవాళ్ళని జుట్టు పట్టుకుని కిందపడేసి కాళ్ళతో తొక్కేస్తాడు. అట్లా పావుగంటో, ఇరవైనిమిషాలో రాక్షస భీభత్సం చేసి నేలమీదే దయ్యంలా పడినిద్రపోతాడు. బుడ్డీదీపం చుట్టూ కూర్చున్న నలుగురు ఆడవాళ్లు కంచాలనిండా గిన్నెలో అన్నాన్ని సర్దుకుని, పచ్చడిముద్దను తలాకాస్తా వేసుకుని, దీపం ఆర్పేసి అంతా బయటకొచ్చేసి చీకట్లోకి పారిపోయారు.

రామస్వామొక్కడే నేలమీద దొర్లుతూ మిగిలాడు. అతను నిస్సహాయంగా నోటికొచ్చినట్లు పేలసాగాడు.

"లా...ం... వొక్కగానొక్క కొడుకుని ఇంట్లోంచి తరిమేశావ్. తప్పుడుముండా. నీవూ నీ కూతుళ్లతో కంపెని నడపతావున్నావా? గుడిసెలో సీకట్లో నీవు చేసే సీకిరెట్ యవ్వారం నాకు తెల్వదంటే లంజా. సెంటర్లో లారీ కుర్రోళ్లంతా నన్ను ఎద్దేవగా చూత్తున్నారే ముండా. ఎల్లిపోండి. ఈ గుడ్సె నాది. నేసంపాదించా. పోండి. మీరిగన వుండొద్దు లంజల్లారా!"

పారిపోయినవాళ్లు, ఈ రాత్రి అన్నం నోటి దగ్గర్నుంచి నేలపాలు కానందుకు వెయ్యిదేవుళ్లకి మొక్కి గబగబ తినేస్తున్నారు పక్క గుడిసెల్లో దాక్కుని.

రామస్వామి అతికష్టంమీద లేచి నిలబడి "ముండా" అని పొలికేక పెట్టి గుడిసెలోకి దూరేడు. చిమ్మచీకటి అతన్ని కసిగా చూసింది. పావుగంట తర్వాత సద్దుమణిగింది. రామస్వామి భార్య, బెరుకు బెరుగ్గా వచ్చి ఎంగిలికంచాలను గుడిసెలో మూల పెట్టి, దీపం వెలిగించింది. నేలమీద రామస్వామి వెల్లికిలా పడి నిద్రపోతున్నాడు. పెద్దగా గురకపెట్టూ. మంగమ్మ భర్త జేబులు వెతికింది రూపాయనోటన్నా వుందేమోనని. నాల్గు బీడిలు వేళ్లకి తగిలాయి.

రామస్వామి లారీదిగి, ఓనర్ని పీడించి డబ్బులు తీసుకుని సారాదుకాణంలో మస్తుగా తాగి గుడిసెకొచ్చి ఆగం చేసి పడి నిద్రపోతున్నాడు.

మంగమ్మ నిరాశగా, విసుగ్గా "యీడికి చావన్నా రాదుగదా. మంచి మంచోళ్లు లారీలు బోల్తాపడి చస్తన్నారు. యీ ముండాకొడిక్కి చావన్నరాదే ఎట్టాన్నా. ఛీఛీ... ముదనష్టపు జల్మ" అని సణుక్కుంటూ నులకమంచం వాల్చుకు పడుకుంది.

"యీడి అగాయిత్తేనికి ఆడపిల్లలు దడ్సి ఆడా యీడా గుడిసెల్లో రేత్తిళ్లు తొంగోవాల్సొత్తుందిగదా" అని గొణుకుతూ మంగమ్మ ముసుగు బిగించింది.

తెల్లారింది. రామస్వామి గుడిసెలో తుపాను వెళ్సిన తర్వాత ప్రశాంతంలాగా వుంది.

రామస్వామి మశీదులోంచి "అల్లాహో అక్బర్... కేక వినిపించుతుండగా నేలమీద వెల్లికిలా పడుకున్నాడల్లా కళ్లు తెర్చి నిదానంగా లేచి కూర్చున్నాడు. కుడి మోకాలు చాలా నొప్పిగా అనిపించింది. నీరసం, ఆకలి, కడుపులో మంట యధాప్రకారం అతన్ని వేధించనారంభించాయి. రాత్రి బాగానే నిద్రపోయాడు కటిక నేలమీద.

పళ్ళ బిగువుతో లేచి కాలకృత్యాలు తీర్చుకుని, అంత చలిలో కాలవస్నానం యధాప్రకారం చేసి, రావిచెట్టు కింద ఆంజనేయులు బొమ్మకు ప్రదక్షిణంచేసి, బొట్టు అలంకరించుకుని, నులకమంచం బరబరా రోడ్డుదగ్గరకు లాక్కుని కూర్చున్నాడు.

ఈలోగా మంగమ్మ గుడిసెముందు చిమ్మి నీళ్ళు చల్లి ముగ్గేసింది. రోడ్డు పక్కన





మూడు రాళ్ళ పొయ్యి రాజేసి పెనం పెట్టి. సత్తు గిన్నెనిండా దోసెలపిండి, టిపిన్నిండా కారం చెట్నీ సరంజామా సర్దుకుని, చతికిల బడి అట్లకాడ చేత పట్టుకుంది.

గుడిసెవాసులు మేల్కొంటున్నారు. పిల్లా మేక అటుయిటు తిరగనారంభించారు.

మంగమ్మ దోసెలు పోసి తీసి దొంతరగా అమర్చి బోణీకోసం ఎదురు చూస్తున్నది. వాడకట్టు పిల్లమూక నకనకలాడే ఆకలి కడుపులతో వచ్చి తలావొకటి కొనుక్కుపో తారు. ఎండెక్కినకొద్ది వేసే దోసె తీసే దోసెతో ఆమె చేతులు చకచకా ఆడతాయి. పదింటికల్లా బేరం ముగించేసి డబ్బు లెక్క చూసుకుని, ఆ పొయ్యిమీద అన్నంకుండ ఎక్కిస్తుంది.

రామస్వామి కడుపులో ఆకలి మంటలు తాళలేక భార్యని కొరకొర చూస్తూ నులక మంచంలో కాలుమీద కాలేసుకూర్చున్నాడు.

పళ్ళు గంపకెత్తుకుని బస్తీమీద తిరిగి అమ్ముకుని బతికే రాములమ్మ బోణీచెయ్యా టానికొచ్చి కూర్చుంది.

రూపాయిబిళ్ళ మంగమ్మ చేతిలో పెట్టింది. మంగమ్మ ముమ్మారు పెనానికి తగిలించి బిళ్ళను కళ్ళకద్దుకుని నీళ్ళ చెంబులో పడేసుకుని, మూడు దోసెలు ఆకులో వేసి రాములమ్మ కందించి, ఆమె అందుకోగానే గరిటెతో చట్నీ వేసింది.

"చట్నీలో ఉప్పు కారం చాలిందా వొదినా? " అని అడిగింది.

"ఓ బేషుగ్గా వుందే వదినా. రాత్రి అన్నయ్య రంకెలు మా గుడిసెదాకా యిని పించాయి వదినా. తీరా విప్పుడు చూత్తుంటే రామసామి అన్నయ్య మా గొప్ప భత్తుడులా ఆపడుతున్నాడు సిత్రం గుందే" అని యికిలిస్తూ ఆవురావురుమని దోసెలు తినసాగింది రాములమ్మ.

ఆ! ఆ! అని ఆమె మాటలు వింటూ నాల్గు దోసెలు ఆకులో వేసి చట్నీ రెండు గరిటెలు పోసి "యిందా, లేచి అందుకో, తిను, రాత్రి కూడు కుమ్ములేదుగా" అని అందించింది.

రామస్వామి ఒక్క అంగలో అందుకుని మంచంమీద తిష్టవేసుక్కూచుని తినటంలో లీనమైపోయాడు.

"తాక్కపోతే సాదుమేక. తాగితే రాక్షసు డమ్మా మీ అన్నయ్య"

"చా! రేత్తిళ్ళు ఆ పొలికేకలేందంటనటా? నాకు తెలియకడతగావొదినా"

"తెగులు వీడెమ్మ కడుపు మాడ. తాగొచ్చి వూరువాడ ఆగం చేత్తాడు. వీడి నోరుబడ" కసితీర మొగుణ్ణి తిట్టింది మంగమ్మ.

తలెత్తకుండా రామస్వామి దోసెల్ని మాయం చేయటంలో శ్రద్ధ వహించాడు.

రాములమ్మ మంచి నీళ్ళు తాగి లేచి కాళి తట్టనెత్తిన పెట్టుకుని "వొదినా ఆనేకొచ్చి ఇచ్చి పోతాలే" అని వురుకులు పరుగులతో బస్తీవెపు వెళ్ళిపోయింది.

గుడిసెల్లో పిల్ల మూక గుప్పెట్లలో పైసలు బిగించి పట్టుకుని ఒక్కొక్కరే మంగమ్మ దగ్గరకు రాసాగేరు.

దిశమొలలవారు, చీమిడి ముక్కులవారు, రేగిన గుబురు తలల పిల్లలు, మొహాలు కడగనివారు ఏడ్చి ఏడ్చి చారికలకట్టిన మొహాలలో ఆకలి చూపులతో వచ్చి మంగమ్మ చుట్టూ మూగుతారు.

పరగడుపున ఆ దోసెతిని నీళ్ళు తాగి దుమ్ముధూళిలో కాలవకట్టమీద కేరింతలు, గంతులు పెడ్తూ బాల్యదశ వెళ్ళపుచ్చే దౌర్భాగ్యమూక.

రామస్వామి దోసెలు కాళీచేసి మళ్ళీ చెయ్యి చాపేడు. మంగమ్మ అటేపు చూడ కుండా పిల్లలకు దోసెలందించటంలో శ్రద్ధ తీసుకుంది.

"యింకో నాల్గు ఎయ్యవే మంగా" అని అడిగాడు.

మంగమ్మ చేతిలో అట్లకాడ వూపి,

"అడగటానికి నీకు నోరెట్టా వొచ్చిందయ్యా. రేత్రి నీ రెండోకూతురు, మూడోది, చిన్నపిల్లని చంకనేసుకుని సిన్మా సూసి నన్ను పలకరించి పోటానికొచ్చి బువ్వలు తింటుంటే తాగొచ్చి రంకెలెత్తావా. పిల్లల్ని అదరకొట్టావా? సిగ్గులేదాంట. విప్పుడు సెయ్యి సాచటానికి. డ్యూటి దిగి జేబులో పైస మిగలకుండా పూటుగా తాగి యింటికొత్తవా? ఈ సంసారం ఎట్టా గడస్తదనుకున్నా. చెప్పు ముంగల" అంటూ చివాట్లు వేసింది.

"ఓనరు గోరు యియ్యలేదే. పొద్దున్న రామ్మన్నడు. యిపుడెల్లి తెత్తా. నీ సేతిలో యాభై పార్నూక్కపోతే అప్పుడను"

"యింటో బియ్యం ల్లెవ్వు. కార్డుమీన బియ్యం పది కేజీలిత్తున్నారంట. అయితెత్తేనే బువ్వొండేది. తెత్తావా. సత్తెపెమాణకంగా"

రామస్వామి నెత్తిమీద చెయ్యి పెట్టుకున్నాడు.

"నీవిట్టాంటి పెమాణకాలెన్ని ఏలుచేశా? తాగనని. డబ్బు యిత్తానని కుటుంభరాన్నిట్టా కుంగతీశావా. ఒక్కగానొక్క కొడుకుని తన్ని తరివేశావే. ఆడుంటే మనకెంత అడుండేది. అక్కరకొచ్చినోడ్ని యింటోంచి తరిమేస్తివి నీ కడ్డంవస్తాడని, నా సావు సదరమౌతాంది గదా నీ తాగుడు నాశనంగానూ"

రామస్వామి మళ్ళీ చెయ్యిచాచాడు.

"సిగ్గు శెరం లేపోతే సరి" అంటూ దోసెలు అతని చేతిలో పడేసింది.

రామస్వామి తిని మంచినీళ్ళు తాగి తేన్పి టౌన్లో లారి సెంటర్లోకి బయలుదేరేడు.

"యిదొగో బియ్యం నీవు తెత్తేనే నీకు బువ్వేసేది? యీయాల అటోయిటో తెలస్తా. నా సంగతి యరంగావల. బియ్యం మర్సిపోగాక్లూ" అని అరిచింది. రామస్వామి ముందుకు సాగి పోయాడు.

"పిన్నావ్, పిన్నావ్ నన్ను పంపియ్యవే. ముంగల పొద్దెక్కిందే బిరాన ఎళ్ళాల"

మంగమ్మ కన్నెత్తి చూసి "చూత్తా వుండావ్ కదే రాజ్జవా నాకు రెండే చేతులు, పదిల్లేవ్వే. కూసేపు కూకోమ్మా" అని పనిలో లీనమైపోయింది.

"నాకు ఎండెక్కిందమ్మ. మైలుదూరం పోవాల సరుకు తెచ్చుకోవాలా. ఆమైన వాట్ని చక్కగా అమ్ముర్చుకోవాల. అన్ని తెమిలేప్పటికి గంట పట్టుద్ది. బేరం మొదలయ్యేప్పటికి బారెడు పొద్దెక్కుద్ది తల్లే. నన్ను నాపిల్లల్ని ముంగల పంపించెయి తల్లీ"

మంగమ్మ రాజమ్మకు రెండు, ఆమెతోపాటు వచ్చిన ముగ్గురు పిల్లలకు వొకటొకటి చొప్పున దోసెలు అందించి, పెనంతుడిచి దానిమీద దోసెలపిండి గరిటెతో పోసి పామి, లెవనెత్తి తిరగేసి, మళ్ళీ అట్లకాడతో లేవతీసి ఆకులోవేసి అందించింది మరో ఆమెకు.

"యింకో రెండెయ్ మంగమ్మవ్వా" అందామె.

"అట్నే కూకొమ్మ. నిమిషంలో ఎసెస్తా" అని మంగమ్మ పెనంమీద చూపు కేంద్రీకరించింది.

రాజమ్మ అర్ధరూపాయిచ్చి లేచి, ముగ్గురు పిల్లల్ను చురచుర చూస్తూ "తిన్నారుగా పొయి గుడిసెకాడే కనిపెట్టుకుండండి. తడిక యిప్పగాకండి. కుక్కలు దూరతయి. తెల్సిందా" అని ఆరేళ్ళ కొడుకుని కటువుగా చూసింది.

వాడికి బనీను తప్ప మరొటిలేదు. నల్లగా మట్టికొట్టుకున్న వంటితో నవ్వుతూ నిలబ





డ్డాడు. రెండేళ్ళ చెల్లెల్ని చంకనేసుకున్నాడు.

"కొడకా! పాపని జాగ్రత్త ఆడిపించుకో. తోలుతీస్తా. తమ్ముడ్ని తన్నబాకో"

"ఆడే నన్ను తంతాడేమ్మా"

"అన్నే-మరే మట్టిలో పండేసి నా మీదెక్క తాడేమ్మా" అని నాల్గేళ్ల చిన్న కొడుకు ఫిర్యాదు చేశాడు.

"కొట్టుకుసావగాకండి. మద్దినేల వస్తా మొక్కజొన్న కండెలు తెత్తాగా, మా అయ్యగా, ఎడిపించగాక "అంటూ చకచకా వెళ్ళిపోయింది.

వొరిగిన గుడిసెనొదిలి, పిల్లల్నొదిలి పొట్ట నింపుకోటానికి, రాజమ్మ బజార్న పడ్డది.

రాజమ్మ మొగుడు రాజయ్యా సద్ది బువ్వ తిని, సత్తుటి పెనుకారియరు చేత పట్టుకుని అరగంట క్రితమే బస్తి సెంటర్లోకి పరిగె ట్టాడు కూలిపని వెతుక్కోటానికి.

కాకుల్లాగా తెల్లారంగానే బస్తీమీదకెళ్ళి దొరికిన చాకిరి చేసి పావల డబ్బులు సందే ళ్ళకెత్తుకొచ్చి బువ్వలొండుకు తినే బానిస మూక ఆ గుడిసెలనిండా లుకలుకలాడుతు న్నారు.

★ ★ ★

కాలవకట్ట కిక్కిర్సిన గుడిసెలు అవేవీ కళకళ ళ్లాడటంలేదు. గుడిసెల్లోని మనుష్యుల మొహాల్లో కళాకాంతులూ కనిపించటం లేదు.

ఎండకు ఎండి, వానకు తడ్సి నానిన గుడి సెలపై భాగాలు బూడిదరంగులో వికారంగా అగుపిస్తున్నాయి.

చిక్కిరి బిక్కిరి కాలిబాటలు, మురుగు కాలవలు, వాటిమధ్య ఆడుకుంటూ ఏడుస్తూ సందడి చేసే దిగంబర పిల్లలమూకలు వల్ల కొద్దిగా సందడిగా వుంటుంది.

ఈమధ్యనుంచి మంగమ్మ దోసెల దుకా ణంవద్ద పొద్దుటి పూట రద్దీ పెరిగింది. కొత్తకొత్త మొహాలు వచ్చి కూర్చుని తినిపో తున్నారు. బేరం మూడు నాలుగు రెట్లు పెరిగేసరికి మంగమ్మకు పని పత్తిడి ఎక్కువై, ఊపిరి సలపటంలేదు.

కాస్త వెసులుబాటు చేసుకుని, బేరం పెర గటానికి గల కారణం తెలుసుకుని ఆశ్చర్యా పోయింది.

"ఔరా! ఇదా సంగతి. మీ గుడిసెలన్ని పీక్కొంచుకుని ఈ కాలవకట్టన వేసుకున్నార న్నమాట" మంగమ్మ తన కెదురుగా కూర్చుని వళ్ళో చంటి పిల్లకు దోసె తినిపి స్తున్న తన వయస్సున్న ఆ స్త్రీని అడిగింది.

"మమ్మల్ని మా గుడిసెల్లొంచి లాగేసి, తాటాకులు పీకి గుట్టేశారు. గుడిసెల్లో దూరి మంచాలు, గిన్నెలు, కుండలు, కంచాలు బయటపడేశారు. మేం నెత్తి నోరు కొట్టుకున్నా వాళ్ళకి జాలి కనికరం లేదక్కా'
'

"ఆమైనేం చేశారు మీరు? "

"మేం ఎం చేత్తాం. చూత్తా నిలబడ్డాం. వాళ్ళు గుడిసెల్ను బిందరవందర చేసి మధ్యానం అన్నాలటయిముకెళ్ళిపోయారు. మేం బయటే బువ్వలొండుకుతిని గోడనీడన మంచాలేసి పిల్లా పాపల్ని పండేశాం. ఎవరో ఈ కాలవకట్టమీన కాళీచోటుంది మేం ఆడకి పోతుండం, అనుకుంటే మేం వచ్చి ఆరి వెనకాల పాకా ఏసుకున్నామక్కా'
'

"తల దాచుకోటానికి గూడా ఎన్ని యాత నలు పడాల్సి వస్తుందో మన అసుమంటో ళ్ళకు ఔరా బీదుగులం రానురాను తిప్పలు పెచ్చవుతుం డాయేగాని తగ్గటంలేదే"

"మ్చి మాయదారి రోజులు దాపరించా యక్కా మీరెంత కాలమాయ ఈడకొచ్చి అక్కా"

"పదేళ్ళు దాటాయ్"

"అట్నా... బావేంపని సెత్తాడు. పిల్లలెం తమంది? "

మంగమ్మ మొహంలో కళ తప్పింది.

"అబ్బో! మాకత, మా బతుకూ, ఏం బతుకులేమ్మా. పదేళ్ళనాడే బజార్లో పడ్డాం తల్లె. నా పెనిమిటి తాగుమోతుగాడ్డె కొడుకు. నా కొక్కగానొక్క కొడుకు. ఎటో వెళ్ళిపోయాడు. ఆడముండలు నలుగురు నాల్గు రకాలుగా బతుకుతున్నారు. నన్ను సూత్తుండావుగా! యిట్టా బజాట్లో పొయ్యి పెట్టుకుని బతుకీడుత్తున్నా. పాడు జల్మ ఎట్టా కడతేరద్దో గానీ తల్లే. నీ వళ్ళో పిల్ల నీ మనవరాలా? "

"నా కొడుకు బిడ్డ. నా కొడుకు రంగుల పని చేస్తాడు. మంచి పనోడే. కానైతే తాగు బోతు తిరుగుబోతోడైనాడు. నేనూ బేల్దారి పనులకు ఎళ్తా. నా కోడలూ నాతోపాటే వచ్చేది. నా కొడుకు నా కోడల్ని నానా బాధలు పెట్టుంటే అది తట్టుకోలేక ఎటో ఎల్లిపోయింది. యిద్దరు పిల్లల్ని వదిలేసి. ఆ పిల్లల్ని కూలినాలి చేసుకుంటా నేనే సాకుతుండా. వీళ్ళెప్పటికి పెద్దోళ్లవుతారో, యింకెన్నెన్ని చిక్కులు పడాలో"

"నీ పేరేందో! మిమ్మల్ని తోలేసిన తావులో వాళ్ళేం చేశారు"

"నా పేరు వరమ్మ ఆవరణలో సినిమా హాలు కట్టిస్తున్నారు. ఎన్నో లక్షలవుతుం దంట. ఆడ నేను కూలిపని సేత్తుండా యిర్వై రూపాయలు రోజుకూలి"

"ఓహో! పట్నవొళ్ల రైసుమిల్లు ఆవరణం లోనా. నాకెందుకు తెల్వదు. అయి అన్నద మ్ముల భాగాలు కుదరక కోరుట్లకెల్లి వెజ్యా లేసుకుని పాడుపెట్టేశారు. ఆవరణలో మేం గుడిసెలేసుకుందామనుకున్నాం. అప్పటికే గుడిసె మీద గుడిసెలతో కిటకిటలాడతా వుందని చెప్పి, ఈడ దిగబడ్డాంతల్లే. ఈడ నుంచి మరే తావు కెళ్ళాల్సివస్తదో అని ప్రాణం భయంతో పీచుపీచుమంటది వరం మక్కా"

"యిది పెభుత్తం భూవిగదా. ఆసావుల్దికా దుగా"

"కాకపోతేనేం ఈ కాలవని వెడల్పు చేసి కట్టలు ఎత్తుచేస్తారంట ఎప్పుడో. అప్పుడు మనం లేచిపోవాల్సిందే చచ్చినట్టు"

"అయ్యోదేవుడో! అంతేనాక్కా"

"అంటున్నారు. యిప్పట్లో కాదులే"

దూరపు భయాల్ని తల్చుకుని దడుసు కుంటూ మంగమ్మ, వరమ్మసన్నిహితులై నారు.

సంపదలమధ్య దరిద్రం గజగజలాడుతూ బతుకుతూ, సంపదలను సృష్టిస్తుంది, రక్షి స్తుంది.

చుట్టుపక్కల దరిద్రాన్ని పెంచుతూ తరు ముతూ, అణుచుతూ రింగురంగా మని ఠీవి వలికిస్తూ రంగరంగ వైభవాలను కులికిస్తూ విర్రవీగుతుంది.

సంపద, దరిద్రం భయంకరమైన క్రూర మైన సహజీవనం గడుపుతున్నాయి.

బస్తీలోకెళ్ళి చాకిరి చేసుకుని పొట్టపోసు కునే ఆడవాళ్ళు.

ఆ ఆడవాళ్ళలో ఎక్కువమందికి తాగు మోతు మొగుళ్ళు, కొడుకులు, అల్లుళ్ళు దాప రించి శారీరకంగా, మానసికంగా హింసిస్తుం టారు.

★ ★ ★

వీరమ్మ రెండు గేదెలకు పాలు తీసి, తగు మోతాదులో నీళ్ళు కల్పి మూడు చెంబుల్లో కొల్చి పోయగానే, వీరయ్య, రెండు చేతుల్లో రెండు చెంబులు తీసికెళ్తూ, అద్దంముందు తల దువ్వుకుంటున్న కొడుకుతో "రాఘవ

య్యని కల్సుకుని బతుకుతెరువు సంపాదించు ముంగల. ఆనేక సోకులు సోగసులూ" అని రుసరుసలాడుతూ యిల్లు దాటాడు.

ఇరవయ్యేళ్ళ శీనయ్య గంభీరంగా తల్లిని, చెల్లెలు అనురాధను చూసి, "జేబులో రూపాయలేదు మూడ్రోజుల్నుంచి రాఘయ్య కాడికి ఆరు సార్లెళ్ళి వచ్చా. యీ వేళరమ్మన్నాడు ఎళ్తున్నా" అని గొణిగాడు.

"పౌరుసంగా బతకాల! పది రూపాయలు సంపాదించు ముంగల" అన్నది తల్లి కూతురుకు జడేస్తూ.

"సెంటర్కి ఎల్తుండావ్‌గా అన్నా, బేంకోళ్ళకి ఆపాల్చెంబుయిచ్చి పో" అంది అనురాధ. భుజాలు చినిగిన చొక్కా పాతగళ్ళ లుంగిలో అన్నను చూసి "అడ్వాన్స్ తీసుకుని పైజామా లాల్చీ కుట్టించుకోముంగల. నీ చొక్కాలు రెండు వుతికారేశాలే. దిగులు పడమాకా సోగ్గాడా" అని నవ్వింది.

నాయనమ్మ పక్కనుంచి వచ్చి రెండ్రూపాయలకాయితం జేబులో పెట్టి అన్నది, "రాఘవాయిగాడు, వాడి అప్పసెల్లెళ్ళు మొదట్నుంచి గాలిమూక. రోసం, పాసం, సిగ్గు యెగ్గు లేకోకుండా బజారెక్కి బతుకుతున్నారు. ఘనుంరైతు పద్ధతిగా అస్తుబిస్తుగున్నాం. మరిపుడు ఆళ్ళగడపల ముంగల కెళ్ళి చెయ్యి చాపాల్చొచ్చింది నాయనా. ఆడు రాఘవాయిగాడు డబ్బున్న ఆడోళ్ళని వల్లో ఎసుకుని పూలరంగడల్లె కులుకుతున్నాడు. ఆడి చెడిపోయిన చెల్లెలు సిన్మాలోడిని పట్టి, మద్రాసెల్లి, యీడ మేడలు కట్టిచ్చుతుందంట, ఎంత మాయ, ఎంత ఘోరం తండ్రే"

"నాయనమ్మా! పిల్లి శాపాలకు వుట్లు తెగవ్. గొణగమాకా"

శీనయ్య పాలచెంబు తీసుకుని తల్లిని చూసి "నీళ్ళ పాలు పోస్తున్నారోయ్ అని వాళ్ళు గునుస్తున్నారు. నన్ను దొబ్బులు పెట్టుంటారు. రేపట్నుంచి నేపోనూ" అని నసిగాడు.

అందుకు తల్లి "నేను కాపరానికొచ్చినప్పట్నుంచి పాలు పోస్తా బతుకుతుండారా తండ్రి. ఎవరెంత ఆచ్చేపన చేస్తున్నా మామూలు కల్పటాలు తప్పవు సరేనా. మీ అయ్య ఎగసాయంవల్ల బావుకు తిన్నదేం లేదు. ఓకేడు పండద్ధి. రెండెళ్ళు పంట చేతికిరాదు వరదలు, తెగుళ్ళు వల్లకాడు. అక్కర్లు, గొంతు కత్తెర్ల అగచాట్లుకు, మెళ్ళోనానుతాడో, కాళ్ళపట్టాలో, చేతిగాజులో తాకట్టుపెట్టి బతుకుజీవుడా అనుకుంటూ కాలం వెళ్ళమారుత్తుండాం" అంటూ వేష్టపడ్డది.

"ఇగన అన్నాయ్ అక్కరకొచ్చేడు లేమ్మా. అంగలార్చమాక"

"నీ మాటసల్లగుండా, అంతకంటే కావాల్సిందేంవుందే కూతురా"

శీనయ్య గుమ్మందాటాడు. పాలచెంబు బెడద వదిలించుకుని బస్తీ సెంటర్లో కొచ్చేశాడు. అందరూ చాలా హడావిడిగా తిరుగుతున్నారు. ఆ విశాలమైన రోడ్డుకిరువైపులా లారీలు ఆగి యిరుకుగా, రద్దీగా వున్నా కొత్త లారీలొచ్చి ఆగటానికి తంటాలుపడుతూ బాటసారులను యిబ్బంది పాల్చేస్తున్నాయి. గుంపులు గుంపులుగా డ్రైవర్లు, క్లీనర్లు, మెకానిక్‌లు తీరుబాటుగా, సిగరెట్లు తాగుతూ బాతాకాని కొడ్తున్నారు. మెరుపుల్లా, వెల్డింగ్ షాపులోంచి, కాంతులు మెరిసి మాయమౌతున్నాయి.

శీను ముందుగా నడుస్తూ రాఘవయ్యను కళ్లతో వెతుక్కుంటూ, లారి బ్రోకరాఫీసు ముందు నిల్చున్నాడు. యిరుకు రోడ్డు, మంగలి షాపు కిళ్ళీదుకాణం, సోడాబండి, చెప్పుల దుకాణం, దురాక్రమణ చేసుకుని పాతుకుపోయి వున్నాయి.



బ్రోకరాఫీసులో చాపమీద కూర్చుని సిగరెట్ తాగుతూ ఠీవిగా మేకపోతు గాంభీర్యంలో దర్జా, ధీమా వెలగపెడుతున్న రాఘవరావే "ఓరే శ్రీను, దా! దా!" అంటూ తలాడిస్తూ ఆహ్వానించాడు.

శీనయ్యకు ప్రాణం లేచొచ్చింది. నమ్రతగా నమస్కారం పెట్టగానే, రాఘవయ్య "మన్లో మనకెందుకురా నమస్కారాలు, గుడ్‌మార్నింగులు" అని భుజం తట్టి వీపు నిమిరాడు పక్కన కూర్చోపెట్టుకుని ఆప్యాయంగా కావలించుకున్నాడు. టీ తెప్పించాడు. సిగరెట్ ఇవ్వబోతే శీను వద్దన్నందుకు మళ్ళీ భుజం తట్టేడు. ఉక్కిరిబిక్కిరైన శీను మామూలు స్థితిలోకి రావటానికి ఐదు నిమిషాలు పట్టింది.

ఆ ఐదు నిమిషాల్లోనే శీనుకు కారు తాళం చెవులిచ్చాడు. కొత్తగా తెల్లరంగు వేసున్న అంబాసిడర్ కారును చూపిస్తూ, "జాగ్రత్తగా తోలుకో, నీటుగా వుంచుకో, ఓనర్ జానకమ్మతో గౌరవ మర్యాదలతో మెసులుకో. ఏమాత్రం పొరపాటు, రాంగ్ వొచ్చిందో, మనం మనం చుట్టాలం యవ్వారం చెడకుండా చూసుకో. ఓనరు అసాధ్యురాలు. నరమానవుణ్ణి నమ్మదు. జీతం ఆరొందలిస్తుంది. నమ్మకం కుదిరిందా నిన్ను బిడ్డలా చూసుకుంటది. జాగ్రత్త. విశ్వాసంగా మెలిగావో జయించుకొస్తావ్. ఆడపిల్లలిద్దరితో రవుడి ఏషాలు, ఎకిలి తనం వొద్దనే వొద్దు" వేళ్ళమధ్య సిగరెట్‌ని ఆఖర్ దమ్ముకొట్టి పారేసి, తల ఎగరేసి జుట్టునోమారు కుడిచేత్తో సరిచేసి చిరునవ్వు నవ్వేసి లేచి వళ్ళు విర్చుకుని ట్రేడ్ యూనియన్ ముఠానాయకుడి పోజులో నిల్చున్నాడు.

నలభై యేళ్ళ రాఘవయ్య సిల్కులాల్చీ పంచ, చేతికి వాచి, మూడేళ్ళకు ఉంగరాలు, మెళ్ళో బంగారు గొలుసు, ఉంగరాలు తిరిగిన గుబురు క్రాఫ్, ఎర్ర కళ్ళు, ఉబ్బరించిన మొహం, వచ్చీరాని పొట్ట వగైరాలతో ఆ సెంటర్లో ఘరానాగా పదేళ్ళనుంచి వళ్ళు దగ్గరపెట్టుకుని దడిపిస్తూ, దడ్సుకుంటూ బతుకుతూ బతికిస్తూ జీవిస్తున్నాడు.

"మనకీ సెంటర్లో, అంతా దోస్తులే. అందరితో భాయి, భాయిగా వుండాల తెల్సిందా" శీనయ్య భుజంమీద చెయ్యివేసి నడుస్తూ కారు దగ్గరకు వచ్చాడు రాఘవయ్య. లాల్చీ జేబులోంచి 50 రూ. నోట్ అందిస్తూ రెండు కొబ్బరికాయలు, డజన్ చక్కెరకేళీలు, పది రూపాయలకి చేమంతులు, రోజాలు కొనేసి జానకమ్మగారింటికెళ్ళి యిచ్చేసి కార్ షెడ్‌లో పెట్టేయ్. రాత్రికి కళ్యాణ మండపంలో పెళ్ళికి అమ్మగారు పిల్లలు వెళ్ళాలంట. హాజర్‌గావుండు. ఆరిల్లు తెల్సుగా"

తెల్సుమాయ్యా, సెవన్‌స్టార్స్ బ్రాందిషాపు ఎదరసందులో మొదటిల్లు"

"బేగి కార్లో ఎల్లి వాకిట్లో వాలిపో" అని కారు డోర్ తీశాడు రాఘవయ్య.

శీనయ్య చాలా ఉత్సాహంగా కార్లోదూరి, పూలు పండ్లు కొనేసి ఐదు నిమిషాల్లో జానకమ్మ యింటిముందు కారాపి, గేటు తీసుకుని వరండాలో నిల్చుండిపోయాడు.

టి.వి.లో పెద్దగా, సినిమా పాట సందడితో మధ్యహాలు! పడక కుర్చీలో నలభై యేళ్ళ జానకమ్మ లేతగులాబి సిల్కు చీరెలో మేకప్ లేని సినిమా మహిళలా నివురు కప్పినట్లున్నది.

"కారు తీసుకొచ్చానండి. కొత్త డ్రైవర్ నండి, రాఘవయ్య మావయ్య పంపించాడండి పూలు, పళ్ళూ" అని సోఫాలోపళ్ళ నుంచాడు.

జానకమ్మ శీనుని నఖశిఖ పర్యంతం చూసింది. అతను చేతులు కట్టుకునిలబడితే, "అట్లాగా, దా కూచో కుర్చీలో" అని మర్యాద చెప్పినా "ఫర్వాలేదండి, కారులోన పెట్టెయ్యమంటారా" అన్నాడు శీను.





# ఏరిన ముత్యాలు

★ కౌశలం కంటే రెట్టింపు విలువైనవి ఓర్పు, లక్ష్యశుద్ధి

-హక్స్లే

★ పిల్లలకు కావలసింది విమర్శలు కాదు- నమూనాలు

-జోసఫ్

★ తక్కువతో తృప్తిపడడం నేర్చుకోమనే ప్రకృతి మనని నిరంతరం హెచ్చరిస్తుంటుంది.

-సోక్రటీస్

★ ఉత్సాహం ఉరకలేస్తున్నప్పుడు ఎంతటి శ్రమైనా బండచాకిరి అనిపించదు

-మెరిడిత్

★ డబ్బు ఆరవ ఇంద్రియం లాంటిది. ఈ ఇంద్రియం లేనిదే మిగతా అయిదు ఇంద్రియాలను పూర్తిగా మనం వాడుకోలేము

-సోమర్‌సెట్‌మామ్

★ సంక్షోభం, ప్రతిష్ఠంబన సంభవించడంవలన ఒక లాభం వుంది. అవి మనలను ఆలోచింపజేస్తాయి

-జవహర్‌లాల్ నెహ్రూ

★ మనుషులను భగవంతుడు పరిపూర్ణులుగా చేయలేదు. పరిపూర్ణత కొరకు వెతికే యాత్రికులుగా చేశాడు

-బీచర్

★ కొద్ది కోరికలతో, చిన్న విషయాలతో తృప్తిపడటడమే ఉత్తముని లక్షణం

-ఎమర్సన్

★ తృప్తితో నిన్ను నీవు బలపరుచుకో, అది ఎవరూ జయించలేని కోట

-ఎపికెట్టస్

★ బాధను సంతోషంతో తట్టుకున్నప్పుడు అది బాధకాకపోగా చెప్పనలవి కాని ఆనందంగా మారుతుంది

-గాంధీజీ

★ సంపద ఉప్పునీటిలాంటిది. ఎంత తాగితే అంత దప్పిక పెరుగుతుంది

-గోల్డ్‌స్మిత్

★ మానవుని మంచి జీవితానికి నేర్చుకోవడం, సంపాదించడం, కాంక్షించడం అనే మూడు గుణాలు అవసరం

-మోర్‌లే

★ సాధించిన విజయంకంటే అభిలాష ఎంతో గొప్పది

-జరాతుష్ట్ర

సేకరణ: **పట్నం శేషంశెట్టి**




ఈ శీర్షికద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్ళీ చెప్పకుండా, అవసరమైనమేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్ట్‌చేయాలి.

**మాకు సకాలంలో అందిన సమీక్షలలో ఎన్నికచేసిన అయిదు ఉత్తమ సమీక్షలకు రు. 100/- ప్రథమ బహుమతి, రు: 75/- ద్వితీయ బహుమతి, రు: 50/- చొప్పున మూడు తృతీయ బహుమతులను అందజేస్తున్నాం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.**

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రను మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

**కూపన్**

జూన్ చతుర నవల వేదనభూమి

**సమీక్షకుని పేరు :** ..............................

**చిరునామా :** ..............................

..............................

..............................

..............................

"కూచోవాయ్ ముందు, నీతో యింటర్వ్యూ చేయాలి" అన్నదామె.

వాకిట్లో స్కూటర్ ఆగింది. జానకమ్మ కూతుళ్ళు యిరవై ఏళ్ళ సుమిత్ర, పద్దెనిమి దేళ్ళ కళ్యాణి చకచకా హాల్లోంచి లోపలకెళ్ళి పోయారు. బెరుగ్గా శీనయ్య కూర్చున్నాడు.

జానకమ్మ శీనయ్యని యింటర్వ్యూ మొద లెట్టింది. కాళ్మీద కాలేసుక్కూచుని.

"నీకెట్లా మావయ్యా ఔతాడు రాఘవయ్య'

"మా అమ్మ పెద్ద తల్లి కొడుకు"

"మీదీవూరేనా మీ నాన్నేం చేస్తాడు మీరెంతమంది మీ అమ్మకు? "

"ఈ వూరే! తాటిచెట్లపాలెం. మాకు మూడెకరాల పొలం వుందమ్మా. ఒకేడు పండితే మరో ఏడు గేరంటివుండదు. మానాయనే తిప్పలు పడుతుంటాడు. మా అమ్మ నాలుగ్గేదల పాడి మా నాయనమ్మ సాయంతో నెట్టుకొస్తుంటది. నా చెల్లెలు పద్దెనిమిదేళ్లు. యింటి చాకిరి, దానికి పెళ్ళి చేసెయ్యాలని మా యింటిల్లిపాది తలకా యలు పగలకొట్టుకుంటున్నారు. ఆ పిల్లా నాట్లు, కలుపులు, కోతలకెళ్ళుద్ది"

"నీవు నిన్నటిదాకా ఎక్కడ పన్చేశావు"

"కంట్రాక్టర్ అంజిరెడ్డి చిన్నకారు తోలేను. బాపయ్యగారి బండి సంవత్సరం నడిపా. జీతం చాల్లే. తమరు ఫోను చేసి కను క్కోండి. నేనేట్లాంటి వాడ్నో తెలస్తది"

"తర్వాత కనుక్కుంటా నీ ఏజెంత? , ఏం చదివావ్? "

"యిరవై ఏళ్ళండి. సక్రమంగా చదువుసా గుంటే పైనల్ బియస్సీలో వుండేవాణ్ణి. మీ పెద్దమ్మాయి సుమిత్ర నేను యింటర్‌లో కల్సి చదివాం అమ్మగారూ"

"శ్రద్ధగా ఎందుకు చదువుకోలేదు"

"యింటి పరిస్థితులే. మా వొళ్ళకి గొడ్లమీదే శ్రద్ధ ఏకాడికి వాటిని మేపు కోటా నికే తంటాలుపడతారుగాని, నన్ను పట్టించు కోలే. గాలికొదిలేశారు. నేను కూస్త కార్‌మె కానిజం నేర్చా. లాభం లేదని డ్రైవింగ్ లైసెన్సు సంపాదించా. అట్లా అట్లా మీ బోటి ఓనర్ల కాళ్ళు, గడ్డాలు పట్టుకుని రోజులు నెట్టుకొస్తున్నానమ్మగారూ"

జానకమ్మకు శీనయ్య వాగ్ధోరణి నచ్చిన ట్లుంది. మందహాసం చేస్తూ, "నీ స్వయం కృషితో కాస్త పట్టుదలగా చదువుకుంటే బావుండేదేమో" అంది.

"రోజులు గడుస్తున్నకొద్దీ అగచాట్లు ఎక్కువైపోతాయనే తెలివిలేకపోవటంవల్ల "

ఆ మాటలు ఆమెమీద బాగా పన్చేశాయి. మనస్సులో కొన్ని క్షణాలు దుమారం లేచి సర్దుకుంది. శీనయ్య తెలివితేటలు మరో దిశలో పదునెక్కాయని గ్రహించింది. శీనయ్య ఆమె కళ్లలోని మెరుపును చూసి ఆశ్చర్యపోతుండగా, సుమిత్ర పంజాబి డ్రస్‌లో వచ్చి కూర్చుంది. కళ్యాణి కాఫీగ్లాస్ అందించి తల్లి పక్కన చేరింది.

"మన కారు, కొత్త డ్రైవర్ శ్రీనివాసు" కూతుళ్ళకు పరిచయం చేసి, "మా యింట్లో చాలా విషయాల్లో మా అమ్మాయిల యిష్ట ప్రకారమే సర్దుకుపోతుంటా. నా పెత్తనం వొదులుకుంటున్నా కొద్దికొద్దిగా" అని శీన య్యకు తెలియచేసింది.

శీనయ్య చాలాకాలానికి మంచి రుచికర మైన కాఫీ తాగుతూ పరవశించి పోతూ, యజమానురాలి ఆదర్శాలతో ఏకీభవిస్తూ "యీతరం అమ్మాయిల్లో కొత్తకొత్త ప్రజ్ఞలు, ధోరణులు వికసించాల్సిందే అమ్మా! వాళ్ళనె వరూ ఆపలేరు గూడా" అని వత్తి పలికాడు.

అతని అభిప్రాయానికి వాళ్ళెంతో సంతో షిస్తున్నట్లు మందహాసాలు చేశారు.

"మనకార్లో జాకి కనిపించలే. క్లీనర్ కాజే

శాడంటాడు డ్రైవర్, డ్రైవర్ గనే అంటాడు మీమామ. యిట్టాంటి దొంగవెధవలెం దుకూ. మంచి కుర్రోడ్ని చూడు అన్నా రాఘవరావుతో నిన్ను సెలక్టు చేశాడన్న మాట"

"చిత్తం, నా గురించి ఫోన్ చేసి కను క్కోండి రెడ్డిగార్ని, బాపయ్యగార్ని"

జానకమ్మ శీనయ్యని పరిశీలనగా చూసింది. "చూద్దాంగా నీ నిజాయితీ ఎంతో తొందర్లోనే తెలుస్తుందిగా అన్నట్లు నీవు ప్రతిరోజు ఉదయం పూట వచ్చి కని పించాల. అవసరమైతేనే కారు బయటకు తీయాలి తెల్సిందా? "

"ఆరుగంటలకల్లా హాజరవుతా, బాపయ్య గారి కార్లోనే పడుకునే వాడ్ని. ఆయన రాజ కీయనాయకుడుగదా. తెల్లార్జామునా, అర్ధ రాత్రీ, వర్షంలోనూ లెక్కలేకుండా కారు నడి పేవాడ్ని"

"కనుక్కుంటాంగా" అంది సుమిత్ర.



రాత్రి పన్నెండుగంటలకు మాజి మున్సి పల్ చైర్మెన్ రిక్షాదిగి, తూలుతూ గృహప్ర వేశం చేశాడు.

పాతికేళ్ళ కుమార్తె భారతి తలుపు తీసి "ఎనిమిదింటికే యింటికొచ్చేస్తానన్నారు. అర్ధరాత్రి దాటిందేం" అని నిలేసింది తండ్రిని.

"మన యం.యల్.ఏగారు హైద్రాబాద్ నుండి టౌన్‌కొచ్చారు. రహదారి బంగళాలో స్నేహితులమంతా కల్సి రాజకీయ ముచ్చట్లు చెప్పుకుంటూ, కొంచం కుషీ చేసు కున్నాం" అని పెద్ద ఘనకార్యం చేసినట్లు నవ్వేడు బిగ్గరగా.

"మన యం.యల్.ఏ గూడా తాగుమో తేనా? "

"వాళ్ళకేం కోటీశ్వరులు, సారాకాంట్రాక్టర్ల వంశం ఏమనుకున్నావో"

"వాళ్ళంతా కోటీశ్వర్లు, మనవంతా బికారి మూకలం, తాగి ఆస్తిపాస్తులు నాశనం చేస్తూ వాళ్ళని పొగుడుతూ, వాళ్ళ కనుస న్నలో మెసలుతూ..."

"నిన్ను చూస్తే నాకడుపు తరుక్కుపోతు న్నది తల్లీ" అంటూ కుమార్తె తల నిమి రాడు తిలక్.

"అవును పాపం తరుక్కుపోతుంటే భరిం చలేక, యిట్లా యిద్దైపోయి యింటికొస్తారు పాపం" తండ్రి చేతిని తన తలమీదనుంచి తోసేస్తూ అన్నది భారతి.

"నీకు పెళ్లి చేయలేక పొయ్యా యింత బతుకు బతికి" లాల్చి విప్పి వంకెకి తగి లిస్తూ గొణిగాడు గొప్ప నేరం చేసిన వాడి లాగా.

"నాకు పెళ్ళి కాకపోవటంవల్ల నేను చాలా అదృష్టవంతురాల్ని నాన్నా. అమ్మను, వదినను చూస్తున్నాగా, వాళ్ళు తాగుబోతు భర్తలవల్ల పడే అగచాట్లు, కళ్ళారా చూస్తు న్నాగా"

"నీకట్లాంటి వాణ్ణి ఎందుకు కట్టబెట్తాను. ఏ బేంకి ఆఫీసర్నో, డాక్టర్నో, తెచ్చి చేస్తా తెల్సా" అని భారతి భుజం చరిచాడు.

"వాడు తాగుమోతు వాడైతే ఏం చేస్తావ్.





బోసన్నయ్య, నీవు, వాడు చేరి హాల్లో తాగుతూ, రాజకీయాలు, సినీమాలు, హస్కు కొడుతూ మా దుంపతెంచుతారం తేగా"

"నీ ఉద్దేశ్యం మొగాళ్ళంతా, తాగుమోతు మూకల్లాగా కనిపిస్తున్నారన్నమాట. నీవు చాలా రాంగ్‌గా ఆలోచిస్తున్నావమ్మడూ"

"నేసూ యం.యస్.సీ చదువుతానంటే వద్దన్నారు. నా ఫ్రెండ్సంతా మంచి జాబ్సులో సెటిలైపోతున్నారు. నేనిట్లా నా టాలెంట్సుని వృధా చేస్తు చేతులు ముడ్చు కుని నిల్చుండిపోతున్నా"

కూతురి ఆవేదన, ఆకాంక్షల తీవ్రతను తట్టుకోలేక మౌనంగా పరితపిస్తూ గదిలోకి వెళ్ళిపోయాడు తిలక్.

భారతి గదిలోకెళ్ళి తల్లి పక్కన పడు కుంది.

బోస్‌బాబు రిక్షాదిగి యింటి ప్రహరి గేటు తీసుకుని వరండాలోకి రావటం గమనిం చింది. టంగ్, టంగ్‌మని గడియారం మోగటం విన్న భారతికి మహాచిరాకు, విసుగు చెలరేగాయి.

"చెల్లాయ్! చెల్లాయ్! ప్లీజ్. తలుపుతీ? "

"... ... ... "

"ప్లీజ్! ఎక్స్‌క్యూజ్‌మీ. తలుపు తీ? "

భారతి లేచి తలుపుతీస్తూ, ఆవలించి "యిట్లా ఎంతకాలం అఘోరిస్తావ్. అన్నాయ్! నీవంటే నాకెంత అసహ్యంగా వుందో? నాన్నారి గురించి, నీ గురించి అమ్మెంత కుళ్ళిపోతున్నదో తెల్సా... ఛీ! మీరిహమారరా? " అంటూ జాడించింది.

బోస్ తలవంచుకుని నోర్మూసుకుని తన గదిలోకి తూలుకుంటూ వెళ్ళుతుండగా, "నాన్నగారు ఎక్కడా కనిపించలేదుట్రా అన్నాయ్? " అని అడుగుతూ వెంబడిం చింది.

"నాన్నారింకా రాలేదా? నేనే నయమన్న మాట" అని విలన్ లాగా నవ్వేడు.

"మా శవాల మీంచి నడిచి పోతూగూడా నవ్వగలర్రా మీరు, నాన్నొచ్చి పడుకున్నా డులే"

"ఇహ వాక్కే తల్లీ. నన్ను వదిలిపో. నామనసేమీ బాలేదు ప్లీజ్"

"పోనీ రేపెళ్ళి అరుణని తీసుకురానా? "

"యిస్. అబ్బా. నన్ను... నన్ను... ప్లీజ్"

"నీకర్మకు నిన్ను వొదిలేశాంలేరా, ఎప్పుడో" అని తన గదిలోకి వచ్చేసింది.

బోసుబాబు గుడ్డలు మార్చకుండానే మంచంఎక్కాడు.

ఐదు నిమిషాలు గడిచిన తర్వాత, రాధమ్మ గదిలో లైటు వెలిగింది.

ఆమె నిదానంగా బోసుబాబు గదిలోకొచ్చి లైటువేసి పుత్రరత్నం ఏ స్థితిలో అఘోరిం చాడో చూసి నిట్టూర్చింది.

మంచం దగ్గర నిలబడి "బోసూ! కూసింత మజ్జిగన్నమన్నా తిన్రానాతండ్రే" అని వీపుమీద చెయ్యివేసి కొడుకు మొహంలోకి దిగులుగా చూస్తూ. "అడ్డాలనాడు బిడ్డలు గాని గడ్డాలనాడు బిడ్డలా? మాయదారి సంతానం" అని సణిగింది.

బోస్ లైటువెలుతురును చిట్లించి చూసి వెంటనే కళ్ళు మూసుకుని "తిన్నా. పలావ్ తిన్నానే. లైటు తీసెయ్!" అని కసురుకు న్నాడు.

"సర్లే! జీతాలొచ్చినాయా? పర్సెక్కడ్రా? "

"జేబులో వుందిలే, లైటు తీసెయ్యవే"

రాధమ్మ, బోసుని పొర్లించి జేబులు వెతికి, పాంట్ జేబులో చేతికి తగిలిన పర్స్ తీసి లైటార్పి తన గదిలోకొచ్చేసింది.

భారతి తల్లి చేసిన ఘనకార్యాన్ని

విషాదంగా చూస్తున్నది. తల్లి పర్సులోంచి నోట్లు లెక్కపెట్టి "ఐదొందలు తగలేశాడే వొక్క పూట్లోనే మాయదారోడూ! వీడిహ బాగుపడేది కల్ల" అని గొణుక్కుంటూ వ్యధ పడుతున్నది.

భారతి తల్లి చేతులో పర్సు తీసుకుని డ్రాయర్లో చీరెల అడుగున దాచింది.

రాధమ్మ మంచంమీద కూచుని తనను వేధించే ఆలోచనలన్నింటిని ఏకరువు పెట్ట నారంభించింది.

"గేసైపోయి వారం ఐందా? స్టౌవులోకి కిర్సనాయిల్ లేదా? మీ నాయన డబ్బాడు కిర్సనాయిలు పంపిస్తానని అర్ధరాత్రైనా పత్తాలేడా? కాఫీ పొడిలేదు. నూనె బొత్తిగా లేదు. పోపుల్లెవ్వు. పేస్టులేదు. తెల్లారంగానే అన్ని గావాలాయా లేకుంటే చిందులు జాతర అరుపులు. నేనెన్నింటికని తలబాదుకు చచ్చేదీ చెప్పూ? "

ఉదయం పదిగంటలకు తిలక్ నిద్ర లేచాడు. పన్నెండింటికి లేచినా ఆయన్ని ఆక్షేపించేవారు ఆ యింట్లో లేరు. ఆయనెంత సర్వస్వతంత్రుడో, అంత దిక్కుమాలినవాడని గుర్తుచేయగల శక్తి ఆయన భార్య రాధమ్మకు ఒక్కత్తికే వుందని అతనికి తెల్సు.

రాధమ్మ ఆర్నెల్లకోసారి తుఫాన్‌లా చెలరేగి అతన్ని భీభత్సం చేసి, తిరిగి అతను మామూలు ప్రజానాయకుడి స్థితిలోకి కోలుకోటానికి, నెలా రెండు నెల్లు పట్టేట్లుగా విజృంభిస్తుంది.

దాదాపు తిలక్‌గారింట్లో తుఫాన్ వాతావరణం రెండు నెల్నుంచి వదలకుండా పట్టి వేధిస్తూనే వుంది.

పాపం తిలక్ అట్లాగే తలవొంచుకుని మైకంలో, యింటా బయటా శత్రువుల మధ్యా మిత్రులమధ్యా, అనుచరులతో, సహచరులతో, నెట్టుకొస్తూ తంటాలు పడుతున్నాడు.

తిలక్‌గారికి మహా ఆకలిగావుంది. సిల్కు లాల్చీ, యంయల్‌ఏ అంచు పంచె యిస్త్రీ చేస్తున్నది భారతి.

గడ్డం చేసుకుని స్నానం చేసి టవలు చుట్టుకుని, సిగరెట్ కాలుస్తూ కుర్చీలో కూచుని, తనకు దాపురించిన దుస్థితికి లోపల్లోపల కుమిలిపోతున్నాడు.

పరిస్థితులు క్రమక్రమేణా దిగజారిపోతున్నాయ్. ఉత్సాహం, ఊపు అందటంలేదు. యిల్లు పాముల పుట్టలా వుంది. కొడుకులు విషసర్పాల్లా ఉన్నారు. పెళ్ళాం ఓ కొండచిలువ. ఊరునిండా అప్పులు.

మళ్ళీ ఛైర్మెనైతేనే దశ తిరుగుతుంది. ఎన్నికలు రావాలి. కొత్త శక్తుల కోలాహలం మితిమీరుతున్నది. మిత్రులెవరో శత్రువులెవరో తేల్చుకోలేకపోతున్నా, ఆత్మవిశ్వాసం పోతున్నది. ఆలోచనలు కృంగతీస్తున్నాయి. మందు పుచ్చుకోపోతే మైండ్ పనిచేయదు. పుచ్చుకుంటే నా స్వాధీనంలో నేనుండలేకపోతున్నా అని పరితపిస్తూ కుములుతున్నాడు గడ్డివామిలాగా.

రేగిన తలతో అలసిన కళ్లతో, యిస్త్రీచేసిన పంచ, లాల్చి బనీను, డ్రాయిర్‌ని చాలా భద్రంగా రెండు చేతుల్లో పెట్టుకుని భారతి తండ్రిదగ్గరకొచ్చి, మౌనంగా నిర్లిప్తతతో చూసి వొళ్ళో పెట్టి వెళ్ళిపోయింది.

ఇసుక పర్రలాంటి తనకు సముద్రం లాంటి తల్లికి మధ్య నిల్చున్న చెట్టులాగా కూతురు కనిపిస్తుంటుంది.

కరిగిపోతున్న తన స్థితిని తల్చుకోటం మానేసి, దేశభక్తుడి వేషం తగిలించుకుని నిలువుటద్దంలో చూసుకుంటూ వుండగా, గేటుముందు అంబాసిడర్ కారాగింది.

తిలక్‌గారు తెగించి భార్యతో యింటి విషయాలు చర్చించాలనుకుంటుండగా కారు




వచ్చి ఆగింది.

ఇంట్లో పరిస్థితులు ఏ స్థితిలో వున్నవో బేరీజు వేసుకుందామనుకున్నాడు. పెద్దకొడుకు జీతం ఏ దశలో వున్నది? రెండవ పుత్రరత్నం కొంపకొచ్చి ఎన్ని నెలలయింది. దుక్ఖాలు పూర్తయినవా? అరుణ ఉత్తరం రాసిందా? నీ ఆరోగ్యం ఎట్లావుంది? జేబు ఖర్చుకో వంద విరాళం యివ్వగలవా?

అన్నీ ప్రశ్నలే. వొచ్చేవన్నీ ఎదురు సమాధానాలే. భారతిని పిల్చి "రాత్రి నా జేబులో పైకం అమ్మ తీసుంటుందిలే. వందిప్పించు కురా" అని డిమాండ్ చేశాడు.

భారతి తల్లి గదిలోకెళ్ళి, తండ్రి గదిలో కొచ్చి "తీయలేదుట నాన్నా" అని కోపంగా రుసరుసమంటూ చూసి కుర్చీలో కూచుంది.

"నీవు నాపార్టీనా? అమ్మపార్టీనా? "

"తాగుడుమానేసెయ్. నీ పార్టీలోకొస్తా"

"ఈవాల్టినుంచి మానేస్తాగా బుజ్జీ"

"రేపట్నుంచి నీ పార్టియేగా నాన్నా. ఈ వాళ రాను నీ పార్టీలోకి"

తిలక్ కూతురు తల నిమురుతూ, "మా తల్లికి, యం.యల్.ఏనిచ్చి పెళ్ళిచెయ్యాలి"

"పెళ్ళి చేసుకోనుగా. నేనే యం.యల్. ఏగా పోటిచేస్తా యామనుకున్నావో"

"నాకు తెల్సు... నీకన్నీ నా పోలికలే. దబ్బునెళ్ళి అమ్మనడిగి పంద పట్రా బుజ్జీ. కారొచ్చింది. ఎవరో పవర్‌ఫుల్ మనుషులొచ్చారు. వెళ్ళాలి."

"పవర్‌ఫుల్ ఫెలోకాదు. సినీమాహాల్ లోఫర్ రాజాగాడికార్లే అది. వాడు పెళ్ళాన్ని హత్యచేసి, స్టౌవ్ అంటుకోవటంవల్ల కాలి మరణించిందని లోకాన్ని మాయచేసిన రాక్షసుడు వాడు" అని తల్లి గదిలోకి వెళ్ళింది భారతి.

ఆ ఇంట్లో తిలక్‌గారి స్థానం దిగజారిపోయిందెప్పుడో, ఛైర్మెన్ పదవి చెయ్యిజారి ఎనిమిదేళ్ళయింది.

ఛైర్మెన్ పదవి సంపాదించటంకోసం, నిలుపుకోటంకోసం పిత్రార్జితం చాలా తగలేశాడు.

మున్సిపాలిటీల్లో స్పెషలాఫీసర్ల పెత్తనం వచ్చేసింది. వాళ్ళు రెండు చేతులా తెగ సంపాదించేస్తూ ట్రాన్స్‌ఫర్లైపోతున్నారు.

ప్రజానాయకులైన ఛైర్మెన్‌లు, పదవులు పోగొట్టుకుని, మళ్ళీ ఎన్నికలెప్పుడొస్తాయో? వస్తాయో! రావో. వస్తే పదవి దక్కుతుందో, దక్కదో అనే ఆందోళనకరమైన ఆలోచనల్లో పిచ్చెక్కి తిరుగుతున్నారు.

తిలక్‌గారికి కులం అండవుంది. కాని ఇంట్లో పలుకుబడి, పరపతి హారతి కర్పూరంలాగా హరించిపోయింది.

రాధమ్మ పేర ఆస్తి యింకా వున్నందువల్ల ఆమె భరాటా యింట్లో సాగుతున్నది.

తిలక్‌గారికి పదవిపోయి, తాగుడు అధికమై, శరీర ధారుఢ్యం సడలగానే, ఆస్తి, నోరుగల రాధమ్మ విజృంభించేసి, ఇంటి పెత్తనాన్ని గుప్పెట్లోకి లాక్కున్నది.

కూతురు తనకు ఎంతో కొంత సహకరిస్తూ ఇంట్లో దుమారం లేవకుండా కాచుకొస్తున్నందుకు తిలక్‌గార్కి కాస్త ఊరటగా వుంటుంది.

యిద్దరు కొడుకులు బోసుబాబు, శాంతారాం పదేళ్ళకిందటే సర్వస్వతంత్రాలు ప్రకటించేసి, అదుపుతప్పి తిరుగుతున్నారు. వాళ్ళకి పట్టపగ్గాలు లేవు.

ఛైర్మెన్ పదవిలో వెలిగిపోయే సమయంలోనే బోస్‌బాబుని కాలేజీ లెక్చరర్ ఉద్యోగంలో యిరికించాడు.

దూరపు బంధువుల పిల్ల అరుణనిచ్చి పెళ్ళిచేసి ఓ యింటివాడ్ని చేశాడు.

భార్యాభర్తలు మొదట్లో చిలకా గోరింకల్లా కిలకిలలాడుతూ యింట్లో కళకళలాడిం



చారు.

రానురానూ యిద్దరూ మారిపోయి, కొట్లాడుమంటూ మొండి, మూర్ఖపు పట్టుదలల్లో కూరుకుపోయారు.

బోస్ తాగుడు ఎక్కువైంది. అరుణపైన చెయ్యి చేసుకోవటం నేర్చుకున్నాడు.

పేకాట, క్లబ్ సంస్కృతి వంట పట్టించుకుని అర్ధరాత్రి దాటింతర్వాత ఇంటికొచ్చి, అరుణని చిత్రహింసలు పెడ్తూ, పురుషాహంకారాన్ని ప్రదర్శించేవాడు.

అరుణ మొదట్లో భరించింది. సహించింది. నిదానంగా తిరగబడ్డది. ఏకాకిగా బోస్‌ని ఎదిరించి వ్యక్తిత్వాన్ని నిలుపుకోటానికి తంటాలు పడేది.

ఐనా ప్రయోజనం శూన్యం.

కానీ ఛైర్మెన్‌గారింట్లో ఆడవాళ్ళలో ఓ మానసిక విప్లవం రగిలింది.

రాధమ్మ మొదట్లో సంపాదన పరుడైన పెద్దకొడుక్కు వత్తాసిచ్చి కోడలు పిల్లను ఆరడిపెట్టేది.

అప్పట్లో బియస్సి చదువుతున్న భారతికి, ఇంట్లో తారుమారైపోతున్న విలువల్ని, పరిస్థితులను ఆకళించుకోటానికి తలకుమించిన పనైంది.

తల్లితండ్రి లేని అరుణకు అన్యాయం జరుగుతున్నదని గ్రహించిందిగానీ, కుటుంబంలో లయతప్పిందని మాత్రం తెల్సుకోలేకపోయింది.

ఆమాటకొస్తే రాధమ్మ, భారతి పెద్దింటి మైనపు బొమ్మలేమీ కాదు.

కాస్తో కూస్తో రాజకీయ చైతన్యం గల కుటుంబంలో పుట్టి పెరిగింది రాధమ్మ.

ఖద్దరు చీరలు కట్టుకుని గాంధీటోపీలు పెట్టుకుని కల్లుపాకల దగ్గర పికెటింగులు చేసి "కల్లుమానండోయ్ బాబు, కళ్లు తెరవండోయ్ బాబు, ఇళ్లు వళ్లు గుల్లచేసే కల్లు మానండోయ్ బాబు" అంటూ పాటలు పాడే దేశభక్తుల కుటుంబంలో పుట్టిన ఆడపడుచు.

తన మెళ్లో తాళికట్టినవాడు, తన కడుపున పుట్టినవాడు తాగుమోతు సచ్చినోళ్ళై పోతున్నందుకు మానసికంగా కృంగిపోయింది.

వాళ్ళనాదుర్వ్యసనాల్లోంచి దారిమళ్ళించటం అలివిగాని పనైనందువల్ల నిర్లిప్తతతో కాలం గడిపెయ్యటం తప్ప మరేమీ చెయ్యలేకపోతున్నది.

కాని తను చెయ్యలేని సహసాన్ని భారతి, అరుణ చేసినందుకు కాస్త ఊరట చెందినా, పూర్తిగా హర్షించలేకపోతున్నది.

బోసన్నయ్య, అర్ధరాత్రి తాగొచ్చి అరుణని మానసికంగా, శారీరకంగా హింసించటం భారతి రానురానూ సహించలేకపోయింది.

అప్పటికే అరుణ తిరగబడటం ప్రారంభించింది.

రాధమ్మ కొడుకుని వెనకేసురావటం మానేసి ఉదాసీనంగా మంచంమీదే నిద్రకువెలై ఎటూ చెప్పలేక మౌనం వహించేది.

"నోర్మూయ్! నోరెత్తావా గొంతు పిసికేస్తా మాదచ్చత్‌ముండా" అనే కూతలూ, కేకలూ ఎక్కువౌతున్నాయ్. బోస్‌బాబు నోట్లోంచి బండబూతులు పేలుతున్నాయి.

అరుణ, భారతి బోసుతో మాట్లాడటం మానేశారు. బోసు ఇంకా రెచ్చిపోయేవాడు. అరుణని కొడుతుంటే, భారతి అడ్డం వెళ్ళింది. రెండోసారి వెళ్తే తోసేశాడు. మరోసారి వెళ్తే ఆ చేత్తోనే గూబ అదిరేట్టు అరుణతోపాటు భారతికి ముట్టచెప్పాడు. భారతి ఏడుస్తూ నోటికొచ్చినట్లు తిట్టి కసి తీర్చుకుంది.

ఆ సంఘటన జరిగిన తర్వాత అరుణ కూడా, నోటికొచ్చినట్లు తిట్టనారంభించింది.





బోసు తాత్కాలికంగా తగ్గిపోయాడు. ఈ మహిళామణులు తమ పోరాటచైతన్యాన్ని చూసుకుని కాస్త మురిసిపోయారు. రాధమ్మ కూడా కోడల్ని, కూతుర్ని మెచ్చుకుని కొడుకుని తల్చుకుని ఏడవలేక నవ్వి వూరుకుంది.

నెల మొదటివారమే ఆ ఇంట్లో గడ్డు కాలం. మిగిలినదినాలు చాలా మందకొడిగా గడిచిపోతాయి.

బోసుబాబు జీతం అందుకున్న వెంటనే బ్రాంది, విస్కీ సీసాలతో ఇల్లుచేరి తండ్రి గదిలోకి వలసపోయేవాడు.

తిలక్, కొడుకు పితృవాత్సల్యానికి తెగసంతోషించి, నిషానందంలో మైమర్చేవాడు. తండ్రి అండలో బోసు కైపులో తన్మయత్వం చెందేవాడు. ఇంట్లో ఆడవాళ్లని అలివికాని క్షోభలో ఊపిరాడకుండా చేస్తున్నామనే ధ్యాస మాత్రం వుండేది కాదా ఇద్దరికీ!

తాగిన మైకంలో నిద్రపోతున్న భర్త కొడుకుల జేబులను సవరించి మిగిలిన కరెన్సీని లాగేసుకొనే అధికారాన్ని రాధమ్మ రాబట్టుకుంది. ఇల్లు గడపాలికదామరి. నెల మొత్తం ఎట్లా గడుస్తుంది?

మాటా పలుకూ లేకుండానే, కళ్లల్లో తన భావాల్ని వెళ్ళడించి తిలక్‌ని, బోస్‌ని హడలెత్తించగల చాతుర్యం సంపాదించిందామె.

★ ★ ★

బోసు నిద్రలేచేప్పటికి భారతి, తండ్రితో సతమతమౌతున్నది. మొత్తానికి తల్లినుండి ఓ పాతిక రూపాయలు తండ్రికి ఇప్పించింది.

తిలక్‌గారు పార్టీవాళ్ళ కార్లో ఠీవిగా వెనక సీట్లో చేరబడి వెళ్ళిపోయాడు ప్రజాసేవకు.

మౌనంగా కాఫీ గ్లాసు తీసుకుని బోసుకిచ్చి వెళ్ళిపోయింది భారతి. తల్లి, తండ్రి గారాబంతో ఇది అహంకారం అతిశయం పెంచుకుని చెలరేగిపోతున్నదని బోసు భావన. తాగుమోతు పొగరుతో పచ్చని సంసారాన్ని బంజరుగా తయారు చేసుకుని, తీరికగా పశ్చాత్తాప పడుతున్నాడు చచ్చుదద్దమ్మ. కంచుకాగడాలా వెలగాల్సిన అన్న కొరివికట్టెలాగా పొగచూరిపోయాడు. వీడ్ని చూస్తుంటే వళ్లు మండుతున్నా, జాలి కలుగుతుంది అని అప్పుడప్పుడూ అనుకుంటుంది భారతి. బోసుతో అరుణ విషయం చొరవ తీసుకుని కదిపి, అతనిలో ఏమైన మార్పు వచ్చిందేమో తెలుసుకోవాలనే కుతూహలంతో భారతి అతనికి కాఫీ గ్లాస్ అందించింది. బోసుగ్లాస్ అందుకుంటూ గుర్రుగా చూసేటప్పటికి భారతికి వళ్లు మండింది. వంటింట్లోంచి తల్లి కేకవేస్తే వెళ్లి ఉడకేసిన కోడిగుడ్లు రెండింటిని ప్లేటులో పెట్టుకొచ్చి స్టూల్‌ని కాలితో జరిపి దాని మీద వుంచి వెళ్ళిపోయింది. ప్రాణం లేచొచ్చింది గుడ్లని చూడగానే బోసుకు. నిద్రలేవగానే నీరసం. ఇంటి పరిస్థితులు తల్చుకుంటే నిస్త్రాణ. తన స్థితిని గురించి ఆలోచిస్తే విషాదం కమ్ముకున్నాయి. మధ్యలో కూలిపోయిన వంతెనలాగా బోసు కూర్చుని గుడ్లని తింటూ ఇంగ్లీష్ పత్రికలో తలదూర్చాడు.

దాదాపు సంవత్సరం ఐంది అరుణ పుట్టింటికెళ్ళిపోయి. ఒక్క ఉత్తరం ముక్కన్నా రాయలేదు. ఆ వెళ్ళటం, రచ్చలు, కేకలు, గోల లేకుండా నిశ్శబ్దంగా నిదానంగా వెళ్ళిపోయింది. అదెలా జరిగిందంటే....

ఆరోజు అర్ధరాత్రి దాటినా తిలక్‌గారింటికి రాలేదు. ఇంట్లో అందరూ జీవశ్చవాల్లాగా మంచాలమీద వున్నారు. అర్ధరాత్రి దాటగానే బోసు మామూలు మల్లే మస్తుగా తాగి రిక్షాలోంచి దిగి తూలుతూ లేస్తూ ఇంటి తలుపును బాదేడు.

రాధమ్మ మాగన్ను నిద్రలోంచి లేవలేక బద్ధకించిపడుకుంది. వచ్చింది బోసని



తెల్సు. తిలక్‌గారైతే తలుపు తీసేదే. తను తిలక్ అనే మొగాడికి బానిస. బోసుకు అరుణ బానిస. ఆవిడే చూసుకోవాలి, అతని ఆలనా, అవసరాలూ అవస్థలూ అరుణ మంచి నిద్రలో వుంది. భారతికి నిద్రపట్టక అటు ఇటూ కొట్టుకుంటున్నదేగాని లేవ లేదు.

బోసు తలుపు బాదుతున్నాడు.

అర్ధరాత్రి తాగి వచ్చిన భర్తకు తలుపు తీయాల్సిన అరుణ లేవలేదు. వాళ్ళిద్దరికీ ఆర్నెల్లనుంచి మాటలు లేవు. కలిసి మంచాలమీద పడుకోవటం కూడా లేదు.

ఒకర్నొకరు భయంకరంగా చూసుకుంటారు.

అరుణ లేవలేదు. తిరుగుబాటు చేయటానికి మానసికంగా సిద్ధపడుతున్న ఆమె అర్ధరాత్రి తాగివచ్చిన భర్తకి తలుపు తీయదల్చుకోలేదు. తెగతెంపులకి సిద్ధంగా వుంది. భారతి, అరుణ ఆంతర్యాన్ని ఎప్పుడో గ్రహించేసింది. అరుణ మూడ్రోజుల నాడే తన చీరెలు పెట్టెలో సర్దుకుంది.

బోసు తలుపు మళ్ళీ మళ్ళీ బాదుతున్నాడు.

రాధమ్మకు అరుణ, భారతి పట్టుదలకూ మొండితనానికి పోతున్నారని తెల్సు. భారతిని బ్రతిమాలింది.

భారతి లేవలేక లేస్తూ ఆవలించి విసుక్కుంటూ లైటు వేసింది.

బోసు తిడ్తూ రంకేవేస్తూ తలుపు బాదుతున్నాడు.

ఈరాత్రి ఏం గోల చేస్తాడో. అనుకుంటూ మొండిధైర్యంతో భారతి తలుపు తీసి పక్కకు తొలిగింది.

"ఎంతసేపే, నీయమ్మ..."

"నేన్రా అన్నాయ్. ఎంత తాగితేమాత్రం ఈ బూతులేంట్రా. చెల్లిని తల్లిని అనే మాటల్రా భడ్వాస్"

"ఈ కొంపకు శనిముండా" అని చెంప పెట్టుపెట్టాడు. భారతి నేత్రాలు గిర్రున తిరిగాయి. మీది మీదికొచ్చే అన్నను ఓ తోపు తోసింది శక్తికొద్దీ. బోసు తూలికిందపడ్డాడు. నుదురు కుర్చీకి తగిలింది. లేచి మళ్ళీ భారతిని కచ్చగా బాదేశాడు. రాధమ్మ అడ్డం వచ్చింది. ఆమెను తిట్టి నెట్టేశాడు, భారతి జుట్టుపట్టుకున్నాడు. భారతి తిడుతూ కలియబడ్డది. తల్లి లేచి మళ్ళీ అడ్డం వెళ్లింది. అరుణ కూడా వచ్చి కలుగచేసుకుంది.

ఆ ముగ్గురు స్త్రీలూ చాలా ప్రయాసపడి బోసును గదిలోకి నెట్టుకెళ్లి ఈడ్చి పడేసి గది తలుపుకు గొళ్ళెంపెట్టి బతికిపోయారు.

గదిలో జంతువులాగా బోసుబాబు గాండ్రు పెడుతుంటే భారతి ఏడుస్తూ తిట్లు లంకించుకుంది.

భారతి తండ్రి ఇంటికొచ్చేదాకా ఏడుస్తూ, హట మేసుక్కూచుంది. తిలక్‌గారు అర్ధరాత్రి దాటింతర్వాత నిషాలో, రిక్షా దిగి తలుపులు తీసిన భార్యని కుర్చీలో జుట్టు విరబోసుకు కూర్చున్న గారాల పట్టిని చూసి గాబరాపడ్డాడు. మానభంగం, హత్య జరిగిన పోలీస్ ఠాణాలా ఇల్లు బావురుమంటుంటే, తిలక్‌గారి నిషా ఎగిరిపోయింది.

భారతి చాలా రౌద్రంగా తనకు జరిగిన పరాభవాన్ని మధ్య ఏడుస్తూ బోసును తండ్రిని కలిపి తిడుతూ, దేశంలో ఆడవాళ్లని క్షోభ పెట్టే మొగాళ్ళందరిమీదా దుమ్మెత్తిపోసింది. రాధమ్మ అడపా దడపా కూతుర్ని వత్తాసుగా ఈటెల్లాంటి మాటల్ని వదిలింది. అరుణ నిర్లిప్తంగా చూస్తూ నిలబడ్డది.

తిలక్ ఓపికగా అంతా విని, బోసు గది తలుపు దగ్గరకు తూలుతూ వచ్చి పెద్ద





కొడుకును బూతులు తిట్టి, చంపుతా. నరుకుతా, నరికిస్తా, పొడిపిస్తా, ముక్కలు చేయిస్తా, ఉద్యోగం పీకిస్తా అంటు ఎగిరి పెద్దరికాన్ని చాటుకుని, కాపాడుకున్నాడు.

బోసుబాబు కైపు వదిలిపోగానే ఇంటిపరిస్థితి తన అధమస్థితి, తన తండ్రి స్థితి కొద్ది కొద్దిగా తెల్సుకుని జంకి లోపల తలుపు బిగించుకుని మంచంమీద పడుకున్నాడు.

భారతి విజయగర్వంతో జుట్టు ముడిపెట్టుకుని తండ్రిని రెక్కపట్టుకుని గదిలోకి తీసికెళ్ళి మంచంమీద కూర్చోబెట్టి, పెద్ద గ్లాసునిండా మజ్జిగ తెచ్చి తాగించింది.

"ఇహ పడుకో నాన్నా మూడైంది" అని తిలక్ గదిలో లైటార్పి వచ్చేసింది.

"పాపం వాడిక్కూడా ఓ గ్లాసు మజ్జిగ ఇస్తే బావుణ్ణు" అని గొణిగి రాధమ్మ గ్లాసు నిండా మజ్జిగ పోసి బోసుగది దగ్గరకెళ్ళి, "బోసూ బాబూ! కాసింత మజ్జిగ తాగు. నాన్నా రెళ్ళిపడుకున్నాళ్లే. తలుపు తీయి" అంటూ బతిమాలింది. గడియతీసి గ్లాస్ అందుకున్నాడు బోసు. రాధమ్మ గట్టిగా నిట్టూర్చి తన గదిలోకెళ్ళి పడుకుంది.

"పెద్ద పెద్ద చదువులు చదివారెందుకు తగలెయ్యనా? కొంపను నరకంగా చేస్తున్నారు. కడుపుచేటు సంతానం. తాగుమోతులూ ఒకటే. తాగనోళ్లూ ఒకటే. నేను చస్తేగాని ఈ కొంప బాగుపడదు. శాంతమన్నమాట లేదు కొంపలో" అని బాధపడసాగింది.

"వాణ్ణి వేరే కాపరం ఎక్కడైనా ఏడ్చుకోమను. లేదూ తాగుళ్ళూ తందనాలూ మాన్పించు చూద్దాం" అని భారతి రెట్టించింది.

"నోర్మూసుకో. వాణ్ణి వెళ్లిపొమ్మంటానికి నీవెవత్తెవే. నీవే మరో ఇంట్లో కాపురం చేయాల్సినదానివి. వాణ్ణి వెళ్ళమనేంత దానవంటే? "

"ఐతే ఇట్లాగే బూతులు పాడించుకుంటూ, జుట్టుపట్టి యీడ్పించుకుంటూ బతుకెళ్ళమార్చమనా, నీ ఉద్దేశం? నాయనా తాగుతాడు. నిన్ను పల్లెత్తుమాట ఏనాడైనా అన్న పాపాన పోయాడా? నీ వంటిమీద దెబ్బేశాడా ఎప్పుడైనా? ఈ సచ్చినోడికి తేరగా పెళ్ళాం, చెల్లెలూ దొరికారా? "

"ఇహ నోర్మూసుకు పడుంటావా? లేదా"

రాధమ్మ, భారతి మాటామాట అనుకుంటుంటే అరుణ మౌనంగా వుండిపోయింది.

ఆమెలో రెండు విరుద్ధశక్తులు పెరిగి భయంకరంగా తలపడుతున్నాయి.

బోసు అమానుషవైఖరినుంచి తనకు విముక్తి కావాలి. బోసు ఇహ మారడు. మారాలనే స్పృహలేదు. ఈ బానిసత్వం నుంచి తను విముక్తి పొందాలి. వెళ్ళిపోవాలి. ఇక్కడనుంచి వెళ్ళిపోవాలి.

ఐదుగంటలు కావస్తున్నది. అరుణ లేచి మౌనంగా తలుపు తీసింది. భారతి రాధమ్మ కూడా లేచారు. అరుణ దిగులుగా చూసి కళ్లతో శలవు తీసుకుంది.

చల్లగాలి మసగ వెన్నెల! ఉషోదయం! అరుణ సూట్‌కేసు చేతపట్టుకుని వీధిలోకొచ్చేసింది.

భారతి, రాధమ్మ చూస్తూ నిలబడిపోయారు.

"అమ్మా! నేనెళ్లి బస్టాండుదాకా దిగపెట్టి రానా? "

"వెళ్ళిరావే, దాందేవుంది"

భారతి చెప్పులేసుకుని చకచక వీధిలోకి వచ్చి రిక్షా ఎక్కబోతున్న అరుణని కేకేసింది.

"రానా బస్టాండ్ దాకా" అంది.

"దా! కూర్చో" అని జరిగిచోటిచ్చింది అరుణ. దారిలో ఇద్దరూ మౌనం వహిం

చారు. భారతి అరుణను బస్సెక్కించి వీడ్కోలు చెప్పి ఇంటికి చేరింది.

బోసు నిద్రలేచేటప్పటికి తొమ్మిది దాటింది. భార్య వెళ్ళిపోయిన వైనం, కాఫీ తాగుతూ తల్లి ద్వారా తెల్సుకున్నాడు.

"ఏంపర్వాలే. పోతేపోనీ. నాకేం, నా వెంట్రుక వూడిందనుకుంటా" అనుకుని మనస్సుకి ఉత్తేజం కల్గించుకోటానికి వ్యర్థ ప్రయత్నాలు చేశాడు.

అతనిలో దురహంకారం, తాటి చెట్టు అంత ఎత్తులేచి క్రమక్రమంగా వొరిగి, నేల మీద భారంగా పడిపోయింది.

* * *

రాత్రి ఏడు గంటల సమయంలో మెయిన్ రోడ్డు మీద రెండువైపుల లారీలు విశ్రాంతిగా ఆగి వున్నాయి. అయినా వాహనాలు, జనం రాకపోకలతో, మెయిన్ రోడ్డు మహా రద్దీగా తయారై కిటకిటలాడిపోతున్నది.

పేవ్‌మెంట్ల మీద బడ్డీకొట్లు, తమతమ వ్యాపారాలను ఘరానాగా చేసుకుంటూనే ఉన్నా మాకోసమే పేవ్‌మెంట్లు కట్టించి పెట్టారన్నట్లుగా సొంతం చేసుకున్నారు. జనం పేవుమెంట్లను పార్కులుగా, హోటళ్ళుగా, బాతాకాని వేదికలుగా, కాలక్షేప కేంద్రాలుగా అలవాటుపడి పోయారు.

టౌన్లోవున్న పార్కులు ఎక్కడో ఊరికి చివర్న రిటైర్డు ఉద్యోగస్థుల్లాగా అఘోరిస్తుంటాయి. వాటిలో జనసంచారం ఉండదు. దిక్కుమాలిన కూడలిగా, రేడియో సణుగుళ్ళతో, మిణుకుమిణుకుమంటూ, కాలగతిని దిగులుగా తిలకిస్తూ వుంటాయి.

తమకు తెలియకుండానే జనం పేవ్‌మెంట్ల పాలైపోయి చాలాకాలమైంది. వాళ్ళు వాటిమీద నడవటం మానుకుని, బెదురుతూ రోడ్డుమీదే నడుస్తూ, వాటిమీద పాతుకపోయిన నానారకాల కంగాళీలకు తలవంచుకుని మరీ నడుస్తుంటారు.

ట్రాఫిక్ హెడ్ బింకాలు పలికినట్లుగానే ఏడుగంటలకు పది నిమిషాలముందే లారీ సెంటర్లో ఓ పెద్ద పోలీసు బృందం ప్రత్యక్షమై అదుపు తప్పిన ట్రాఫిక్‌ని చక్కదిద్దటానికి నడుం బిగించింది.

వాళ్ళు యింతకాలం, చూసీ చూడనట్లుగా మామూళ్ళ వేటలతో, ట్రాఫిక్‌ని వీలైనంతవరకే అదుపుచేస్తూ, చక్కదిద్దుకొస్తున్నా ట్రాఫిక్ రూల్సుని ఈ తెలివిమీరిన జనానికి నేర్పాలని శాయశక్తులా తంటాలు పడుతున్నారు. మామూళ్ళు వసూలు చేస్తూనూ పెద్దమనిషి తరహాగా వుంటున్నారు. జనాల్ని అప్పుడప్పుడు మాత్రం హడలుకొడుతుంటారు. అయితే ఎన్నివిధాలా తంటాలు పడ్డా రోడ్లు పేవ్‌మెంట్లు వెడల్పు చేసినా, ట్రాఫిక్ మాత్రం పద్మవ్యూహాన్ని గుర్తు చేస్తూనే వుంటుంది!

పోలీసులు వ్యానుల్లోంచి విజిల్సువేస్తూ లారీలు వూపుతూ జనంమీద కొచ్చేశారు. లారీల మీదికి బడ్డీకొట్లమీదకు, నాల్గు చక్రాల బళ్ళమీదకూ దూకారు. జనంలో కాస్త సంచలనం కలిగింది.

మున్సిపల్ లైట్ల కాంతి పోలీసులను చూపిస్తుంటే, రోడ్లమీద నిలబడ్డజనం కదిలారు. వాహనాలు కదలగలిగినవి. నిదానంగా కదలసాగేయి. జనం చెల్లాచెదరైనారు. పోలీసులు లారీలతో తోపుడు బళ్ళని రిక్షాలను ఫలహారపు బండ్లను, టీబళ్ళనూ, కొడుతూ, బాదుతూ తీసేయ్ మని అరుస్తూ హడలెత్తిస్తున్నారు.

చక్రాల బళ్ళు గత్యంతరంలేక కదిలి పక్క సందుల్లోకి పారిపోయాయి. పది నిమిషాల్లో మెయిన్ రోడ్ విశాలంగా, వెడల్పుగా, తను కోల్పోయిన సహజ స్థితితో ప్రత్యక్షమైంది. రోడ్డుమీద లారీలు మాత్రం కదలేదు. రౌడీల్లా నిలబడే వున్నాయ్. పోలీసు




వ్యాను పురోగమించింది. సర్కిల్ గారు కిందికి దిగి చేత్తో లారీలను చూపించాడు.

యస్సై విజిల్ వేస్తూ ఓ లారీని సమీపించి లాఠీతో తట్టేడు. పోలీసులు లారీల మీద దాడి ప్రారంభించారు. విజిల్సు వూదుతూ, హారన్లు మోగిస్తూ నానా హంగామా మొదలెట్టారు.

డ్రైవర్లు వున్న లారీలు బద్ధకంగా, పెద్ద చప్పుడు చేస్తూ కదిలాయి. డ్రైవర్లు లేని లారీలు సత్యాగ్రహం చేస్తున్నట్లుగా ఆగివున్నాయి. ట్రాఫిక్ యస్సై వాటి నెంబర్లు పుస్తకంలోకెక్కిస్తుండగా, బ్రోకర్ ఆఫీసు లోంచి గమనిస్తున్న కొందరు డ్రైవర్లు పరిగెత్తుకుని వచ్చి లారిలెక్కి వాటిని కదిలించారు.

యస్సై వాళ్ళని చెడమడా తిట్టి పోలీసు తడాఖా చూపించాడు. సి.ఐ. ఠీవిగా నడుస్తూ ముందుకొచ్చి రోడ్ మార్జిన్ దురాక్రమణలదగ్గర నిల్చి యస్సైకి వాటిని చూపించాడు. యస్సై బిగిలీ వూదాడు. పోలీసులు విజిల్సు వేస్తూ, లారీలు వూపుతూ వచ్చేశారు. యస్సై లాఠీతో లారీ బ్రోకరాఫీస్ముందు వేసిన బల్లమీద కొట్టేడు.

"తొందరగా తీసెయ్యాల తెల్సిందా" అని కేకలేశాడు.

రాఘవరావు చిరునవ్వు పలికిస్తూ చేతులు వెనక్కి కట్టుకుని యస్సై దగ్గర కొచ్చి నిలబడ్డాడు.

"మా యూనియనోళ్ళం సమావేశం వేసుకుంటాం. తేల్చుకుని తీసేస్తాం సార్"

జనం పోగైనారు చుట్టూతా.

"మీరు పోండోయ్. మీకేం పనిక్కడ. హూాం. పోండి" అని గదిమి జనాల్ని తరిమేశారు.

"నీ సంగతి చెప్పవాయ్ ముందు నాకు" కసిరేడు యస్సై.

"అదే సార్ మా యూనియన్...

యస్సై మధ్యలోనే మళ్ళీ కసిరేడు "మళ్ళీ యూనియనంటావ్. నీ సంగతి చెప్పు ముంగల నాకు"

రాఘవరావు యస్సైని లెక్కచేయకుండా సి.ఐ. దగ్గరకెళ్ళాడు. యస్సై గూడా వచ్చాడు.

"ఈయనే సార్ రాఘవరావు" యస్సై సి.ఐ.కి తెలియచేశాడు.

"ఏమిటి? " సి.ఐ. రాఘవరావుని అడిగాడు.

"మా యూనియనోళ్ళం సమావేశపై తేల్చుకుని తీసేస్తాం సార్"

"వారం పదిరోజుల్లో ఈ ఆక్రమణల్ని ఖాళీ చేస్తానంటారా? లేదా చెప్పు" సి.ఐ. మృదువుగా నిదానంగా అన్నాడు.

రాఘవరావు యిరకాటంలో పడ్డాడు. "అదే సార్ మా యూనియన్...

సి.ఐ. నవ్వి "మీ యూనియన్ ఖాళీ చెయ్యవద్దని నిర్ణయిస్తుందనే ధీమాతో సాగి పోదామనుకుంటున్నావా. అదేం లాభం లేదు.

అన్ని టౌన్సుల్లో రోడ్లని విశాలం చేసి వాహనాలకు, జనానికి ట్రాఫిక్ బాధలు తొలగించాలనే గవర్నమెంటు ప్లాను. తొందరగా ఆక్రమణల్ని తీసెయ్యండి. మీ యూనియన్ మీటింగ్ పెట్టి టౌన్ చివర్న యెక్కడైనా ఆటోనగర్‌కోసం ట్రయ్ చేసుకొండి. బావుంటుంది. అంతేగాని రోడ్స్‌ని దురాక్రమణ పాల్చేసి, ట్రాఫిక్ రూల్సుని నిర్లక్ష్యం చేస్తే ఎట్లా. వారంలోగా దురాక్రమణలు తొలగించకపోతే కఠిన చర్యలు తీసుకొంటాం"

"అట్నేసార్. ఆటోనగర్ కోసం ప్రయత్నిస్తామ్‌సార్. తవరు మంచి సలహా యిచ్చార్ సార్" చేతులు నలుపుకుంటూ

నక్క వినయాలు ప్రదర్శించి రాఘవరావు, ఏదో జ్ఞాపకం వచ్చినట్లు చకచకా రోడ్ మార్జిన్ మీద వున్న కూల్ డ్రింక్ షాపులోకి జొరపడి కూల్ డ్రింక్ బాటిల్సు తీసుకుని సి.ఐ. గార్కి, ముగ్గురు యస్సైలకు అందించాడు.

సి.ఐ చిరునవ్వుతో తీసుకోగానే యస్సైలు అందుకున్నారు. పోలీసులు చాటున నిలబడి షోడాలు త్రాగి తేన్చారు. తర్వాత అందరూ వ్యాను ఎక్కి కూర్చున్నారు.

రోడ్డుమీద జనం విడ్డూరంగా చూస్తుండగా వ్యాన్ మెయిన్‌రోడ్‌మీద నిదానంగా పోయి, మరో సెంటర్లో, ఆగి జనానికి ట్రాఫిక్ రూల్సు నేర్పటానికి పూనుకున్నది.

రాఘవరావు చుట్టూ డ్రైవర్లు, క్లీనర్లు, బ్రోకర్లు పోగైనారు. అతను ఉత్సాహంగా కోతలు మొదలుపెట్టాడు.

"యస్సై పెద్దప్రోడు. కానీ సి.ఐ. నైస్ జంటిల్‌మన్. రిక్షావోడ్ని గూడా తూస్కారంగా తిట్టడు. బ్రోతల్ కంపెనీమీద రయిడింగ్ కెళ్ళినా, ఆళ్ళని లంజల్లారా, ముండల్లారా అని నోరు పారేసుకోడు. హైలెవలోళ్ళు, ఆ లెవల్లోనే ఆలోచిస్తారబ్బాయ్. కింద నా కొడుకులు తోనే చిక్కుల్లు"

"ఇంతకీ వీళ్ళ జాతరెందుకయ్యా... బీటు మామూళ్ళిస్తుంటిమి. దసరా మామూళ్ళిస్తుంటిమి. లారీలని కార్లని, ఫ్రీగా సప్లై చేస్తుంటిమి. యీ పోలీసు జులుం పెరుగుతుందేగాని తగ్గటంలేదే? " ఓ ముసలి డ్రైవర్ కోపంగా అన్నాడు.

"రోడ్లని వెడల్పు చేస్తారంట. మున్సిపాలిటీ వోళ్ళూ పోలీసోళ్ళూ కూడబలుక్కుని. ట్రాఫిక్‌ని చక్కదిద్దుకొస్తుండారు. మనల్ని మర్యాదగా యిక్కడ్నించి తప్పుకోమన్నా





రోయ్"

"ఆ యిట్టాంటి యస్సైల్ని సి.ఐ.ల్ను ఎందర్ను చూళ్ళేదు. మన యూనియనోళ్ళు రేపెళ్ళి సెటిల్ చేసుకురండి"

"మన ప్రెసిడెంటూ, సెక్రెట్రీలు మేడలు దిగటంలేదయ్యా. సూడండి మేడమీద నిల బడ్డారేగానీ ఒక్కడు రోడ్డుమీదకొచ్చి సి.ఐ.తో మాట్లాడినోడు లేడు. మనవే, కాళ్ళవేళ్ళపడి సి.ఐ.ని బ్రతిమాలుకొని గులాం చేసి, చేతులు కట్టుకుని నిలబడ్డాం. నాకేం పట్టింది. నాలారీ తీసికెళ్ళి కాలవకట్ట మీద ఆపుకుంటా" అని రోషంగా ఎగిరాడు రాఘవరావు.

"వాళ్ళకేం ఒక్కొక్కరూ అరడజను లారీలు బస్‌లు, టాక్సీల వోనర్లు, వాళ్ళ క్కొంచం నొప్పి తగిల్తే, మూడు నిమిషాల్లో సి.ఐ.ని యస్పీని ట్రాన్స్‌ఫర్ చేయించ గల్రు. ఆ ధీమాతోనే మేడ దిగటంలేదు" అన్నాడో బ్రోకర్.

"మనం సన్న రకం వోనర్లం రెండొందల మందిదాకా వున్నాం. మన చేతికింద 50 లారీలు, 25 టాక్సీలున్నాయి. మనం అన్ని రకాల టాక్సులు కట్తున్నాం. మన బళ్ళని రోడ్లమీనే ఆపుతుండాం. పోలీసోళ్ళతో బూతులు తింటా మనమెందుకట్టా దిక్కు దివాణంలేకుండా దొబ్బులు తింటా పడుం డాలి. మనం ప్రభుత్వంతో ఫైట్ సేసి, ఆటోనగరంను ఎందుకు ఏర్పాటు చేసుకో కూడదంట? ఆలోచించండి" అన్నాడు రాఘవరావు.

"ఆలోచన గొప్పదేరా రాఘవా బాగానే వుందయ్యా. పూనుకొని చెయ్యండి"

"సి.ఐ.గారు ఆ మాటే అన్నాడండి. పెద్ద పెద్దోళ్ళని పట్టి, సాదించుకోవాల అంత తేలిగ్గా జరిగే పని కాదు అంతా కల్సిరా వాలి"

"కదలెయ్యిముందు"

"అయ్యా రాఘవయ్యా మన సెకరెట్రి గారు, పెసిడెంటుగారు. 'అంకినీడుగారి మేడమీదున్నారు. నిన్ను పిల్చుకురమ్మన్నా రండి"

"యింకెవరెవరున్నారయ్యా"

"రెడ్డిగారున్నారు, తిలక్ గారున్నారు, పట్టయ్య గారున్నారు, నీవొక్కడవే తక్కువైనావురా. తొందరగా. నే ఎల్తుండా" అని కబురుతెచ్చిన వ్యక్తి వెళ్ళిపోయాడు.

"అదండి సంగతి, ఎళ్తా. పిలవంగానే ఎళ్ళకపోతే ఆళ్ళకి కోపం వస్తుంది" అని రాఘవరావు కదిలాడు.



కాంగ్రెస్ పార్టీ అద్భుతాల తర్వాత అద్భుతాలు, అద్భుతాలమీద అత్యద్భుతాలు చేస్తూ ఆఖరన ఏకంగా సోషలిజం తెస్తుందని నమ్మిన ప్రజాసేవకుల్లో అంకినీడుగారు ఒకరు.

చాలామంది శత్రువులు అతన్ని వెనక ముఖం వాడని యెద్దేవా చేస్తే చేయెచ్చుగానీ ఆప్త మిత్రులు అతనికి మూడు నాలుగు మొహాలు వున్నట్టు చాలా నమ్మకంగా రహస్యంగా అంటుంటారు. అది తేలిగ్గా కొట్టిపారెయ్యాల్సినసంగతేం కాదు.

అంకినీడుగారు బోసినోరేసుకుని తొస్సి మాటలు మాట్లాడుతూ, చుట్ట తాగుతూ మోరెత్తుకుని ఆలోచిస్తూ, "హోటల్ ఆంధ్రా'లో కూచుని బికారోడిలాగా చినిగిపోయిన, గుండీలు గూడాలేని ఖద్దరు లాల్చీలో బక్కపల్చగా కనిపించవచ్చు గాక. ఆ పది లక్షల ఖరీదు చేసే భవంతి ఓనర్ ఆయనగారే అని చాలా మందికి తెలీదు.

ఆయన పెద్దపెద్ద కాంట్రాక్టర్లకే వేలకు వేలు వడ్డీలకిచ్చి, గోళ్లూడకొట్టి వసూలు చేయగల చాకచక్యం గలవాడంటే ఆశ్చర్యపోనక్కర్లేదు.

ఆంధ్రప్రదేశ్ లో పుట్టి పెరిగి విర్రవీగి వంగిపోయిన రాజకీయ పార్టీలన్నింట్లో ఆయన పాతకాపే. భూసంస్కరణలు చాలామంది భూస్వాముల పునాదుల్ని కదిలించలేకపోయాయనే చేదు సత్యం, మనం అంకినీడుగారిలాంటి వారి భూఖండాల్ని చూసి గ్రహించుకోవచ్చు సమాజంలో ఎన్ని దశలు మారుతున్నా అన్ని దశల తాలూకు అవశేషాలూ ఈయనలో చూడవచ్చు అంటారు గిట్టనోళ్ళు.

అట్లాంటి అంకినీడుగారు రాత్రి మామూలుగా పేకాటాడి, తాగి తూలి అలిసి, సొలసి మంచమెక్కేప్పటికి పన్నెండో వొంటిగంటో అవుతుంది.

కానీ, ఈ సాయంకాలం హోటలు ముందు రోడ్డుమీద పోలీసుల దూకుడు చూస్తూ అంకినీడుగారికి కాస్త కోపం వచ్చేసింది.

ఆయనకు కోపం వస్తున్న సమయంలోనే లారీ యజమాన్ల అసోసియేషన్ గౌరవ ప్రెసిడెంటు, మాజీ ఛైర్మెన్ తిలక్ గారు, సెకరెట్రీ రాజారెడ్డి, యింకో అరడజను లారీ ఓనర్లూ హోటల్లోకి జొరబడ్డారు. చూస్తూనే వున్నారు. మరో పావుగంటదాకా పోలీసులు మెయిన్ రోడ్ మీద పెత్తనం చెలాయించారు. పోతూ పోతూ హోటళ్ళముందు




నిలబెట్టిన సైకిళ్ళని లారీలో వేసుకెళ్ళిపో యారు.

అంకినీడుగారికింకా కోపం పేట్రేగి పోయింది.

పోదామరి! తారు మారైన రాజకీయాల వల్ల, అంకినీడుగారు నీళ్ళలోంచి బయటపడ్డ మొసలిలా వున్నాడుగానీ మునుపు హోటల్లో కూచునే ఫోన్లో మాట్లాడి తనకెదు రైన చిక్కుల్ను విప్పుకునేవాడు.

"మన యంయల్.ఏ. నీచుట్టవేగా? " అన్నాడు అంకినీడు.

అంకినీడు ఆలోచన పసికట్టేడు తిలక్.

"నాకంటే గూడా మన మల్లేశ్వర్రావుకింకా దగ్గర చుట్టం మన యం.యల్.ఏగారు."

"ఎట్టాంట? "

"మల్లేశ్వర్రావు పెద్దకొడుకూ, యం.య ల్.ఏ యిద్దరూ సయాన షడ్డకులేనండి. మల్లయ్యని పట్టుకుని ఈ సి.ఐ.ని యిక్క డ్నించి పంపించటమో, లేకపోతే కళ్ళేలు వేయించటమో చెయ్యాలి."

"ఆ పని తొందరగా చేపించి పుణ్యంక ట్టుకో, వూరు పిస్టేజి కాపాడూ"

"అదెంతసేపండీ. మనం మల్లేశ్వర్రావుని కల్సి మాట్లాడదాం. ఆయనే చూసుకుం టాడు. ఏవరికోసం చూడడూ? ఆయన తాలూకు లారీలు నాల్గున్నాయ్. అవన్నీ మన బ్రోకర్ ఆఫీసులముందు ఆగే వుంటాయ్. బాడిగలుకు తిరుగుతా వుంటాయి. మరి ఆయన కాస్త పట్టుపట్టక పోతే ఎట్లాంట" అని నిష్టూరమాడేడు రాజా రెడ్డి.

"వాళ్ళకేమండీ. అన్ని రకాలా బల్సివు న్నారు. మన చికాకులే వారికి లేవు. కొడు కులెక్కొచ్చారు. గొప్ప జాతకుడండి. వొట్రుడియంగా అన్నీ అమురుత్తుండాయ్. చిన్నప్పట్నుంచీ రాజకీయాల్లో తంటాలు పడ్డ నాబోటిగాడికి చిప్ప చేతికొచ్చింది"

"సాల్లే. నీ బీదరుపులు. ఛైర్మెనుగా రెండు టరములు ఏలేవ్. సెద్దోడ్ని కాలేజి లెక్చరర్ని చేశావు. నీవు జాతకుడవే" అన్నాడు రాజారెడ్డి.

"ఎప్పుడెల్దాం మల్లయ్యకాడికి? " అంకినీడు ఆదుర్దాగా అడిగాడు.

"నేను రెడినే. రెడ్డిగారి కార్లో రేపే ఎల్దాం"

"యిందాకా సి.ఐ.తో రాఘవుడేదో మాట్లాడుతున్నాడు. గుంపు నేసుకుని వాడి ప్లానేందో తెల్సుకుందామా? " అన్నాడు రెడ్డి గారు.

"ఆ లేబర్ నాయల్తో మనకెందుకండి. వాడు నాకు తెల్సినప్పట్నుంచి పోలీసోళ్ళ గులామ్. వాడి లెవల్ను మనం పెంచినట్ట వుద్ది. మనతో తిప్పుతుంటే"

"మనతో రానీయం. సి.ఐ.తో ఏం మాట్లాడాడో తెల్సుకుందామనే, అంతే"

"అయితే పిలవండి వాడ్ని"

పావుగంట తర్వాత అక్కడికి రాఘవరావు వచ్చాడు.

"ఆ సి.ఐ. ఏమంటాడోయి రాఘవా? " అడిగాడు తిలక్.

"వారం లోపల బోకరాఫీసు తీసెయ్యక పోతే కఠిన చర్యలు తీసుకుంటానన్నాడు. నేనేమో మా యూనియనోళ్ళంతా సమా వేశం చేసుకుని ఒకమాటమీద పోతామన్నా నండి రెడ్డిగారు"

"అంతేనా? "

"సి.ఐ.గారన్నాడండీ ఎక్కడైనా ఆటోన గర్ ఏర్పాటు చేసుకోండోయ్. మీ యూని యనోళ్ళు పట్టుబడితే ఐపోద్ది అన్నాడండి"

"ఆటోనగర్ ఏర్పాటా? " హేళనగా నవ్వి అంకినీడుగారు "మనవల్ల అయ్యే పని

కాదులే రాఘవయ్యా. ప్రభుత్వమే బస్సు స్టాండు, సూపర్‌బజార్లు ఏర్పాటు చేసినట్లు చెయ్యాల్సిందేగాని నీవల్లా నావల్ల అవుద్దా. నీపిచ్చిగాని"

"ఐతే ఏం చేద్దామంటారు? " రాఘవరావు కోపంగా అడిగేప్పటికి, అంకినీడు నీవేం చేద్దామనుకుంటున్నావ్ చెప్పు" అన్నాడు.

"నా కొట్టు ఆడనించి తీసేసి నా బ్రోకరా ఫీసు అద్దెకెక్కడన్నా చూసుకుంటా. మొన్నొచ్చి కమీషనర్‌గారు వార్నింగ్ ఇచ్చి పోయాడు. ఇప్పుడు సి.ఐ.గారు వచ్చి చెప్పే శాడు. ఆళ్ళని ఎదరించేకెపాసిటి నాకాడ లేదు బాబూ"

అంతా మవునంగా వుండిపోయారు.

"మన యూనియను లీడర్లు తప్పుకు తిర గటంలో రుస్తుంలు. మీరు సి.ఐ.ని ఎదురు గుండా నిల్చొని మాట్లాట్టానికి రాకపో తుంట్రి. పెద్దోళ్ళతో సి.ఐ. మాట్లాడి వుంటే పరిష్కారం తెలకపోద్దా. ఆటోనగర్ ఏర్పడి తేనే మంచిదండీ అంకినీడుగారూ. ఎప్పటి కైనా అదే సరైన మార్గం"

"నీ పాయింటు నేను ఒప్పుకుంటాన్రా రాఘవా. పదేళ్ళకిందటే నేను ఛైర్మెన్‌గా వున్నప్పుడే, రోడ్లమీద లారీల బెడద గురించి మా కౌన్సిల్‌లో తీర్మానం చేశాం! టౌనుకి మైలు దూరంలో ఐదెకరాల స్థలం సేకరించాలనుకున్నాం. తర్వాత స్పెషలాఫీ సర్ల పరిపాలనొచ్చింది. టౌన్లో ఆక్రమణలు అడ్డదిడ్డాలుగా తయారైనాయి. జనం రద్దీ విపరీతమైంది. లారీలు, టాక్సీలు, రిక్షాలు తెగ పెరిగాయి. అందరికీ యిబ్బందులు పెరిగిపోతున్నాయి. లారీ యాక్సిడెంట్లు ఎక్కువైనాయి. మొన్న సాయంత్రం లారీ కింద ఉత్తపుణ్యానికి పడిచచ్చిపోయిందా ముసలమ్మ. ఏం చేస్తాం. అన్నీ అదుపుత ప్పుతున్నాయి మరి"

రాజారెడ్డి సినిమాహాలు వోనరు. పైగా అరడజను టాక్సీల యజమాని. తిలక్‌గారి ముఖ్యుడు.

పది లారీల యజమాని, మున్సిపల్ కంట్రాక్టరైన పట్టయ్యవంక చూసి "మీ లారీలోళ్ళు, మెయిన్‌రోడ్ పక్క సందుల్లో లారీలాపి, ఆడే కడుగుళ్ళు రిపేర్లు! జనం సంగతి, ట్రాఫిక్ సంగతి పట్టించుకోరు గదా. మా సినిమా హాలుకొచ్చేపోయే జన మెంత ఇబ్బందులు పడుతున్నారో గదా" అన్నాడు.

"నిజమే మరి. ఏం చేస్తాం. అంద రంరోడ్లని బాగా వాడుకోటం మరిగాం. ట్రాఫిక్కు ఆగిపోతున్నది. పోలీసులు అదుపు చెయ్యలేక చస్తున్నారు. మన దగ్గర మామూళ్లు వసూళ్ళు, మళ్ళీ మనమీద కేసులూ, దాష్టీకం! అన్నీ తప్పనిసరౌతు న్నాయి. మన తిలక్ అన్నట్లు అన్నీ అదు పుతప్పుతున్నాయి మరి" అని ముసిముసి నవ్వులు వొలకపోశాడు రాజారెడ్డి.

'వీళ్ళు పామునీ చంపలేరు, కర్రనీ విరగ నియ్యరు అనుకుంటూ రాఘవరావు లేచి "మీకు చెప్పేంతవోణ్ణి గాను ప్రెసిడెంటు గారూ! నా మనవేందంటే ఆటోనగర్ మా టౌనుకు చాలా అవసరమని కలెక్టర్‌కి యం.యల్.ఏకి ముఖ్యమంత్రికి వినతి పత్రాలు యిచ్చే పనికి పూనుకోండి. నలు గురం టౌన్లో తిరిగి లారీలోళ్ళకి సంబంధిం చిన, అన్ని రకాలోళ్ళ దగ్గరా సంతకాలు పెట్టిద్దాం. ఆట్ని పైకి పంపిద్దాం. కాకపోద్దా అంట. తప్పక సాధిస్తాం" అన్నాడు ఆవే శంగా.

"అయితే ఆ పని మీదే తిరుగు. నేనూ హెల్పుచేస్తా" అన్నాడు రాజారెడ్డి.

"అయితే వస్తానండి" అని మేడ దిగి వెళ్ళిపోయాడు రాఘవరావు.

"ఎప్పుడెల్దావంట మీ మల్లయ్య కాడికి? " ఆదుర్దాతో అడిగాడు అంకినీడు తిలక్‌ని చూస్తూ.





"రాజారెడ్డి కార్లో రేపే వెళ్దామన్నానుగా" అన్నాడు తిలక్.

సి.ఐ.ని వారంరోజుల్లో యీ టౌనునుంచి ట్రాన్స్‌ఫర్ చేయించాలని పెత్తందార్లు నిర్ణయించుకున్నారు.

★ ★ ★

కొత్త ఎర్రమట్టి రోడ్డుమీద కార్లు చాలా యిబ్బందిగా పోతున్నాయి. లోపల ప్రజాసేవకులు అమిత అసౌకర్యంగా కూర్చున్నారు.

మారుమూల పల్లెలో మల్లయ్య మకాంపెట్టి, బస్తీకి దూరంగా బతకగల్గుతున్నందుకు తిలక్‌కు చాలా అశ్చర్యంవేసింది. తిలక్ తండ్రి యాభైఏళ్ళనాడే యీ గరువు ప్రాంతం వొదిలి బస్తికి ఎగబడ్డాడు.

బంగారు రంగు ఇసుక భూముల్ని, లేత వేర్సెనగ పంట చేలు పచ్చగా ఆవరించి గట్ల చుట్టూ తాటిచెట్లు, ఎండ, గాలిదుమ్ముని ఓపికగా సహిస్తూ ఎదుగుతున్నాయి. మైలుకో తాటాకు పాలేన్ని దాటిపోతున్నది కారు పల్లెల్లో జనం బీదగా మందకొడిగా, యీదురోమంటూ కనిపిస్తున్నారు. తమ యాతనల మారి బతుకులోంచి కారు నోక్షణం చూసి, తల వంచుకెళ్ళిపోతున్నారు.

తిలక్ చాలా నిరుత్సాహంగా వున్నాడు. సిగరెట్ వెలిగించి మందకొడిగా దీర్ఘాలోచనలోపడ్డాడు.

యాభైనలభైయేళ్ళనాడు యీ గరువు గ్రామాలెట్లా వుండేవో ఊహించలేకపోతున్నాడు. ఎర్రమట్టి రోడ్డు, కాలవలు, కరెంటు వచ్చినా గూడా జనం నిస్తేజంగా ఎదుగుబొదుగులేకుండా బతుకుల్ని యీడుస్తున్నారు వీళ్ళు గూడా తాటిచెట్లనే ఆదర్శంగా పెట్టుకుని ఎండ వాన గాలి దుమ్ము ఓపిగ్గా భరిస్తూ నిదానంగా పెరుగుతున్నట్లున్నారు. తుపాన్ తాకిడికి తాటిచెట్లు కూలిపోయినట్లుగా వీరు కలరా, మసూచి రోగాలకు రాలిపోతారు.

తాటి ఆకుల్ని కొట్టి, మండెతొక్కించి మోపులు కట్టి, బళ్లకెత్తి అమ్ముతున్నట్లుగా, యీ మూగజనానికి, వ్యవసాయ ఖర్చులకు అప్పులిచ్చి, వాళ్ళు పండించిన ఎర్సెనగకాయని, తక్కువ రేటుకే కళ్ళంలోనే కొనేసి, బస్తాలకెక్కించి, లారీలమీద తమ ఇళ్లకి చేరవేసుకుంటారు షావుకార్లు. తాటిచెట్లకి, కల్లుకుండలు కట్టినట్లుగా వీళ్లకి వడ్డీ వ్యాపారస్థులు, మదుపులిచ్చి, కల్లుకుండల్ని పూడ్చినట్లు వీళ్ళలోని జీవరసాన్ని పిండేస్తారు. వీళ్ళపొలాల్ని తాకట్లులో బిగించేసి, కొండచిలవల్లా మింగేస్తారు. వీళ్ళు పీడల్ని, పీడల్ని భరిస్తూ ఎండిపోతూ, వడిలిపోతూ, వున్న చేరెడు భూమిని నిలుపుకోలేక కటకటలాడుతుంటారు.

మాజీ ఛైర్మెన్ తిలక్‌కు ఈ ప్రాంతంలో పదెకరాల పొలం వుండేది. పదిహేనేళ్ళ క్రితం ఛైర్మన్ పదవికోసం అమ్ముకున్నాడు. ఎకరం వెయ్యి రూపాయలకు తెగనమ్ముకుని పదవి సంపాదించుకున్నాడు.

ఇప్పుడా పొలంపోయే, పదవీపోయె వాటి తాలుకు జ్ఞాపకాలు విషాదంగా విసిగిస్తున్నాయి. అందుకనే మందకొడిగా నిరుత్సాహంగా కూర్చుండిపోయాడు.

"ఎవడ్రా! ఈ రోడ్డేసిన్నాకొడుకూ? ఎన్నివేలు మింగేశాడో. రోడ్డుమీద ఎర్రమట్టి గూడా సరిగా పోయించలేదు కదరా? " అని డ్రైవ్ చేస్తున్న రాజారెడ్డి బూతులు లంకించుకున్నాడు.

"అప్పుడే ఐందట్రా! మళ్ళీ దీనిమీద కంకర్రోడ్డు, ఆపైన తార్రోడ్డు ఏసి, యింకెంత మంది యింకెన్ని వేలు కాజెయ్యాలో! ఎంత మంది ఈ భూమిని నమ్ముకుని బతకాలో కదా" అన్నాడు అనుభవజ్ఞుడైన అంకినీడు గారు.

"అప్పుడు ఈ రోడ్డుమీద పల్లెపల్లెకి

తిరిగే బస్సు తిరుగుద్ధి" అని పెళ్ళున నవ్వే శాడు రెడ్డిగారు.

లేత కొబ్బరితోట ముందు ట్రాక్టర్లు మూడు నిలిపి ఉన్నాయి.

లారీల సంఘం వారి కారు, ఆ ట్రాక్టర్ల వెనక ఆగింది. కార్లోంచి ప్రజాసేవకులు దిగి, పంచలు ఎగపట్టుకుని తోటలోకి వెళ్ళారు.

మల్లేశ్వరరావు పాకలో పడకకుర్చీలో కూర్చుని, చుట్టూ కూలీలను కూర్చోపెట్టు కుని కూలి బట్వాడా చేయిస్తున్నాడు. వీళ్ళని చూసి, చలించలేదు. ఒక్కమారు కన్నెత్తి చూసి డబ్బు పంపకంలోకి తల దించాడు. మళ్ళీ తలెత్తి వాళ్లని చూసి, మెడ తిప్పి, "చిన్నబ్బాయ్ ఆళ్ల సంగతి సూసుకో. చేతిలో పని కాంగానే నేనొస్తా" అనేసి డబ్బు పంపకం మీదకు చూపు మరల్చాడు.

లారీల సంఘం వారు కొంచెం గాయపడ్డ హృదయాలు కలుక్కుమని కలత చెందు తుండగా, చిన్నబ్బాయ్ వాళ్ళని పక్కకు తీసి కెళ్ళి కుర్చీలు చూపించాడు.

కొత్త పేం కుర్చీలు, గుండ్రటి మేజాబల్ల చుట్టూవున్నాయి. చిన్నబ్బాయి, తిలక్‌గారికి బాగా పరిచయమే. తిలక్‌గారికి బోసుబాబు ఎట్లా ఎడంభుజమో, చిన్నబ్బాయి వాళ్ళ బాబుకు అట్లా. అతను పాతికేళ్ళ కొరమీనం కోడెగాడు. లారీల సంఘంవాళ్ళ మొహాలు చూసి వాళ్ల కథాకమామీషు గ్రహించిన చిన్నబ్బాయ్, వాళ్ళందరూ కుర్చీలో కూర్చున్న మరో నిమిషంలోనే బీరు సీసాలు తెచ్చి బల్లమీద వుంచాడు. పొడుగాటి గ్లాసు లను సీసాల పక్కన పెట్టేసి ముసిముసి నవ్వులు వొలికించాడు.

"యివ్వేంటోయ్! మీనాన్నతో రాజకీ యాలు ముచ్చటిద్దామని వస్తే..." అని తిల క్‌గారు లొట్టలేశాడు.

"దీనిదేవుంది తిలక్‌గారూ, మాకు మామూలేగా" అని కుర్రాడనగానే బీరు గ్లాసుల్లో పోసుకుని తాగుతూ ప్రయాణ బడలిక తీర్చుకోసాగేరు. చిన్నబ్బాయి వీళ్లని బీరుసీసాలకు ఒప్పగించేసి అక్కడ్నించి తప్పుకున్నాడు.

వాళ్ళగాయపడ్డ హృదయం తమకు జరి గిన కనీస మర్యాదలకు సంతృప్తిపడి ఉల్లా సంగా వూగనారంభించింది.

అంకినీడుగారు విపరీతంగా డబ్బు సంపా దించే అవకాశాలను, ఆ అవకాశాలను విని యోగించుకునే వ్యక్తులను చాలా తొందరగా తేలిగ్గా, గుర్తించగలడు.

పదేళ్ళకిందటే తన దగ్గరకు అప్పుకోసం వచ్చిన మల్లయ్యను అతని కార్యదీక్షను పసికట్టే అతను పదివేలు అప్పు అడగంగానే ఐదురూపాయల వడ్డీరేటు కాడికి యిచ్చే శాడు. ఆ మల్లయ్య ఆర్నెల్లలోపునే తిరిగి వడ్డీతోసహా ఎడంచేత్తో పారేశాడు. పదేళ్లల్లో మల్లయ్య ఈ మూల పారెస్టు ఏరియాలో దూరి కుడియడమ చేతుల్తో విపరీతంగా సంపాదన ప్రారంభించి చేతులారా ధనాన్ని పోగేసి బస్తాల్లో ఎక్కి తొక్కిసగా పోగుచేసు కున్నాడు.

ఇప్పుడు లక్షలకి అధికారి, ఫారెస్టు కంట్రాక్టర్, ఆఫీసర్ల పాలిటి ఆపద్బాంధ వుడు, రాజకీయ అనాథలకు చందాల దాన కర్ణుడు, కూలి నాలి జనానికి ప్రాణాంతకు డుగా తయారైనాడు.

సోషలిస్టు నమూనా ప్రభుత్వ ముద్దుబి డ్డగా నాగరీక పిచ్చిపోకళ్ళకు దూరంగా, మడుగులో మొసలిలా, రెండు పక్కలా పదునుగల కత్తిలా జీవిస్తున్నాడు. సకల సౌకర్యాలూ, సుఖాలూ, అక్కడే అనుభవిం చటానికి అన్ని ఏర్పాట్లు చేసుకుని కాలక్షేపం చేస్తున్నాడు.

"ఈనగారింకా రాడేం?" విసుక్కున్నాడు రాజారెడ్డి.




"మనమంటే లెక్కలేదే? ఆడ కూర్చునేట లాయిస్తున్నాడే? " తిలక్ నసిగాడు.

అంకినీడుగారు, చనువుకొద్దీ "ఏ వండోవ్, మాకాడ అర్జంటు పనులేడుస్తాకూకు న్నాయ్. తెవుల్చుకుని రా ఎల్లాలె" అని కేకే శాడు.

"వస్తుండా? ఈడ యీ మాయదారి ముండాకొడుకుల్ని వదలించుకొస్తుండా! బాబూ!" అన్న పావుగంట తర్వాత మల్లేశ్వ రరావు నిదానంగా, మందంగా వచ్చి కుర్చీ లాక్కుని కూచున్నాడు.

ముతక ఖద్దరు పంచె, లాల్చీ నీరు కావి పట్టి, అతని ఐశ్వర్యాన్ని దాచిపెట్టేశాయి.

అతను తాగిన బీరు అతనిలోని సహజ అహంభావాలని లోబర్చుకుని అట్టిపెట్టే సింది.

అతను కూర్చుని తిలక్‌ని చూసి మంద హాసం "చేసి ఏందండి నాయకులూ! ఏం సంగతులూ" అన్నాడు.

"నీకు తెలియని సంగతులేం వున్నాయ్? మీ పెద్దబ్బాయ్ అన్ని చెప్పేవుంటాడు"

"చెప్పాడ్లే. ఆఫీసర్లతో తగాదాలు నాకు నచ్చవ్. అసలు మనల్ని పరిపాలించే దెవ రండీ! మంత్రులా? ప్రభుత్వ శాఖల ఆఫీ సర్లే కదండీ. రివెన్యూ వోళ్ళు, పోలీసోళ్ళు, ఫారెస్టు డిపార్టుమెంటోళ్ళు కదండే. ఈ మంత్రులదేం వుందండీ? ఈయాళున్న మినిస్టరు రేపుంటాడా? మన కళ్ళముందే ఎందరు కొట్టుకుపోయారూ! తల్లి ముండ మొయ్యా" అనేశాడు మల్లేశ్వరరావు.

తమనే, తమ వృత్తినే కించెపర్చుతున్న ట్టుగా గిలగిలాలాడిపోయారు అంకినీడు, తిలక్‌లు.

"నిజమంతే అనుకో" అని మూల్గేడు అంకి నీడు.

తిలక్‌గారి తల తిరిగిపోతున్నది.

"అబ్బో... ఈ ఆఫీసర్ల పోకడ హైదరా బాదులో సూడాలి. ఆళ్ళని మొగ వేశ్యల కింద వాడుకునే తెలివి మీరిన కంట్రాక్టర్లు బాగా సంపాదించుకుంటున్నార్లెండి. నా సామిరంగ! పళ్ళు పుల్సి పోతున్నాయ నుకో? "

"నీవేం తక్కువ తిన్నావా మల్లయ్యా? పదేళ్ళలో లక్షలు లక్షలు పోగేసుకున్నా వుగా" అంకినీడు చిన్న మూల్గుమూల్గేడు.

"నా తెలివేందిలే అంకమ్మగారూ! మనలా టోళ్ళ నీడలోనేగదా ఆఫీసర్లు బతికేది. ఆళ్ళ చలవవల్లేగా మనం సంపాదించుకునేది? నీకు తెలవందేవుంది? ఆళ్ళే మనకి ఐడి యాలు, మతలబులు యిస్తారు. విస్కీ పార్టీయిస్తే సీక్రెట్లు చెప్తారు. పర్సెంటేజి పెచ్చు పారేస్తే, ఆళ్ళ డిపార్టిమెంటు స్కీము లందిస్తారు. వాళ్ళని పట్టుకుని పన్లు చేయించుకోటానికి మనకి పట్టుదలుండాలి, కిందోడు మోరాయించినా, పైవోడ్ని వశంచే సుకుని పని సాధిస్తాం అనుకో"

"ఇంకా ఎన్నేళ్ళుంది లీజు! ఫారెస్టు భూమి? " అడిగాడు, అంకినీడు కుతూ హలం పట్టలేక. పైగా మల్లయ్య ఏదో గొప్పలు చెప్పుకునే వూపులో వున్నాడని గ్రహించేశాడు.

"ఇంకో సంవత్సరం వుందిలే ఐదేళ్లకు పాట పాడున్నా"

"ఎన్నెకరాలో? "

మొత్తం అడవి రెండువేలెకరాలు. మనం ఐదొందల ఎకరం ఐటం పాడేం"

"ఎంతకో"

"ఎకరాకి పదిరూపాయల కాడికి కొట్టేపిం చుకున్నా"

"అసలీ పథకాన్నెట్టా వాసన పట్టేరండీ"

"చెప్పానుగా ఆఫీసర్లే వచ్చి మనల్ని వాటే సుకు తీసికెళ్తారని. వాళ్ల పైసంపాదనకు, పెత్తనానికి ముప్పొచ్చిపడ్డది. మమ్మల్ని

లెగ్గొట్టి, కొత్తకొత్త స్కీముల కాయితాల్ను దులిపి, పేదోళ్ళ నోట్లో దుమ్ము కొట్టేస్తారు. ఎవరెట్లా సస్తే మనకేం. మనం వేలు పెట్టి, లక్షలు సంపాదించాలనే యావతప్ప" అని హి! హి! అని యికిలించాడు.

"అంతేగా!"

"ఢిల్లీ కాడినుంచి పల్లెలో జీపులేసుకు తిరిగే ఆఫీసర్లదాకా యిదే వరసనుకో. మన కోసం వెతుక్కుంటా తిరగుతుంటారు. మనం యీడనుంచి ఢిల్లీదాకా ఎతకతా వుంటాం. చేతులు కల్పుకుంటాం, స్కీములు సాంక్షనవుతాయి. అందరి సర్దాలు తీరి జేబులు నిండుతాయ్. అర్ధాకలితో చవగ్గా కూలికొచ్చే జనాన్ని మనం మలుపుకుని

చాకిరి చేయించుకోటంలో వుంది కిటుకు. పైగా ఈ సుట్టుపక్కలా మనవే మోతుబర్ల వాయిరి. మనకులం అండ మనం ఎన్ని గుడిసేటిపన్లు చేసినా కమ్ముకొస్తదాయిరి. దీపం వుండగనే అన్ని సక్కపెట్టుకోవాలి గాందా"

"అసలీ స్కీము నెట్టా వాసన పట్టారో చెప్పలేదింతకూ? "

"దాని కథ చాలావుంది. బంజర్లని పేద లకే యివ్వాల. ఫారెస్టు బంజర్లని సాగు లోకి తేవాల. బంజర్లు పంచండి. లేకుంటే మేం ఆక్రమిస్తాం. సత్యాగ్రహాలు చేస్తాం. అని పాతికేళ్లకిందట కమ్యూనిస్టులు అలజ డులు లేవతీశారుగా. ఆమైనప్రభుత్వం ఆళ్లని మక్కెలిరగనూకి బొక్కలోకి తోసిం దిగా. అంత పంచాం, ఇంత పంచాం. ఇంక పంచబోతున్నాం. ఇరవైసూత్రాలు, ఇరవై ఐదు సూత్రాలు అమలు పరుస్తాం. పేద రికం తొలగిస్తాం. ఇళ్ళస్థలాలిస్తాం. అంటూ మనోళ్ళు నినాదాలు లేవతీస్తా తిప్పలు పడు





తున్నారా? ఇకన ప్రభుత్వశాఖలెట్లా వంత పలుకుతున్నాయి? ఆళ్లు స్వాతంత్రం రాక ముందెట్లా వున్నారో ఇప్పుడూ అట్టాగే వున్నారు. పైపెచ్చు మనలాటోళ్ళ అండ దొరికిందాయె! వాళ్లు వాళ్ల స్కీములతో ముందుకొచ్చేశారు. వాళ్ళు కొన్ని అదనపు ప్రయోజనాలు, సౌకర్యాల కోసం వెంపర్లాడు తుంద్రి. మనలాటోళ్ళం, ఎట్టా లక్షాధికార్ల మౌదామా అని తిరుగుతుంటిమాయె.

"మా ఫారెస్టు దొరలేవంటారంటే, ఈ చిట్టడవులు కొట్టేస్తే ఎట్లా? వర్షపాతం తగ్గుద్ది. కాబట్టి లేబర్ని ఫారెస్టు బంజర్లొకి అడుగుపెట్టనీయం అంటారు. ఈ భూమిలో జీడిమామిడి మొక్కలు పెంచితే మనకి విదేశమారకద్రవ్యం లభిస్తుంది. ఈ రెండు వేల ఎకరాల్లో జీడిమామిడి తోటలు అభివృద్ధి చేయాల్సిందే" అని పట్టుపట్టారు.

"వాళ్ళ వాదనే నెగ్గింది. పింగాణిపేట్లలో వేయించిన జీడిపప్పులు తినటానికి అలవా టుపడ్డ ఆఫీసర్లు స్కీము సాంక్షన్ చేశారు. ముందు ఈ భూమిలో ముళ్లకంపల్ని, చిట్టి పొదల్ని నరికి భూమిని లెవెలు చేయించటా నికి టెండర్లని పిలిచారు. నేను చల్లగా జొర బడ్డా. భూమిని లెవెల్ చేశాం. ఎగ్రికల్చ రోళ్లు వొచ్చి భూమిని చూసి ఓ.కే. అన్నారు. జీడిమామిడి మొక్కలు నాటారు. ఐదేళ్లు ఈ భూమిలో ఏర్సెనగ పండించొచ్చ న్నారు. మళ్ళీ దానికి టెండర్లు పిలుపులు. మేం ఐదుగురం కాంట్రాక్టర్లం ఈ చిట్టడ వినే నమ్ముకుని బతుకుతూ, డిపార్టిమెంటో ళ్లని ఆదరిస్తూ వున్నాంగదా. పైగా నేను పార్లమెంటు మెంబర్‌గారి ఇలాకా మనిషి నని ఢిల్లీదాకా తెల్సాయె. నేనొ ఐదొందల ఎకరంలో ఏర్సెనగేశా. మొదటి యేడు కర్సులు తేల్లా. నష్టపోయా. మూడేళ్లనుంచి పంటలు విదిలించేశాయిగా. ఫర్వాలే పదిల క్షలు కళ్ళచూశాను! చెప్పొద్దూ. ఆఫీసర్లం దర్ని శ్రద్ధగా గౌరవంగా చూసుకుంటా భూదేవితల్లిని నమ్ముకున్నాంగదా. ఆ తల్లే

కొట్టినా, బతికించినా, బాగుచేసినా ఏదో తంటాలు పడుతున్నా" అని మల్లేశ్వరరావు ప్రభుత్వం ప్రజల్ని పాలించే పోకడ తెలియచేశాడు.

తిలక్ మనస్సులో కుళ్ళి కుళ్లి ఏడుస్తున్నాడు విన్నంతసేపూ, తన కుటుంబాన్ని తల్చుకుంటూ.

గంజిలోకి ఉప్పు లేదని ఘోష పడుతూ గుడిసెమీద సరిగ్గా కప్పు లేదనీ, సొంతానికి చారెడు భూమి లేదనీ అలమటించే ఈ ప్రాంతంలోని పేదరైతులు, వ్యవసాయకూలీలు లీలగా అతని మనస్సులో మెదిలారు.

ఇంత ఘోరం ఇంత నిశ్శబ్దంగా ఈ అడవిప్రాంతంలో జరిగిపోయిందా అని ఆశ్చర్యపోతున్నాడు అంకినీడుగారు.

ఇలాంటివాటికి పెట్టుబడి పెట్టి సాగులోకి తేగల భూస్వాములు అవసరం. అధిక పంటలు పండించాలంటే వీళ్ళవసరం చాలా వుంది. భారీఎత్తున కొత్త భూముల్లో, యంత్ర సహాయంతో, ఉత్సాహంగా, దీక్షగా పాటుబడే ఈలాంటోళ్లు వుండాల్సిందే. ఈ భూవిని వ్యవసాయ కూలీలకి రెండెకరాల చొప్పున పంచమంటారు కమ్యూనిస్టులు. వాళ్ళెడనుంచి పెట్టుబడి తెచ్చిపెట్టారు? వాళ్ళ పెళ్ళాల మెళ్లో బంగారుపుస్తెలు గూడా వుండవ్. మళ్ళీ ప్రభుత్వమే అప్పులు., ఎరువులు , రెండేళ్లు పంట లేకపోతే విత్తనాలు, సబ్సిడీ అప్పులు, బండిదున్నలకి, బ్యాంక్‌లో తాకట్లు, ఇట్టా వాళ్ళని కిందా మీద చేస్తే వాళ్లు పంటలేం పండిస్తారు? అస్తుబిస్తుగా బతికేవోళ్లవల్ల ఏం ఉపయోగం, వాళ్లని లేనిపోని భ్రమల్లోకి తోసి వేధించేకంటే, వీళ్లకే రిక్షానో కొనిపెట్టి, ఏ ఫ్యాక్టరీలోనో కూలీగా ఏర్పాటు చేస్తే సరిపోద్ది. ఇట్లాంటి భూవుల్ని, లీజుకియ్యటమే లయాకి. ఈ రకం భూస్వాములు బాగా బలపడి బల్సి, లక్షలు పోగుచేసుకుని, నిదానంగా పరిశ్రమలు కొత్తవి ఏర్పాటు చేస్తారు. అప్పుడు దేశం పారిశ్రామికంగా అభివృద్ధి చెందుతుంది.

అంకినీడుగారు ఆలోచనలను పక్కకునెట్టి, "ఐతే మీ అబ్బాయ్ ఎప్పుడొస్తాడంటావ్?" అని అడిగాడు.

"రేపటికొస్తాడు. రాంగానే మీకాడికి పంపిస్తా. మేం ఎట్టాగూ ఎమ్మెల్యేగారికి డిన్నరేర్పాటు చెయ్యాలనుకున్నాం. మన టౌన్లో ముఖ్యుల్ని, ఆఫీసర్లని ఆహ్వానిస్తాం. మీరు రావాల. మావోడు మిమ్మల్ని పిలవటానికి కొస్తాడు సర్నా. నేను ఫారెస్టులోకెళ్లి రావాల. దుక్కులింకా పూర్తికాలె. ఇంకా రెండొందల ఎకరాల్లో విత్తనం పడలె"

"ఐతే పనివత్తిడింకా తగ్గలేదన్నమాట"

"పని వత్తిడేంది? అన్ని వొత్తిడిలు ఒక్కపాలె వచ్చిపడ్డాయి. మా పెద్దోడుత్త చాదినాయాలు అంకమ్మగారో. వాడి మాటాడిదే. ఏరె మాట చెవినపెట్టడు. మనం కర్నులో నలుగుతున్నాం. ఇప్పుడొద్దన్నా వినకుండా, పోయిన్నెల్లో ట్రాక్టర్, ఈ నెల్లో లారీ తీసుకొచ్చాడు. ఇప్పటికి రెండు లక్షలయినాయి. చాలకపోతే కిలో బంగారం స్టేటు బ్యాంక్‌లో పెట్టి డెబ్బయిఐదువేలు తెచ్చా బొటాబొటిగా సరిపోద్ది. ఆనక ఏం చేయాలో పాలుపోవటంలా. మరి నాకు శెలవిప్పించండి" అని లేచి నిలబడ్డాడు మల్లేశ్వరరావుగారు.

లారీల సంఘసారధులూ లేచారు.

మల్లేశ్వరరావు బయటకొచ్చి, అందరకు నమస్కారాలు పెట్టి ట్రాక్టరెక్కి కూర్చున్నాడు. మూడు ట్రాక్టర్లు అడవివైపు బ్రహ్మాండంగా చప్పుడు చేస్తూ, ఎర్రదుమ్ము రేపుతూ వెళ్ళిపోయాయి.

వచ్చిన దోవనే బయలుదేరింది, రాజారెడ్డిగారి కారు.



"చూశారంటండీ, మల్లేశ్వరరావు దిలాసా. లారీలు, ట్రాక్టర్లు, కిలో బంగారం పదేళ్ళలో పల్నే సంపాదించాడు. మనకి ఇర్వై ఏళ్లు పట్టింది. తల్లి ముండమొయ్య. జాతకుడే మల్లయ్య" అంకినీడు బయటపడ్డాడు.

తిలక్ మౌనంగా నిరుత్సాహంగా వుండి పోయాడు.

"ఇప్పుడు బరితెగించి దారుణంగా డబ్బు కాజెయ్యడం ఎక్కువైంది. మా బావమరుదులు, మురుగుకాలవల మరమ్మత్తు కంట్రాక్టర్లుగా తయారై అసలేంపని చేయించకుండానే, బిల్లులు వేలకువేలు మార్చుకు నూకుతున్నారు. ఇంజినీర్లు, ఈళ్లు కల్సిదోచి పారేస్తున్నారు. రెండేళ్ళలోనే నాలుగు మేడలు లేపేశారు. నా కళ్లు తిరిగిపోయాయ్. వాళ్ళ సంపాదన చూసి" అన్నాడు రాజారెడ్డి.

"గ్రామాభ్యుదయం పేరు చెప్పి, నాసిరకం భూమి పంచి లేబర్ని ఏడిపించే కంటే ఈ అడవి బంజర్ని పేదోళ్లకి పంచకపోయినా, ఆళ్లకి లీజుకిచ్చివుంటే వాళ్ళ బతుకులు కాస్త మెరుగయ్యేవిగదా" అన్నాడు తిలక్.

"యియ్యన్ని చేసి సచ్చేదెవరండీ? లేబర్‌కి పంచినా, వాళ్లు మనలాటోళ్లకి అమ్మక నూకతారు. ముప్పయి ఏళ్లనాడు రాజకీయ బాధితులకిచ్చిన భూముల్లో తొంభయిపాళ్లు మనలాటోళ్ళ చేతికిందికొచ్చాయి ఎరగవు కావల్ను?" అని అంకినీడుగారు ఈసడించి పారేశారు.

"ఆళ్లకి సన్నాసిరకం భూవులిచ్చి వ్యవసాయం చెయ్యమంటే ఏం చేస్తారు. ఇరిగేషన్ సౌకర్యాలు లేని బీడు భూవులప్పగిస్తే వాళ్లేం ఏడుస్తారు. యివ్వన్ని కన్నీటి తుడుపు కార్యక్రమాలే. పేపర్లో ఇన్ని లక్షల ఎకరాలు భూమిలేని పేదలకు పంచాం అని ప్రకటించుకోటానికే ఉపయోగం"

"బ్లాకు డెవలప్‌మెంటన్నారు. నిరుపేదల కుటుంబాలనేమాత్రం ఉద్ధరించారు? ఆఫీసర్ల జీతాలకే సరిపోతుండే"

"పనికి ఆహారపథకం అన్నారు. ఇది నిరుపేదలనేమాత్రం ఆదుకున్నదండి? దరిద్రరేఖ కింద సతమతమయ్యే కుటుంబాలకేం ఒరగపెట్టిందండి"

"మనకళ్లముందున్న పల్లెల్ని చూడండి. ముప్పైయేళ్లనుంచి ఎట్టా అఘోరిస్తున్నాయో? వాళ్ళకి రోడ్ల సౌకర్యంలేదు. మంచినీటి సౌకర్యం లేదు. కరెంటు కాంతి లేదు. చీకట్లోనే మిటకరించుకు చూస్తుంటాయ్ పల్లెలు"

ప్రజలుపడే ఈతిబాధల్ను ఇట్లా విమర్శించుకుంటూ కార్లో ప్రయాణం చేస్తూ ఆ పూట కార్యక్రమాన్ని దిగ్విజయంగా ముగించేశారు లారీల సంఘం పెద్దలు.

రాజారెడ్డి బ్రాంది సీసా మూత తీయమన్నాడు గుప్తాని.



పాకహోటలు ముందు బల్లమీద కూర్చుని ప్రకాశం చేతిసంచీ వైద్యం మొదలుపెట్టి గంట కావస్తున్నది.

అతను దళిత జనానికి అన్ని విషయాల్లో అందుబాటులో వుంటాడు. వాళ్ళ గుడిసెల కాడకెళ్లి, నులకమంచం వేయించుక్కూచుని, వాళ్ళ రోగాల్ను, రోష్టుల్ని, తన సంచిలోని గోలీలు, చూర్ణాలు, సహాయంతో పరామర్శిస్తుంటాడు. అవసరమైతే ఇంజక్షన్లు పొడుస్తాడు. తనవల్ల కాకపోతే రోగుల్ని టౌన్లో డాక్టర్ల దగ్గరకు వెంటపెట్టుకెళ్తాడు.

కొందరికి ఉచితంగా మందు మాకు ఇస్తాడు. కొందరు పావల, అర్ధ చేతిలో పెట్టినా, సంతోషిస్తూ పక్కజేబులో వేసుకుంటాడు. అర్ధరూపాయి డబ్బులకే, సుతిమెత్తనగా ఇంజక్షన్లు సూదేస్తాడు.




ఆరేళ్లనుంచి ఆ పల్లెపట్టులో కాలినడకన, సైకిల్ మీద పగలు, రేయి ఎండ, వాన, గాలి, ధూళి లక్ష్యపెట్టకుండా తిరిగి బీదాబిక్కిలో పరపతి సంపాదించాడు పాతికేళ్ల ప్రకాశం. నిరాడంబరంగా, ప్రశాంతంగా వుంటాడు.

రెండేళ్లకిందట టౌను పోలీసువాళ్ల దృష్టిలో ప్రకాశం, గారెలబుట్టలో పడ్డట్లుపడ్డాడు.

అప్పుడు యస్.ఐ.గారు లాకప్‌లో వున్న ఓ నేరస్థుడి నోట్లోంచి నిజం చెప్పించేందుకు చితకబాది నెత్తురు కక్కించాడు. దాంతో వాడు స్పృహ కోల్పోయాడు. లాకప్పు కొట్లో, ఉచ్చలో మన్ను మశానంలో శ్మశానం సీను కళ్లలో మెదిలి యస్సై బేజారెత్తిపోతుండగా, వారికి చేదోడుగా పక్కనున్న ముగ్గురు పోలీసువాళ్ళల్లోని సీనియర్ కానిస్టేబుల్ "మన ఇలాకా చోటా డాక్టరు వున్నాడ్సార్ మన మనిషే" అంటూ ఆ గడ్డు సమయంలో గొప్ప ఐడియా చెవినేశాడు.

పావుగంటలో ప్రకాశాన్ని లాకప్ గదిలోకి వెంటపెట్టుకొచ్చాడు అర్ధరాత్రి వర్షం గాలిలో.

ప్రకాశం నేరుస్థుడి నెత్తురు నోరు తుడ్చి కడిగి ఇంజక్షనిచ్చాడు. తెల్లవారిందాకా దగ్గరే వుండి రోగి తెప్పరిల్లిందాకా చూసి వేడి ఇడ్లీ తినిపించి, పాలు తాగించి, మళ్ళీ ఇంకో విడత గొట్టం మింగించి, ఇంజక్షన్ చేసి యస్సై, ముగ్గురు కానిస్టేబుల పరువును ఒడ్డున వేశాడు. నేరస్థుడు బ్రతికి శిక్షను సబ్‌జైల్లో హాయిగా అనుభవించాడు. యస్సై డక్కామొక్కీలు తినమరిగి, లాకప్ హింసలో కీర్తి సంపాదించాడు.

అప్పట్నుంచి, పోలీస్ లాకప్ గౌరవవైద్యుడుగా ఆపత్కాలంలో, ఆదుకుంటున్నాడు ప్రకాశం.

పోలీసులు, అతని ప్రతిభని గుర్తిస్తూ, అతని సేవలు పొందుతూ, తమలో వాణ్ణిగా చేసుకున్నారు.

అప్పట్నుంచి ప్రకాశం జీవితం గొప్ప మలుపు తిరిగింది. సరికొత్త తరహా జీవితం మొదలయింది.

పోలీస్‌స్టేషన్లో అతని మాటకు విలువ గిట్టుబాటు కాసాగింది.

రోజులు గడుస్తున్నకొద్దీ టౌన్లో పోలీసుల జులుం పెరుగుతూ, విజృంభిస్తుండగా, తోడుగా ప్రకాశం పేరు ప్రతిష్ఠల లెవలూ పైకిలేస్తూ, వరదనీళ్లులాగా పరుచుకొస్తున్నది.

రౌడీలు, కేడీలు, రిక్షావాళ్ళల్లో కూడా ప్రకాశం కీర్తిచంద్రికలు పాకి, వెలుగులు నింపాయి. అతని అండదండలు, అడ్డం పెట్టుకుని, వాళ్ళు తక్కువ పోలీస్ యాతనలతో బయటపడి ఊపిరి పీల్చుకునేవాళ్లు.

మాకేం యం.యల్.ఏ. మున్సిపల్ ఛైర్మన్ల అండదండల్లేవు. సినిమా ఓనర్ల, క్లబ్ ఓనర్ల రక్షణలేదు. తవరిలాంటి లేబర్ లీడర్ల చలవ్వల్ల పోలీసుగండాలు గట్టెక్కగలం. తమరొచ్చి మావోణ్ణి లాకప్‌లోంచి విడిపించండి. నీవు తప్ప మాకు వేరే గతి లేదు. సర్కిల్‌గారితో మాట్లాడి మా విషయం నీవు పోలీస్టేషన్కొచ్చి మా మొరవాళ్లకి మనవి చెయ్యి. ఎంత డబ్బైనా కర్చు కానీ, నీవు లేచిరా. ఇట్లాంటి డైలాగుల్తో ప్రకాశం ప్రజల మనిషిగా మారిపోతున్నాడు. తను ఎట్లా బ్రతకాలి అన్నదానికి కొన్ని ప్రమాణాలు ఏర్పర్చుకున్నాడు.

తనకు డాక్టర్‌గా బోర్డు తగిలించుకోటం ఎటూ ఈ జన్మలో జరిగేపనికాదు. కాని చాలామంది డాక్టర్లకు లేని మొహంలో ప్రశాంతత, కళ్లలో జాలి, అంతరంగంలో ప్రేమ, పెదాలమీద చిరునవ్వు స్థిరపడ్డాయి. మొదట్లో సాయంకాలమైనా అర్ధరూపాయి డబ్బులు కూడా, జేబులో తగిలేవికాదు.

గాడిద ఓర్పుతో తలవొంచుకుని గుడిసెల చుట్టూ తిరిగి తిరిగి, తనే రోగుల్ని కనిపెట్టి మలేరియా మాత్రలు అందించేవాడు. అజీర్ణం, విరోచనాల మాత్రలు, బేడపావలాకు చేతిలో పెట్టి వచ్చేవాడు. జనం మధ్య తిరగటం బాగా అలవాటైంది. నిత్యం పాతిక మందితోనైనా బాతాకాని వేయంది తోచేది కాదు. జీవితరంగం మారేప్పటికి పాకెట్ ఖర్చులు పోనూ పాతికా, యాభై జేబులో బరువుగా తగుల్తున్నాయి. కొంత డబ్బుతో టాబ్లెట్లు, కాప్సిల్సు కొని ఉదారంగా, ఉచితంగా బీదాబిక్కి రోగులకు ఇచ్చేవాడు.

పాకహోటలు రష్ తగ్గింది. ప్రకాశం ఈ పూటకు ముగించి లేచే ప్రయత్నంలో వున్నాడు. మందుల సంచి బిగించి ముడేశాడు. రిస్టువాచి చూసుకుని టీ చెప్పాడు.

ఇంతలో పదిమంది పాసింజర్లు హడావుడిగా హోటల్లో జొరబడి బల్లలాక్రమిస్తూ టీలకు ఆర్డరిచ్చారు.

"యిదు గోరా డాక్టర్‌గారు. వందనాలండి ప్రకాశంగారు. సైకిల్ గావాల్సార్ ఇంటిదాకా అర్జంటుగా, ఇప్పుడే వస్తాం. టెన్‌మినిట్సే" అన్నాడు వాళ్లలో ఒకడు. హేళనగా, చనువుగా, హాస్యంగా.

మరోహడు కలుగచేసుకుని, "డాక్టరంటావేంద్రా జోసప్‌గా. సర్కిలినస్పెక్టర్ని పట్టుకుని, వళ్లుపై తెలియటం లేద్రా భాంచెత్ లాకప్‌లో తోయిస్తా" హాస్యంగా, వ్యంగ్యంగాను నవ్వుతూ అన్నాడు

ప్రకాశం నవ్వుతూ టీ చప్పరిస్తూ వాక్కోండి... వాక్కోండి. నా కొడకల్లారా అని అనుకుంటూ మౌనంగా కూర్చున్నాడు.

ఎండెక్కగానే పాక హోటలు, కాలక్షేపరాయుళ్ళతో నిండిపోతుంది. వాళ్ళలో చాలామంది నిరుద్యోగ పట్టభద్రులు. తల్లిదండ్రులు సంపాదిస్తుంటే, జల్సాగా తిరిగే అబ్బాయిలు, వాళ్ళ సహచరులు, అనుచరులు.

వాళ్ళలో ఐదారుగురు ప్రకాశం బాల్యస్నేహితులు, ఇరుగు పొరుగువారు వున్నారు.

ప్రకాశం సైకిల్ని జోసఫ్ వేసుకెళ్ళాడు. అతనొచ్చేదాకా పడికాపులు కాయాల్సిందే.

"గురూగారింకా గుడిసెలవైపు బైలుదేరలేదనుకుంటా" సాంబయ్య వ్యంగ్యంగా నవ్వుతూ ప్రకాశాన్ని అడిగాడు.

"లేదు భాయ్"

"గుడిసెలు చుట్టేసింతర్వాతా? ముందేనా? పోలీస్‌స్టేషన్ సందర్శించేది"

తర్వాత అన్నట్లుగా చేయాడించాడు ప్రకాశం.

"తదుపరి? "

"తర్వాత మేజిస్ట్రేట్ కోర్టు దగ్గర చెట్టు కింద పాక హోటల్"

"తదుపరి"

"ఇంటికొచ్చి బువ్వతిని మళ్ళా గుడిసెలు చుట్టేసి రావటం"

"సాయంకాలం ఎక్కడ అడ్రస్? "

"లైబ్రరి రూమ్"

"అమ్మో! నీవు లైబ్రరి గ్గూడా వెళ్తావంట్రా. నీవు పేపర్లు చదువుతావూ, వండర్‌గుందే"

ప్రకాశం లేచొచ్చి సాంబయ్యా చొక్కా పట్టుకొని వూపి వాడి జేబులో పెన్ను లాగేసుకొని వెళ్లి కూర్చున్నాడు.

"ఆ లైబ్రరీనుంచి ఇంకెక్కడికెల్తావ్?"

"నా పొట్టతిప్పలు, ఎటేపు లాక్కుపోతే, అటేపే ఎల్తా మీరంతా వడ్డించిన అరిటాకులు.

మీకేం తక్కువ, నేను వూరంతా తిరిగొస్తే గాని గడవదు. "

జోసెఫ్ సైకిల్ మీద వచ్చేసి, "మాకు తక్కువైన వాటికోసమే వేటాడుతున్నాం"




అన్నాడు సైకిల్మీదనుంచే దిగకుండా. బూటు, కళ్ళకి జోడు, చేతికి వాచి, తెల్లపాంటు షర్టులో డాబుసరిగా తయారయ్యాడు. "అన్నా నా చిరకాలవాంఛ ఒకటి ఈరోజు నెరవేరింది"

"ఏందో? "

"సుమిత్రకు మూడు రిజర్వుడు టికెట్లు అడ్వాన్సు బుకింగ్‌లోంచి ఇప్పించా. థ్యాంక్స్ అంది. వెల్‌కమ్ అన్నా. ఆమె స్మయిల్ చేసింది. మొన్న సాయంత్రం కళ్యాణి సైకిల్మీద వస్తుంటే డేష్ ఇవ్వబోయా. సైకిల్‌తో దాని మొహంలో భయం చూస్తే నాకెంతో ముచ్చటైంది"

"అదోరకమైన రాక్షసానందం" ప్రకాశం ఎద్దేవ.

" 'మొత్తానికో ఆనందం"

ప్రకాశం సైకిల్ దగ్గరకు వచ్చాడు. జోసఫ్ "ఇప్పుడే వస్తా. ఫైవ్‌మినిట్స్. ఆ కట్టెల మోపెత్తకొస్తున్నదాన్ని చూడు. హేమమాలిని చెల్లెల్లా వుండా. మొన్న నన్ను చూసి నవ్వింది. జేబులో టెన్‌రూపీస్ వుంటే చాలు. గుర్రం వచ్చేస్తుంది. దాని యవ్వారమేందో అడిగొస్తా" అన్నాడు.

"నీ పోకడ చాలా విచిత్రంగా వుందిరా జోసఫ్. కాలేజీ బ్యూటీ సుమిత్రని ప్రేమిస్తున్నానంటావ్. పొట్టాత్రంతో పాట్లు పడే ఆడోళ్లని వెంటపడతానంటావ్. ఉచ్చాగా తయారయ్యావేందే. అబ్రహం మాస్టారి కడుపున చెడపుట్టావుగదరా" అనేసి సైకిల్ లాక్కున్నాడు ప్రకాశం.

జోసఫ్ నవ్వుతూ సైకిల్ ప్రకాశానికి చ్చేస్తూ, "మీ అమ్మ మొన్న చర్చిలో కనిపించి "చూడు బిడ్డా. మా ప్రకాష్‌గాడెప్పుడూ ఆ జంగ్లీల గుడిసెల్లో దూరుతుంటాడు. నీ స్నేహితుడ్ని చెడుమార్గంలోంచి మార్చు నాయనా అని చేతులు పట్టుకుందిరా. తల్లి మనస్సు కష్టపెట్టమాకా ప్రకాశమా" అని విరగబడి నవ్వాడు.

ప్రకాశం వాడి ఆనందానికి వాణ్ణి వదిలేసి సైకిల్ ఎక్కి వెళ్ళిపోయాడు.



ప్రకాశం పాక హోటల్ ముందు ప్రజాసేవ ఈ పూటకు చాలించి ఎటు పోదామా అని ఆలోచిస్తూ కొన్ని క్షణాలు ఆగి సైకిల్ని ఎర్రమట్టి రోడ్డుమీదకు లాగేడు. చెరువుకట్ట ఎక్కించి, ఏనాదుల గుడిసెలవైపు తొక్కుతూ వెళ్ళి వేపచెట్టు నీడన ఆగి బెల్ మోగించాడు.

ఏనాది సంఘం గుడిసెలో నివసించే వాళ్లందరకు ప్రకాశం ఎరుకె. వారానికి రెండు మూడుసార్లు తమ గుడిసెల మధ్య కొచ్చి, రోగులకు మందుమాకు ఇచ్చి, బాతాకాని కొట్టి, కష్టసుఖాలను విని ఉచిత సలహాలు చెప్పి, తల్లో నాలుకలాగుంటున్నాడు.

ఏనాదుల గుడిసెలు, కొన్ని పక్కకు వాలిపోయి, నిశ్శబ్దంగా వుగ్గపట్టుకు ఏడుస్తున్న రోగుల్లాగా ముడుచుకు్కుమన్నట్లు వున్నాయి.

కొన్ని గాలికి తాటాకు లేచిపోతే, గోతాలు కప్పుకుని పాడెమీది కెక్కించిన శవాల్లా వున్నాయ్ కొన్ని.

సీతయ్య గుడిసెనిండా కంతలే. వాటిల్ని కొబ్బరి మట్టలతో, ఎండిపోయిన జిల్లేడు, ఉమ్మెత్త చెట్లతో, సినిమా పోస్టరు కాయితా

లతో కప్పినా కనపడుతున్నాయి.

ఓరి దౌర్భాగ్యుడా అని మనసులో గొణుక్కుని ప్రకాశం సీతయ్య గుడిసెవంక చూస్తూ, "సీతాయ్‌గా" దిగులుగా పిల్చాడు.

"ఆ, ఊ" అని గుడెసెలోంచి మూలుగు వినిపించింది.

"పెకాశంగోరా, సామె" అంటూ గుడిసెలోంచి చెంచమ్మ వొంగొని, బయటకొచ్చి కుండల కడ్డంగా నిలపెట్టిన కుక్కి మంచం ఈడ్చుకొచ్చి, ప్రకాశం కాళ్ల దగ్గర వేసి నవ్వుతూ.

"కూకోసావే. దేవుడుమల్లె ఒచ్చినవ్" అని చినిగిన రవిక కనిపించకుండా, కొంగు భుజాల్మీదకు లాక్కుంది. చీరె కొంగూ చినిగేవుంది.

ప్రకాశం కూర్చుని నిట్టూర్చాడు. వాళ్ళ దుర్భర దారిద్ర్య బతుకుల్ను చిన్నప్పటి నుంచి చూస్తూ, అలవాటుపడినా నిట్టూర్పు వదిలాడు.

గుడిసెలోంచి కూర్చునే, దేక్కుంటూ సీతయ్య వచ్చి ప్రకాశం కాళ్ళ దగ్గర చతికిలబడి ప్రాణస్నేహితుడ్ని చూసి నవ్వినట్లు, నవ్వుతూ "శానాళ్లకి అగపడ్డావ్ సావే" అనేసి, నోట్లో నాలికను తిప్పుతూ, లొట్ట లేస్తూ, "ఇప్పుడే కూసిని గంజినీళ్లు తాగే బాబా! నీవు హోటల్ కాడ తగల్తావని, బైలుదేరబోతుండా, నీవే పెత్తచ్చమైనావ్"

"నీ ఆరోగ్యం ఎట్లుంది. మునపటికంటే బావున్నావ్" అని వూరడించబోయాడు ప్రకాశం.

"నా రాత. ఏం బాగో బొగ్గులు. రేత్రిళ్లు కంటిమీద కునుకు రాద్సావే. పగలంతా నీర్సం పాలుమాలిక"

ప్రకాశం సంచిలోంచి కొత్త డబ్బాతీసి, సీతయ్య చేతుల్లో పెట్టి "ఇది రెండు పూట్లా చెంచాడు చెంచాడు, నోట్లో వేసుకుని నీళ్లు తాగు. పాలు తాగితే మంచిదనుకో. బాగా ఆకలి పుట్టిస్తుంది. నీర్సం, ఆయాసం తగ్గిస్తది. మంచి బలం వస్తది. రేత్రిళ్లు తిరగ్గాక, గుట్టు చప్పుడిగా, కలో, గంజో త్రాగి గుడిసెలో పడుండు. తెల్సిందా"

సీతయ్య కొత్త డబ్బాను చూస్తూ, "అట్నే సావే. ఇట్టాంటి డబ్బాలెన్ని తినాలో, నాకాడంత డబ్బేది" అన్నాడు.

చేతిలో డబ్బు లేక కనీసావసరాలు, చంపుకున్న కోరికలు, ఆ గుడిసెల చుట్టూ గాలిలో గుమిగూడినవి.

అణగారిపోతున్న అట్టడుగు జనజీవితం రోగాలమయం, బాధలమయం. సంవత్సరాలు గడిచినకొద్దీ పాతగాయాలు మానినా వికృతమైన మచ్చలు ఏర్పడి, కొత్త గాయాలు తగలకుండా ఎంతగా అగచాట్లు పాలైనా, పాతగాయాలు రేగుతూనే వుంటాయి. కొత్త గాయాలూ తగులుతాయి. సీతన్న లోపల క్షయరోగం, బయట దుర్భర దరిద్రంతో క్షీణించిపోతున్నాడు. ఇల్లు చెంచమ్మ రెక్కల కష్టం మీదే గడుస్తున్నది. ఆమె దగ్గర్లోని రైసుమిల్లులో కూలీ. ఆమెకు మొదట్లో వున్న రంగురంగుల కలలన్నీ కరిగిపోయాయి. సీతన్నమీద ఆశలు వాడిపోయాయి. అనసూయమీద తప్ప మిగతా వారిమీద ఆశ, శ్రద్ధపోయింది.

వాళ్ళ జీవితంలో ప్రతీది అపశృతి పలుకుతోంది. వ్యవసాయ తరుణంలో దొరికే కొద్దిరోజుల పనులకే, నెలలతరబడి ఆశలో గడుపుతారు. తీరా చూస్తే, అతితక్కువ కూలీకే ఈగల్లాగా ముసురుకునే కూలీలు పోగై, తమ చేతిలో పనుల్ను గద్దలకు మల్లే తన్నుకెళ్తారు. ఆ శ్రమనుంచి సంపదలు పిండుకునే మహారాజుల గుప్పిళ్లల్లో చిక్కుకోవాల్సిందే తమ బ్రతుకులు. రానురాను మొగాళ్ల బస్తీలమీదకు ఎగబడేట్లుగా తరమబడతారు.





"సేతిలో డబ్బుల్లేవ్ మాకాడ. భయాసుపత్రికి ఎల్తానంటునాడయ్యా" చెంచమ్మ దిక్కుతోచక దిగులుగా గొణిగింది.

"ఓసీ ఎర్రిదానా, ఆడ మీలాంటోళ్ళ మొహాలు చూస్తారంటే చెంచమ్మా! ఎన్ని దినాలు పడిగాపులు కాయాలో, బెడ్ దొరకనే దొరకదు. వరండాల్లో కిందే పడేస్తారు. రికమెండేషనుండాలి. లేపోతే గోళీలిచ్చి ఇంటికాడే మింగతావుండు. బతికిందాకా అని పంపించేస్తారు. నేనెన్ని కేసుల్ను పంపించానో! పెద్ద డాక్టర్ల రికమెండేషన్లు కూడా ఆడ పన్చేయవే"

"మా బతుగులు అంతేనంటారా సావే"

ప్రకాశం సీతయ్యను పరిశీలనగా చూశాడు. వేటకుక్కలాగా క్షయ తరుముకొస్తున్నది. సీతయ్య నిదానంగా చచ్చిపోతున్నాడనిపించింది.

కోడిగుడ్డు, పాలు, పండ్లు తింటుండాలమ్మే అని చెప్పబోయి ఆగిపోయాడు.

"యీ మందు పన్చేస్తదిలే భయపడమాక" అని చెంచమ్మను చూశాడు.

"అంతేలే సామే" అన్న చెంచమ్మకు సీతన్న రాలిపోతే తన గతేమిటనే దుగ్ధ లేదు. ఆరేళ్లనుంచి తనే కుటుంబాన్ని సాక్కొస్తున్నది. పిల్లోళ్ళెట్లా పెద్దోళ్లవుతారో అనే దిగులూ లేదు. మనస్సు నిదానంగా బండబారిపోతున్నది.

సీతన్న ముక్కుతూ మూల్గుతూ "పెకాశం, నా పిల్లగోడు నా మాటినటవే లేదు బాబా! ఆడ్ని ఆస్టల్లో పార్నూకు. ఆడితో చానా తకరారుగుంది. గొడ్లకాడికెల్లనని మొరాయిస్తున్నాడు. సూడూ" అని చేత్తో చూపించాడు.

బాలకిష్టడు, సీతారాముడు, బురద కాలవలో చేపల్ని పట్టుకొస్తున్నారు. గోచి పాతరాయుళ్లు మరో నలుగురు పిల్లలతోపాటు నవ్వులతో గెంతుకుంటూ వచ్చారు.

అనసూయని బస్తీ హాస్టలుకు పంపే నాడు బాలకిష్టడేసిన శివాలు, చిందులూ సీతన్నకి జ్ఞాపకానికొచ్చేయ్. వీడు కట్టమీద గుడిసెనొదిలి ఎటో దేశాల పాలైపోతాడని భయం పట్టుకుంది. ఆ విషయమై ప్రకాశంతో చెప్పాడు.

"అట్నేలే ఈడ్ని ఆస్టల్కి పంపిద్దాంలే సీతన్నా. ఇప్పుడు మధ్యలో చేర్చుకోరు. మళ్ళీ సెలవలైనాక, బళ్లు ఆస్టళ్లు తెరుస్తారు. అప్పుడీడ్ని ఇరికిద్దాంలే" అని సీతన్నకి భరోసా యిచ్చాడు.

సీతన్న బాలకిష్టడ్ని చూసి, "యిన్నావుగదరా పెకాశమయ్య ఆస్టల్లో నిన్ను యిరికిస్తామన్నార్లే సరేనా" అని "అబ్బో శాన చాపలు పట్టకొచ్చారు గదరా" అంటూ మెచ్చుకున్నాడు.

"నేను ఇహ గొడ్లకాయనుపో ఇంట్లోంచి నూక్కెళ్లతా"

"పోలీసులు పట్టకెల్తారు. చెరువుదాటొచ్చా" అంటూ ప్రకాశం సైకిలెక్కాడు. చేపలు నేలమీద గిలగిల కొట్టుకుంటుంటే పిల్లలు చోద్యంగా చూస్తున్నారు.

★ ★ ★

"పోలీసోళ్లకు జనమంటే చాలా చులకని అబ్బాయ్‌గారో" అన్నాడు గోపీ, పళ్ల బళ్లసెంటర్లో.

"అవున్రా గోపి" ఏకీభవించాడు బోసుబాబు. మోటార్ సైకిల్ మీద కూర్చుని చక్కెరకేళి తింటూ.

"మొన్న రేత్రి, సైకిల్మీన ఉషార్గా, సిగరెట్ తాగుతా, అజాంతా వైన్స్‌లో క్వాటర్‌బాటిల్ తెచ్చుకుందావని ఎల్తుంటే రాజీవ్‌గాంధి బొమ్మకాడ టక్మని నా సైకిల్ని ఆపి, నా చేతుల్లోంచి గుంజేసి, రోడ్డు అంచుకు లాక్కుపోయి నిలబెట్టేశారు నేను బిత్తరపోయా. నాలా శానామంది దేబెమొహాలేసుకుని నిల

బడివున్నారు. చానా సైకిళ్లు నిలబడివుం డాయ్"

"ఓరి ఎర్రినా కొడకా. ఆ రోడ్‌మీన ఎదు రెళ్ల కూడదురా. వన్‌వేరా బిడ్డా. నీవు మందు ఉషార్మీన సైకిలెక్కి పోతుండావ్. చీకట్లో ఆ మూల పోలీసోళ్లు కాసేశారు. పట్టేశారు" బోసుబాబు నవ్వి మరో చక్కెర కేళీ సగంమింగాడు.

"అవునంట. సరే ఏం చేత్తాం. అందరం రకరకాలుగా బతిమాలేం దేబిరించాం. చేతులు గడ్డాలు పట్టినా పోలీసోళ్లకి దయ గల్గలా. యస్సై మోటార్ సైకిల్మీనకూకుని "రేపొద్దున తలా పదిరూపాయలు తీసుకుని కోర్టుకాడికి రండోయ్" అన్నాడు. మా పేర్లు రాసుకుని సైకిళ్లని రిక్షాలో అడ్డంగా గుట్టగా పడేసుకుని పోలీస్ హెడ్ సైకిలెక్కిపో యాడు. మేవంతా కాళ్లీడ్చుకుంటూ వచ్చేశాం. నాకు చాలా కోపం కచ్చవచ్చింది వాళ్లమీద."

"ఏంఎందుకు లాకప్‌లో తొయ్యలేదనా? "

"మేం ఏం చేశామ్? దగ్గర దోవని ఎదు రునడిపాం. అంతమాత్రానికే మమ్మల్ని కోర్టుపాల్చెయ్యటవేనా. సరే నేను నిన్న బండెడు సరుకు మా చిన్నోడి కప్పగించి కోర్టుకెళ్లి పడుకాపులు కాసే. తీరా సాయంత్రం నాలుగు గంటలకు పదిరూపా యలు జరిమానా చెల్లించి బయటపడ్డా. నిన్నల్లా నాక తిక్క తిక్కగానే వుందిగురు గారూ"

"అందుకనేరా, జనానికి ఉషార్ పుట్టించ టానికే కల్లుదుకాణాలు బ్రాందీషాపులు పెట్టింది ప్రభుత్వం"

"అవన్నీ మీబోటిలచ్చాధికార్లకు నెలజీతా లోళ్లకు లయాకిగాని మాబోటి పూటకు గతి లేనోళ్లకి కాదు. ఐనా మేమే ఎగబడిపో తుండాం. ఇంటికాడ కుండలు దొర్లాడు తుండా"

"మేమూ గోల్మాలైపోతున్నాంరా. అలవా టుపడ్డాం. అల్లాడి చస్తున్నాం. మేం గుమ్మ డికాయల్లాగా కుళ్లి చస్తున్నాం. మీరు తాలు ఏర్సెనగకాయల్లాగా ఎండిపోతున్నారు. భికారి మూకల్లాగా తయారుచేసింది ప్రభుత్వం"

"ప్రెభుత్వంలో గొప్ప గొప్ప ఆఫీసర్లు మంత్రులు ఏలుతున్నారుగా బాబు, మన మంచిసెబ్బర్లు వాళ్లకామాత్రం తెల్వదా"

"పాపం, ఆఫీసర్లు మంత్రులు నికార్సైన సరుకు గాదు. వాళ్లు తయారుచేసిన పథ కాలు, వాళ్ళనుకున్నట్లు పండవు. చూస్తుండ గానే తారుమారై తల్లకిందులైపోతాయి. పండినా, వాటినిండా పురుగులు, లుకలుక లాడుతుంటాయి. ఇప్పుడు చూడు కొన్ని లక్షలమందిని తయారుచేసింది తాగుబో తులుగా పాతికేళ్లనుంచి బ్రాంది షాపులు బార్‌లు తామరతంపర్లుగా పాకిపోయాయి. గ్రామగ్రామాన సారాపొట్లాల ట్రేలతో నిండిన జీప్‌లు, వాన్‌లు వీరవిహారం చేశాయి. జనంలో భయంకరమైన మార్పులు వచ్చాయి. కొన్ని లక్షల కుటుం బాల్లో అగ్నిపర్వతాలు బ్రద్దలై సంసారాలను మాడ్చిమసి చేశాయి"

భలే విషయం చెప్పారు గురూ. మన కుర్రనాయాళ్ళకి, కల్లు సరేననుకోండి. పొద్దుకూకంగానే క్వార్టర్‌బాటిలు ఏసుకో పోతే పిచ్చెక్కినట్టుంటది. నా మట్టసానికి నేనుఅలవాటుపడ్డా గురు. మా కుర్రోళ్లంతా అలవాటుపడ్డారు. సంపాదనలో సగం ఇవే పీల్చేస్తుంటాయి గురుగారు. పోలీసుబా బులు గూడా బాటిల్ ఇస్తే సర్దాగా మాట్లా డతారు. మేం పొద్దస్తమానం ఎండా, గాలిలో, దుమ్ములో నిలబడి మా బతుకు తెరువు ఏదో యిట్టా చౌకబారుపనుల్లో చూసుకుంటుండాం. మాకు కూసింత చదువు కూడా లేకపోయే. ఏ నౌకరీకి పనికి రాముగదా. పెళ్లాంపిల్లల్ని బతికించుకో





వాల, సైగా ఈ అలవాట్లు! పేకాట, ముండల మురాకోరుతనం మ్పి ఏందోలే"

"నీకేంబే. బాగా సంపాదిస్తున్నావంట. చేతికి ఉంగరాలు. రెండొందల రూపాయల ప్యాంట్. నూటయాభై చేసే షర్టు, కమ్మంగా తాగుతున్నావంట. బీకాం, యంకామ్ చదివినా ట్యూటోరియల్ కాలేజీలో ఆరొందలు రావు. నీవు రోజుకు యాభై రూపాయలు సంపాదిస్తున్నావ్"

"మీరెన్నైనా సెప్పండి. మాదేవుంది కాకుల్లాగా. బజార్లమీద అరుస్తా, పైసలేరుకుని బతకుతావుండాం" అంటూనే దూరంగా దేన్నో చూస్తూ ఆగిపోయాడు గోపీ. క్షణం తర్వాత అతని మొహంలో మందహాసం వెలిగింది.

షిఫాన్ నల్లచీరె, తెల్లజాకెట్‌లో ముస్తాబై చేతిలో ఆకుపచ్చ ప్లాస్టిక్ బుట్టతో కతీజా మెరుపుతీగలా గోపి దగ్గరకొచ్చింది.

గోపీ ముసిముసి నవ్వులు నవ్వుతూ చెకచెకా డజన్ చక్కెరకేళిలు, రెండు పొడవాటి ద్రాక్షగుత్తులు ప్లాస్టిక్ బుట్టలో జాగ్రత్తచేసి జుట్టుని ఎడంచేత్తో ఎగతోసుకున్నాడు.

కతీజా సైగ చేయగానే గోపి పక్కనున్న బండివైపు చూసి "ఒరే రంగా సూస్తుండు. ఐదునిమిషాల్లో వస్తా" అని బోస్‌వంక గర్వంగా చూసి "ఏవనుకోమాక గురూ" అంటూ కేష్ పెట్లో నోట్లని తీసుకుని పేంట్‌జేబులో కుక్కుకుని కతీజాని వెంబడించాడు.

రంగడు "చూశావ్‌గా అన్నాయ్. ఇదీ వీడి వరస. వీడ్ని పిండేస్తున్నది" అన్నాడు.

బోస్ ఆశ్చర్యపోతూ, "కతీజా వల్లో పడ్డాడాయీ పిచ్చినాయాలూ" అని నవ్వేడు.

"ఇది తమరి లిస్టులో గూడా వుందా ఏం? "

"దీన్ని జనవరి పస్టుకు తోటల్లోకి తీసికెళ్ళి రికార్డు డాన్సులు చేయించాం. ఐదారేళ్ళకిందట మా కాలేజీ స్టాఫ్ వనభోజనాలకు దీంతోపాటు రాణిని, బేబిని తీసికెళ్ళి మందుపార్టీ ఖుషిచేసేవాళ్ళం. నన్ను చూసి తలవంచుకునెళ్లిపోయింది చూశావా" బోస్ తన రసికతను అహంతో, రంగరించి నవ్వుతూ అన్నాడు.

"దీనికి మొగుడు మొద్దులు లేరా అన్నాయ్"

"పదేళ్లనాడే వదిలేసింది. చీరాల, చిలకలూరుపేట తిరగమరిగింది. తర్వాత పోలీస్ కాశీంగాడు తగుల్కొని, దీనిచేత కంపెని రన్‌చేస్తూ పై సంపాదనలో పడ్డాడు"

"అబ్బో బెమ్మాండమైన సంగతి చెప్పావ్ గురూ వింటుంటే కళ్ళు తిరిగిపోతున్నాయి"

"ఎందుకుబే నీకు కళ్ళు తిరిగేది. సెకండ్ షోలు చూసి చూసి కళ్లు తిరుగుతున్నాయా? " గోపి బండి దగ్గరకు వచ్చేస్తూ అందుకున్నాడు. అతని కళ్ళలో గర్వం, నడకలో ఠీవి గమనించారిద్దరూ.

ఇంతలో స్పీడ్‌గా కారు వచ్చి గోపి బండి సమీపంలో ఆగింది. శీను డ్రైవర్ సీట్లోంచి దిగి గోపిని చూసి నవ్వి, బోసుబాబుకు నమస్కారం పెట్టి ద్రాక్షపళ్ల నాణ్యాన్ని పరిశీలిస్తూ, "ఎంత బే గోపిగా కిలో" రౌడీ తరహాలో అడిగాడు.

"ఏందోయ్ బామ్మర్ది కిలో ఇరవైకాడికి తీసుకో. తొందరగా కానీయ్. బీట్‌కానిస్టేబుల్ నీ కారు రాంగ్‌సైడ్లో నిలిపావని కేసు రాస్తాడుబే"

"నా కార్ నెంబర్ రాసుకునే ఖలేజా ఈ టౌన్లో ఏ బీటోడికి లేదుబే సాలె"

"యం. యల్. ఏగారి అబ్బాయివా, యం. పి. గారి కొడుకువా? "

"వాళ్ళే కాదుబే. పవర్‌గలోళ్లు పోలీస్ సూపరిండెంటుగారి వైఫ్‌ని యీ కార్లో తీసి

కెళ్ళి దిగబెట్టి రావాల నేను. మా ఓనర్ గార్కి చుట్టం"

"ఐతే పెద్ద లెవలోళ్ల దగ్గర చాన్సు కొట్టే శావన్నమాటే"

"మరేందనుకున్నావ్‌రా శీనంటే. సరేగానీ మంచిద్రాక్ష రెండు కేజీలు, రెండు డజన్ల కేళి తొందరగా పోవాల అర్జంట్, ఐదు నిమిషాల్లో తెత్తానని వచ్చా"

"బోసుబాబు కుతూహలంగా "ఎవర్దిరా శీను ఈ కారు" అడిగాడు.

"లక్ష్మీపురంలో జానకమ్మగార్ది"

"కారు మైన్‌టేన్ చేస్తుందట్రా ఆవిడ"

"బాడుగలకు గూడా తిరుగుతుందిబండీ"

"ఐతే ఆవెడ్తో పనివుందోయ్. ఎప్పుడు కాళీగా వుంటుంది?" వాకబ్ మొదలుపె ట్టాడు బోస్.

"పొద్దుగల తీరిగ్గా వుంటుందన్నాయ్"

"ఆవిడ కూతుళ్ళిద్దరూ ఇంటి దగ్గరే వున్నారా. మద్రాస్‌లో మకాం పెట్టారా నా స్టూడెంట్సులే వాళ్ళిద్దరు"

"ఈడేవున్నారన్నాయ్."

గోపి వెకిలిగా నవ్వుతూ "భలే చాన్సు కొట్టేశావురా బామర్దీ. చిన్నదాన్ని తగులు కున్నావా? పెద్దదాన్నా. మొన్న సినిమా హాలు కాడ సూశా. మీ అమ్మగార్ని కూతు ళ్లని. గుర్రాల్లాగున్నాయి" అని పేలేడు.

"ఒరే బేవార్స్ నా కొడకా. పిచ్చి పిచ్చిగా వాగమాక, ఎదర గోడమీద అచ్చరాలు చదువు" శీను గాటుగా అన్నాడు.

"స్త్రీ మొగాడి విలాసవస్తువు కాదు. కామ యంత్రం కాదు. కామబానిస కారాదు. చెల్లీ బందూకందుకో" అని మార్కెట్ గోడమీద ఎర్రక్షరాలు కొట్టవచ్చినట్లు కనిపించాయి.

"ఓయబ్బో... వీడు పండిపోయాడే. ఓరి నాయనో శీనుగా" గోపి వెకిలిగా నవ్వి తన అల్పత్వాన్ని కప్పేసుకున్నాడు.

శీను కొత్త వంద రూపాయల కాయితం అందించాడు.

గోపి యాభై రూపాయలు పాత నోట్లు ఇచ్చాడు.

శీను మళ్ళీ బోస్‌కు నమస్కారం పెట్టి "వస్తాన్రా గోపి" అని కారు ఎక్కి బాణం లాగా దూసుకుపోయాడు.

"వీడి చెల్లెల్నేరా నాకిస్తానని వీడిబాబు తిరుగుతున్నాడురంగా, వీడి చెల్లెలు శ్రీదేవి న్నట్టుంటదిరా"

"చేసుకున్నావా, నీసావు శీనుగాడి చేతిలో మూడిందే. నీ లుచ్చావేషాలు వాళ్ళకి తెల్సి నయా నీవ్ ఫినిష్"

"నిజవే. ఆ పాలేం వోళ్లు కసాయిమంద. వాళ్ళతో పెట్టుకోకూడదు. వీడు మొన్నటి దాకా పేడకళ్లు తీస్తా, లుంగి కట్టుకుని పాల చెంబులు చేరేసేవాడు. కారు నడపటం తెల్సుకుని తెల్లపైజామా, లాల్చీలో జల్సాగా మిడ్సిపడుతుంటాడు చూసినావా మనం లేబర్ మూకలం. మన బతుకులు రోడ్లపా లైనాయ్"

"ఎదుటోడు పచ్చగున్నాడని ఏడ్వబాక లుచ్చా నాయాల" అని రంగడు గోపిని కసురుకున్నాడు.

దూరంనుంచి కేకలు వినిపించాయి. బోసుబాబు బయలుదేరేవాడల్లా ఆగిపో యాడు. ఎదురుగా సైకిళ్లమీద నీలంరంగు జండాలు పెట్టుకుని నినాదాలు చేస్తూ ఊరే గింపు రావటం గమనించాడు.

"కొత్త పార్టీ లేచిందా గురుగారు" గోపి అడిగాడు బోసును.

"అట్టడుగు జనం 3600 కులాల బలంతో బయల్దేరిందోయ్. ఇందులో మనం చేరా చ్చురా, గోపీ"

"తెలుగుదేశం బస్సులు, లారీలు కిటకిట





లాడుతుంటాయి. కాంగ్రెసు వాళ్లవీ కిటకిటలా డుతుండాయ్ మరి"

"మరే, దేంట్లోను సందులేదు"

"ఇరుక్కోవటమే, దూరటమే" గోపి నవ్వుతూ అన్నాడు.

"గిట్టకపోతే దూకెయ్యటమే" బోసు దర్పంగా అన్నాడు.

"భలే అన్నావు అన్నాయ్"

"బయట మరో పార్టీలోకి దూకెయ్యటమే! పెద్ద పెద్ద నాయకులే హైజంపులు, లాంగ్ జంపులు, పోల్ జంప్స్ చేస్తున్నారు తంబ్రీ!" బోస్‌బాబు మోటార్ సైకిల్ని స్టార్ట్ చేస్తూ అన్నాడు.

"బ్రెమ్మాండంగా చెప్పావ్ గురు! మనదే వుంది ఓటేస్తే యాస్తాం, లేదూ మానేస్తాం. మనిష్టం. మనకులపోడికే గుద్దుతం, అంతే'

అంతే అనేసి బోసు వెళ్లిపోయేవాడల్లా మోటార్ సైకిల్ను ఆపేడు. అడ్డొచ్చిన వ్యక్తిని చూసి, "బ్రదరో! ప్రెకాశమా జనం ఎనకాల నడవటం ఏం బాగా లేదోయ్! ముందుండి నడవాల్సినోడివి..." అన్నాడు.

"యాడ నడిస్తేనేం బోస్‌గారూ. మా ఆవే దన, ఆలోచన, మా చైతన్యం జనానికి తెలి యపరుస్తున్నాం అంతే" అన్నాడు బాగా అలిసిపోయిన ప్రకాశం.

"అధ్సరేలే బ్రెదరో! నీ లెవలేంది ఈ పార్టీలో? "

గోపీ కలగచేసుకుని "పాకహోటల్ సైకిల్ డాక్టర్ లెవలూ రోడ్‌మీన పళ్లమ్ము కునే నాలెవలు ఎన్ని కొత్తపార్టీలు వచ్చినా పెరగటంలే గురూగారు" అనగానే అంతా నవ్వేరు.

ప్రకాశం నవ్వకుండా "ముందు జనంలో చైతన్యం కల్గించాల. ప్రజల్ని మేల్కొలిపితే వాళ్లలోనే జ్వాలరేగుద్ది. అగ్రకులాల రాజకీ యపెత్తనం, దోపిడి నుంచి జనాన్ని తప్పించి బహుజనుల రాజకీయమే మన ధ్యేయం. కల్సి వచ్చేవాళ్లందర్నీ కల్పుకుపో తామ్" అని పడికట్టు మాటలు గుప్పిం చాడు.

బోస్ నవ్వాపి "చాలా ఏళ్లనుంచి చాలా మంది అంటానేవున్నారు, వింటానే వున్నాం!" అన్నాడు.

"మనచుట్టూ ప్యూడలిజం బతికేవుంది బోస్‌గారూ! వర్ణవ్యవస్థనూ, కులవ్యవస్థను మనం నాశనం చేయాలి. సామాజిక విప్లవం దళితుల మనస్సులోంచి పుట్టిన ప్పుడే రాజకీయ విప్లవం వస్తది. నేనె ల్తున్నా. మావోళ్లు చాలాదూరం పోయి వుంటారు. ఊరేగింపులో కలవాల. సాయం కాలం హైస్కూల్ గ్రౌండ్‌లో మీటింగ్! మీరంతా రండి" అని సైకిలెక్కి ప్రకాశం ముందుకెళ్లాడోలేదో "నీకర్థమైందంట్రా ఈయన స్పీచ్" అడిగాడు బోస్ మోటార్ సైకిల్ స్టార్టు చేసి.

"మ్చ్" అని పెదవి విరిచారంతా. "ఐతే మీరిట్టాగే చావండి" అనేసి రాష్‌గా వెళ్లిపో యాడు బోస్.

* * *

జానకమ్మ వరండాలో కుర్చీలో కూచుని రోజా మొక్కలకు పరిచర్యలు చేసే కూతు ళ్లని మురిపెంగా చూస్తూ మురిసిపోతుం డగా ఇనపగేటు దగ్గర మోటార్ సైకిల్ ఆగింది.

ఆ వచ్చేదెవరో సుమిత్ర ఊహించింది. తనకు మోటారు సైకిల్ నేర్పిన కెమిస్ట్రీ లెక్చరర్ బోసుబాబుగారై ఉంటారనుకుంది. తల్లితో ఆ మాటే అంది కూడా. 'హల్లో' అంటూ బోసుబాబు రానేవచ్చాడు. తనతో పాటు మరో యువకుణ్ని వెంటపెట్టుకొచ్చే

ప్పటికి ఆడంగులు కొంచెం సిగ్గు నటిస్తూ లేచి నిల్చున్నారు.

జానకమ్మ "కూర్చోండి" అని కుర్చీ చూపించింది.

"ఫర్వాలేదు. మీరు కూర్చోండి మేడమ్" అని కుడిచేయి చాపి బోసుబాబు నమ్రత నటించి కూర్చున్నాడు.

లేత యువకుడు, తన కుడి భుజానికి తగిలించుకున్న కమేరాను వళ్లోకి సర్దుకుని సుమిత్రను, కళ్యాణిని మెరుపు చూపు చూసి, జానకమ్మను మామూలుగా ప్రశాంతంగా చూసి పెళ్లికొడుకు ఫోజులో మౌనం వహించాడు.

బోసుబాబు చేతిలోని టిక్కెట్టు పుస్తకాలను నిమురుతూ, జానకమ్మను నవ్వుతూ చూస్తూ అన్నాడు, "మేం టౌన్లో రసమంజరి అనే సంస్థను స్థాపించబోతున్నాం. కళాకారులను ఆహ్వానించాం. అంతా వస్తామన్నారు'

"ఎవరెవర్ని..." అంది మాటకడ్డొచ్చి సుమిత్ర.

"బాలమురళిని, బాలసుబ్రమణ్యాన్ని, చిట్టిబాబుని, శోభానాయుడ్ని, ఇట్లా వారం రోజులపాటు గొప్ప కళాకారులంతా వచ్చి తమ కళను ప్రదర్శించి మనల్ని పరవశంలో ముంచి తేల్చిపోతారు. మేం కళాభిమానుల్ను విడివిడిగా కల్సుకుని వారి సహకారం కోసం తిరుగుతున్నాం. వంద, యాభై, పాతిక, పది రూపాయల చొప్పున ప్రదర్శనల రేట్లు నిర్ణయించాం. మిమ్మల్ని అర్థించటానికొచ్చాం"

"పాతిక రూపాయల టికెట్లు మూడివ్వండి" అంది సుమిత్ర.

"వంద రూపాయల టిక్కెట్లు తీసుకుని ముందుకూర్చోవల్సిన మీకు పాతిక రూపాయలవిస్తానా" అని పకపకా నవ్వేశాడు బోసు.

"కాదులెండి! యాభై ఇవ్వండి పోనీ" జానకమ్మ నవ్వుతూ అంది.

"కాదు మేడమ్ వందవి తీసుకోవాల్సిందే! ఎందుకు చెప్తున్నానంటే మీకు కళారంగంలో పైకి రావాలనే కాంక్షవుంది. స్టేజి పరిసరాలు ఏరకంగా వుంటాయో! దగ్గరగా కూర్చుని స్టడీ చెయ్యాలి మీరు. తప్పదు. ఇంత మంచి అవకాశం మీకు మళ్లీ యిప్పట్లో దొరకదు. మీ సుమిత్ర సినిమా స్టార్‌గా రాణించాలనే నా ఆకాంక్ష, మీ ఆకాంక్షానూ.."

జానకమ్మ నవ్వుతూ, "అంత అదృష్టమా మాకు. అంతలేదు, మీకు తెల్సుగా మా తాహతూ" అని సుమిత్రతో "కాఫీ పట్రామ్మా" అంది.

కోటలో సీటు సంపాదించేసినట్లుగా సంతోషించాడు బోసుబాబు. సగం జయించేశా మిగతా సగం కూడా పూర్తిచేసేద్దాం అని తలపోసి "వీడు నా మేనల్లుడు మద్రాస్‌లో కెమేరామెన్‌గా తరిఫీదౌతున్నాడు. రాత్రే వచ్చాడు. పేరు బెనర్జి"

"అట్లానా చాలా సంతోషం" అంది జానకమ్మ.

"వీరి పెద్దమ్మాయే సుమిత్ర. మా కాలేజీలో పోయిన సంవత్సరం యానివర్సరీకి డ్యాన్సుప్రోగ్రాం కూడా జరిపించాం. సుమిత్ర పెర్ఫార్మెన్సెస్ బ్రహ్మాండంగా వున్నాయి. ఇంత టేలెంట్సుగల అమ్మాయ్‌ని సినీఫీల్డుకు అంకితమివ్వాలని నేను చెప్తూనే వున్నారా! వీరు ఇంకా తటపటాయిస్తున్నారు" అని మేనల్లుడికి తెలియజేసి జానకమ్మను తబ్బిబ్బులు చేశాడు.

"మీ పరిచయం ఈ రోజున కావటంతో నా జన్మ తరించింది" అన్నాడు బెనర్జి సుమిత్ర అందిస్తున్న కాఫీకప్పు అందుకుంటూ.





సుమిత్ర సిగ్గుతో మొగ్గై అతనికెదురుగా కూర్చుని కాఫీ తాగుతూ తన సౌందర్యాన్ని, కళ్లతో తాగెయ్యటానికి బెనర్జీకి అవకాశం కలిగించింది.

జానకమ్మ మూడు కొత్త వంద రూపా యలనోట్లని బోసుకందించి, త్వరలో తాము కళా స్రవంతిలో మునకలెయ్యటానికి ఛాన్సును రిజర్వు చేసుకుంది.

జానకమ్మకు కుమార్తెలద్వారా ఐశ్వర్యవం తురాలు కావాలనే కాంక్ష ఈమధ్యనుంచే కొత్తగా కలిగింది.

లారీ, టాక్సీ పాతవైపోతున్నాయి. రాఘ వుగాపు సాంగత్యం చాలా బోర్‌గా వుంటోంది.

ఈ టౌను, స్నేహితులు, పరిచయస్థులను తల్చుకుంటేనే రోతగా వుంది.

బోసుబాబు జానకమ్మకు టిక్కెట్లు అంట కట్టి ఉత్సాహంగా లేచి నవ్వుతూ "వస్తా మండీ జానకమ్మగారూ" అని వరండా మెట్లు ఉషారుగా, తొందరగా దిగిపోతుం డగా ఆవిడ "అప్పుడప్పుడూ వస్తుండండి" అంది.

బెనర్జి, కళ్లతోనే వాళ్ల దగ్గర వీడ్కోలు అందుకుని వచ్చేశాడు.

★ ★ ★

కొందరు యువకులకు నాయకత్వం లేకపో వటం పేదరికంకన్నా, నిరుద్యోగంకన్నా బాధాకరమైన సమస్య.

బోసుబాబుకు పేదరికపు బాధలు తెలి యవు. ఒకటో నంబర్ భూస్వాముల కుటుంబం కాకపోయినా తిలక్‌గారి పెద్ద కొడుకు. యం. యస్. సి, పాస్‌కాగానే ఛైర్మ న్‌గా ఆఖరి వెలుగు వెలిగిపోతున్న తిలక్, తను పుట్టి పెరిగిన టౌన్ కాలేజీలో ఉద్యో గంలోకి యిరికించాడు.

అంతదాకా బోసుబాబు జీవితం అమ్మా నాన్నల సందిట్లో పకడ్బందుగానే గడిపే శాడు. తాను కావాలనుకున్నవి సాధిస్తున్నా నని, తను చాలా ఉన్నతమైన జీవితం గడ పబోతున్నానని తెల్సుకుని సంతృప్తిపడ్డాడు.

బోసుబాబు యం. యస్‌సి పాసుకాగానే మిత్రులంతా విస్కీ పార్టీ చేసుకున్నారు.

మరో స్నేహితుడు అమెరికా వెళ్తూ పార్టీ ఇచ్చాడు. ఇంకో స్నేహితుడి వివాహ సంద ర్భంగా స్నేహితులంతా వళ్లు తెలియకుండా తాగేశారు.

ఈ రకం మరుపురాని అనుభవాలకోసం తపించి పోవటంలో ఆనందం కనిపిం చింది. బోసుకు ఉద్యోగపు మొదటి జీతంను అమ్మకు పట్టుచీరె, భార్యకి షిఫాన్ చీరె, స్నేహితులకి కాక్‌టైల్ పార్టీలకి సర్దే శాడు. అతను చేసిన ఖర్చుకు సంతృప్తిపడి వంశోద్ధారకుడవైనావని అమ్మ, తాగుడు ముఠాకు కొత్త యువనాయకుడవైనావని మిత్రులు ఆనందబాష్పాలు రాల్చారు.

తర్వాత్తర్వాత నిత్య జీవితంలో సంభ వించే ప్రతి కొత్త సంఘటనకు స్పందించటా నికీ హర్షామోదాలు తెలియచేయటానికీ భరించలేని ఆనందాలను వెల్లడించడానికీ ఉత్సాహంతో పరవళ్లు తొక్కటానికీ తాగటం తప్పనిసరి ఘనకార్యమై కూర్చుంది.

తన తండ్రి మీద అవిశ్వాస తీర్మానం ఓడి, రెండోసారి ఛైర్మన్‌గా ఎన్నికైనప్పుడు బోసు బృందం బరితెగించి మున్సిపల్ ఆవ రణలోనే మందుకొట్టి మైమరచిపోయారు. పార్లమెంటు ఎన్నికలు, అసెంబ్లీ ఎన్నికల్లో ధ్యాసెక్కువగా లిక్కర్‌సీసాల మీదే వుండేది.

బోసుబాబు టౌన్లో గుర్తింపులోకి వచ్చి యువనాయకుడుగా పేరు ప్రఖ్యాతులకోసం, నాయకత్వం కోసం జోరెక్కువ చేశాడు.

కాలేజీ లెక్చరర్ కాగానే కుల నాయక

త్యాన్ని చాలా చొరవతో గుంజుకుని, తన కులపోణ్ణే కాలేజీ ప్రెసిడెంటుగా నెగ్గించి, బయట మాజీ విద్యార్థి యోధులకు పనికల్పించి రౌడీ పోషణ ప్రారంభించాడు. తిలక్‌గారికి తగ్గ కొడుకనిపించుకుని ఆ శక్తితో ట్రేడు యూనియన్ రాజకీయాల్లోకి చొచ్చుకొచ్చేశాడు. రాజకీయ తుపానులవల్ల కొందరు సమర్థులు నేలకరుచుకుపోతారు. అణచివేయబడ్డారు. కొత్తకొత్త చిత్రవిచిత్ర పరిస్థితులు తలయెత్తగానే యోగ్యతలేని వాళ్లు చాలా రంగాల్లో అందలమెక్కి కూర్చుని విర్రవీగటం జరుగుతుంది. బోసుబాబులాంటివాళ్లను చూడగానే ఇది నిజమేననిపిస్తుంది. బోసుబాబుకి పడే కష్టంకంటే ఫలితం అధికంగా వచ్చే పేరు ప్రఖ్యాతుల మీద మోజెక్కువ. జీవితంలో పైకి రావటానికై దగ్గర దోవలు, నిచ్చెనలు, అడ్డదోవలు కనిపెట్టటంలో చాకచక్యం ఏర్పడింది.

చాలా మెళుకువలతో, చిరునవ్వులతో, భుజాలమీద చేతులతో తాలుకా ఆఫీసు ఆవరణలో వుండే కచేరీలను, పోలీస్ స్టేషన్ను, ఎగ్రికల్చరల్ డిమానిస్ట్రేషన్ వారి కార్యాలయాన్ని, నీటిపారుదల శాఖ, మున్సిపల్ ఆఫీసు, అటవీశాఖ వగైరాలలో మంచి పరపతి సంపాదించేడు. తృణమో పణమో ముట్టచెప్పి, తనూ కాస్త ఎంగిలిపడి ప్రజలకు, ఆఫీసులకు వారధిలా బిగిసిపోతున్నాడు.

మాజీ చైర్మన్ తిలక్ ఆరిపోతున్న దశకొచ్చాడని చాలామంది అభిప్రాయం.

ఇహ నాన్న వెనకటి ఆధిపత్యం తిరిగి సంపాదించలేడని బోసుబాబు నిశ్చితాభిప్రాయానికొచ్చి చాలాకాలమైంది.

మొదట్లో నిస్పృహలోపడి కొంతకాలం ఉదాసీనంగా భగవద్గీత కేసెట్టు వింటూ బ్రాందీ కాస్తకాస్త గుటకేస్తూ సిగరెట్లు వూదేస్తూ అడపాతడపా అరుణతో కీచులాడుతూ రాత్రిపూట చాలాకాలం, బార్లనీలి లైట్ల కాంతిలో ఫ్రెండ్స్‌తో కూర్చుని విస్కీ సేవిస్తూ కాలహరణం చేశాడు.

పగలు లెక్చరర్ గెటప్‌లో మోటార్ సైకిల్మీద బోసుబాబు బయలుదేరితే ఎదురైన చాలామంది నమస్కారాలు పెడ్తూ, సెల్యూట్ చేస్తూ చిరునవ్వుల్తో హల్లో అంటూ బాస్, గురు, అన్నా! అని ఆప్యాయంగా గౌరవిస్తుంటే బోసుబాబు సంభ్రమాశ్చర్యాల్లో తబ్బిబ్బులైపోయేవాడు.

చాలా చిత్రంగా వుంది తనకు. ఇంట్లో ఈసడింపుల వేడి సెగలు, బయట గౌరవ మర్యాద మందహాస చంద్రికలు... అనిపించి తను ఇంతకంటే ఘరానాగా, పలుకుబడి పెంచుకుని నాన్నగారి రాజకీయ జ్యోతి కొడికట్టకముందే తన రాజకీయ జ్యోతిని వెలిగించుకోవాలనే దృఢసంకల్పం గలిగింది.

అరుణ ఇంట్లోంచి వెళ్లిపోయినందువల్ల గల్గిన ఆవేదన ఆరునెల్ల తర్వాత చల్లారిపోయింది.

ప్రస్తుతం టౌన్లో కళారంగం, కళాకాంతులు లేక వెలవెలా పోతున్న విషయం కొందరి కళా హృదయులకు కలలో కనిపించి విలపించింది. చాలామందికి దిక్కుతోచక దిగులుపడి క్లబ్‌లలో చేరి పేకాటల్లో మునిగిపోయారు. కొందరు తాగిన మత్తులోంచి బద్ధకం వదిలించుకోలేకపోయారు.

నాయకత్వం వహించటానికి ఆరాటపడుతున్న బోసుబాబు వాళ్ల ఆలోచనల్ను గౌరవించి నాయకత్వం వహించి వెంటనే టౌన్‌హాలు ఆరుబయలు థియేటర్ని అభివృద్ధిలోకి తెస్తాననీ గొప్ప కళాకారులను రప్పించి మీ తీరని కోర్కెలు తీరుస్తానని హామీ ఇచ్చాడు.

ఈ ఘనకార్యాలన్నింటికి డబ్బు చాలా అవసరం గనుక గొప్పవారి పేర్లుచెప్పి టిక్కెట్లు అంటకట్టే కార్యక్రమం చేపట్టేడు.





జానకమ్మ గారింట్లోంచి వచ్చి మోటార్ సైకిల్ మీద సహచరుడు వీడియో కెమేరామెన్ బెనర్జీతో మరో కళాపోషకుడ్ని అన్వేషించటానికి పోతున్నాడు.

జానకమ్మ, వాళ్ళమ్మాయిలు కలల భారంతో అలసిపోతూ కుర్చీలో కూలబడ్డారు.

★ ★ ★

ఉదయం తొమ్మిది గంటలప్పుడు మంగమ్మ దోసెల పిండి గిన్నె ఖాళీకాబోతున్న సమయంలో రిక్షా రోడ్డుమీద ఆగింది.

మంగమ్మ పొయ్యిలో కట్టెలు ఎగతోసి పైటతో కళ్ళు తుడుచుకుని రిక్షాలోంచి దిగిన శాల్తీని చూసి సంభ్రమాశ్చర్యాల్తో నోట మాట రాక గుటకేసింది.

రిక్షా దిగిన చుక్కమ్మ మంగమ్మని చూసి కళకళలాడే తన నగుమోముని విచారవదనంగా క్షణంలో మార్చేసి "మంగమ్మక్కాయ్!" అని కన్నీళ్లు పెట్టుకుంది.

మంగమ్మ పొయ్యిలో కట్టెలు లాగేసి దోసె తీసేసి గబ్బుక్కున లేచి నులక మంచం రోడ్ మార్జిన్లో వాల్చి గుడ్లప్పగించి చూస్తూ నిల్చుంది.

చుక్కమ్మ అమాంతం మంగమ్మని వాటేసుకుని వీపు నిమిరింది. మంగమ్మ బావురుమని ఏడ్వసాగింది తన దరిద్రాన్ని తల్చుకుని.

"చా యాడ్వమాక. కష్టాలు మనుష్యులకి రాక మానులకొస్తాయా! అంది చుక్కమ్మ

"కూర్చోముంగల ఎప్పుడొచ్చావ్ పట్నం నుంచి" అని అడిగింది మంగమ్మ

"వచ్చీ వారం అయిందే. యాడా తీరికలే క్షణంగూడా. ఇల్లు హోల్మొత్తం రీ మాడల్లో కట్టిత్తుండాగా వత్తాపోతుంటాన్లే" అని దర్పంగా చెప్పింది చుక్కమ్మ.

"అట్నా" అని చాలా అణకువగా వినయంతో మంగమ్మ శ్రద్ధగా ఆమెను చూసింది.

పదిహేనేళ్ల క్రిందట మంగమ్మ పెంకుటింట్లో కాపురం చేస్తున్నప్పుడు ఎదురు డాబాలో బ్రోతలు కంపెనీ యజమానురాలుగా వ్యాపారం సాగించిన చుక్కమ్మ యిప్పుడు కంచిపట్టుచీరె కట్టుకుని ఇబ్బందిగా నులకమంచంలో కూర్చుంది.

ఆమెకెదురుగా మాసిపోయి వెల్సిన ముతక చీరెకట్టుకుని కష్టజీవి మంగమ్మ అణకువతో నిల్చుంది.

చుక్కమ్మ నుదుట, పాపిట్లో, గొంతుకిందా ముచ్చటగా మూడు చోట్ల కుంకుమ పెట్టుకుని, బర్మాముడి వేసుకుని, మెళ్లో నెక్లెసు, పలకలసరు, జిగిని గొలుసు ధరించి సినీమాల్లో జమీందారిణిలా ఠీవిగావుంది.

ఆ జమీందారిణి ఇంట్లో అంట్లుతోమే అనాథస్త్రీలాగుంది మంగమ్మ.

డబ్బున్న మొగాళ్లు చుక్కమ్మ వెంటపడి తమ రసికతకు గమ్యస్థానం తెల్సుకుని తృప్తిపడి, ఆమెను సంతోషపర్చి వెళ్తూ వస్తూ వుంటారు.

మంగమ్మేమో తాగుబోతు భర్తకు పత్నీవ్రతం చేస్తూ తన్నులు తింటూ, బూతులు తిట్టించుకుంటూ పేదరికంలో మానసిక శాంతిలేక శవంలా జీవిస్తుంది.

కష్టపడి పొట్టపోసుకుని బతికే మంగమ్మ దరిద్రంతో, దైన్యంగా గొప్ప నేరం చేసినదానిలా చుక్కమ్మ ముందు నిలబడి ప్రాణభిక్ష వేడుకునేదాన్లా మొహం పెట్టింది.

"రామస్వామి ఎనకటి మాదిరిగానే నిన్ను బాధలు పెడ్తున్నాడన్నమాట" అంది చుక్కమ్మ.

"నన్ను చూత్తుండావుగా" మంగమ్మ



సమాధానం చెప్పింది.

"నీ కూతుళ్ల పెళ్లిళ్లయిపోయాయా? "

"అయిపోయినయి తల్లి"

"అల్లుళ్లేం చేస్తున్నారు? "

"పెద్దల్లుడు టాక్సీ సొంతంగా తోలుకుంటావున్నాడు. రెండోవాడు పద్మ మొగుడు లారీ బ్రోకరు. మూడోదాని మొగుడు నాలుగు చక్రాల బండేసుకుని గాజులేపారం ఈ టౌన్లోనే తిరుగుతుంటాడు. నాలుగోది రైస్రాలై నిరుడేలె. అక్కలిళ్ల దగ్గరా, నా కాడా పనిపాట్లు చేస్తావుంటది"

"నాకు పనిపిల్ల అవసరమోయ్ మంగమ్మా. మద్రాసు తీసికెళ్తా. నీ ఎరికలో ఎవ్వరైనా వుంటే చూడు. నాలుగోదాన్ని నాతో పంపరాదూ. అన్నం, టిఫిన్లు, కాఫీలు అన్నీ ఇస్తా. నెలకు రెండొందలిస్తా. చక్కగా చూసుకుంటానే"

మంగమ్మ మౌనం వహించింది.

"నా కాడ రెండేళ్లుంచావంటే ఐదువేలు వస్తాయి. పెళ్లి కర్చుకు సరిపోద్ది. దాని పెళ్లదే చేసుకున్నట్లన్నమాట. అప్పుడు నీకెంత సులువు చిక్కుద్దో చూడు"

మంగమ్మ ఆలోచనలో పడ్డది.

"నా పెద్ద కూతురూ, చిన్న కూతురూ సినీమాలో ఏక్టు చేస్తున్నారుగా. ఎక్కువగా మళయాళీ, అరవం, కన్నడం పిక్చర్లలో మద్రాసులో. మేడ అప్పుడే కొన్నాంగా. బెంగుళూర్లో పెద్దమ్మాయి కట్టించుకుంది. అక్కడ బిల్డింగ్ రిమోడల్ చేయిస్తాను. కంట్రాక్టు ఇచ్చేశా. అప్పుడప్పుడొచ్చి చూసిపోతుంటా. ఎల్లుండెల్లి పోతా. నెలదాకా రాను. నీ చిన్నకూతురు పేరేంటి? "

"దాని పేరు పార్వతి. మంచి పనిమంతురాలు. మొన్నటిదాకా బేంకాఫీసరింట్లో పెట్టా. నెలకి డెబ్బయిఐదిచ్చి, బువ్వ, కాఫీ

అంతా ఆడే. సమస్త పన్లు సేసేది. అయ్యా గార్ని ఈ వూర్నించి బదిలీ సేశారు. పార్వ తిని గూడా తీసికెల్తావన్నారు. నెలకి వంది త్తామన్నారు. ఆ రైస్రాలైన పిల్లని దూరా భారం అంపటానికిష్టంలేక గమ్మునుండి పోయా"

"నాకాడ భద్రంగా వుంటది. చీరెలు, గీరెలు కొనిపెట్తా. నా కూతుళ్లని సూసుకున్నట్లు సూసుకుంటా. ఈడుంటే ఆ గుడిసె కాడికీ గుడ్సెకాడికి తిరగతా అప్పలకి చాకిరి చేసుకోవటమేగదా"

"సరే! దాని పెళ్లి సొమ్ము అదే సంపాదించుకుంటది. నీ కాడుంటే నాకాడున్నట్టే. నీ సేతులో పెట్టుండా దాన్ని"

"ఐతే పిల్లని బయల్దేరతియ్యి మరి"

"ఆనకెల్లి తీసుకొచ్చి అప్పగిస్తా. పద్మకాడి కెల్లి వారమైంది. యాడకి తీసుకురమ్మంటావ్? తమ్ముడింటికి తీసుకురానా? "

"ఆడకే తీసుకురా. జానకమ్మ కూడా నాతో సర్దాగా వస్తానంది మద్రాసు. ఆమె కూతుళ్లు గూడా గుమ్మటంగా ఏపుగా పెరుగుతున్నార్లే. బాగా డాన్సులేస్తారంటగా."

"అవును. ఇప్పుడే సిల్మాస్టారు లెక్కగున్నారు. ఐతే ఆళ్లని పిల్మీలో ఎక్కిస్తావేంది కత"

"ఆళ్లకి సిన్మా ఫీల్డులోకొచ్చి పడాలనుం. సరే రానీ పరిచయాలు చేస్తా. ఆనక మీ అదృష్టం ఎట్టాగుంటే అట్టా అవుద్దని చెప్పా. సరే వస్తామన్నారు. ఆ పోతా! వచ్చిన పనైంది. స్నేహితురాల్ని చూశా. వస్తా. పిల్లని నా కప్పగించు"

"సాయంకాలానికల్లా వొప్పగిత్తాగా."

చుక్కమ్మ చేతిలోని చిన్న పర్సుతీసి వంద రూపాయలనోటు బలవంతంగా మంగమ్మ చేతిలో పెట్టి "మా అమ్మగా, చీరె

కొను క్కో. కాదనకుండా తీసుకో" అంది.

చుట్టుపక్కల గుడిసెల్లో అమ్మలక్కలంతా చుక్కమ్మ పోకడ చూస్తూ ముక్కిపోతుం

డగా మంగమ్మ, చుక్కమ్మను రిక్షా ఎక్కించి నమస్కారం చేసి పంపించి చాటంత మొహం చేసుకుని తన గుడిసె దగ్గరకొచ్చింది.

★ ★ ★

బోసుబాబు ద్వారా జానకమ్మ ఇంట్లోకి వీసా సంపాదించిన బెనర్జీ తన వీడియో కెమెరా పరపతితో చురుకుగా, మెళుకువగా మసలుకోనారంభించాడు.

అతను సాయంకాలంపూట వచ్చి సినిమా కబుర్లు పురాణకాలక్షేపం చేయందే జానకమ్మకు తోచనిదశకు తీసుకొచ్చాడు.

"నీవేం దిగులు పడమాకక్కాయ్. మన అమ్మాయిల్ని ఫిల్ముఫీల్డులోకి దించే పూచీ నాది. నేను యస్సై ట్రయినింగ్ కెళ్ళేలోగా ఈ వర్కు పూర్తి చేసేస్తాగా" అన్నాడు వరసలు కల్పుతూ.

"ఏంటి యస్సై ట్రయినింగ్ కెళ్తావా! నిజంగానే" సుమిత్ర అతని చేతిలో పుస్తకాల్ని అందుకుంటూ ఆశ్చర్యపోతూ అడిగింది.

"యా"

"ముందు కూర్చో తర్వాత నీ కోతలు మొదలెడుదువుగాని" అంది జానకమ్మ.

"కోతలు కాదే ఈ పుస్తకాలు పోలీస్ ట్రయినింగ్‌కు సంబంధించినవేనే పాపం. ఐనా ఇవ్వన్ని చదివి మెదడులో కెక్కించుకునే టైం లేదనుకుంటా బెనర్జిగార్కి" సుమిత్ర నవ్వకుండా సీరియస్ మొహంపెట్టి అన్నది.

"మరి ఈ కెమేరా సర్దానేం చేస్తావ్ బెనర్జి బాబూ? "

"కొంతకాలం విశ్రాంతి తీసుకుంటున్నా అక్కాయ్"

ఇంతలో వాకిట్లో రిక్షా ఆగింది. దాన్లోంచి ఒక పల్చని వ్యక్తి దిగాడు. అతని వెనకాల, రిక్షా కార్మికుడు రెండు సంచులు నిండా సామాన్లు తెచ్చి గడప దగ్గర పెట్టి, మళ్ళీ వచ్చి బియ్యంమూట తెచ్చిపడేసి కూలి, రామదాస్‌నుంచి తీసికెళ్ళాడు.

"బెనర్జిగారు ఈనా మా నాన్నగారి పెద్ద నాన్న కొడుకు. మాకు పెద్దనాన్నే" అని పరిచయం చేసింది.

బెనర్జీ లేచి చెయ్యి చాపేడు. రామదాస్ చేయి కలిపాడు.

" వీరు కెమేరామన్ పెద్ద నాన్నా. త్వరలో యస్సై ట్రయినింగ్ కెళ్తారట. ఈలోగా మమ్మల్ని సినీఫీల్డులోకి అడుగుపెట్టే సాయం చేస్తారు. "

జానకమ్మ నవ్వి వూరుకుంది. సుమిత్ర లోపలికెళ్ళి ఐదు నిమిషాల్లో ట్రేలో కాఫీ, మంచినీళ్ల గ్లాసులతో వచ్చింది.

రామ్‌దాస్ చనువుగా బెనర్జీతో బాతాఖానికి దిగాడు. మొదట్లో ఎవరీ పక్షీంద్రుడన్నట్లుగా చూసుకున్నారు ఒకర్నొకరు.

పాత సినిమావాళ్ళని గురించి చిత్రవిచిత్రమైన సంగతులు రాందాస్, కాఫీ తాగుతూ రెట్టించిన ఉత్సాహంతో నేటి సినీఅగ్రతారల్ను గురించి బెనర్జీ అనర్గళంగా మాట్లాడుకుంటున్నారు.

జానకమ్మ పూలదండలు దేవుళ్ల పటాలకు వేసి, సినిమా ప్రపంచంలో, ఈ కబుర్లు చెప్పే మొగవాళ్ల సహాయంతోనైనా పాదం మోపాలనే ఆకాంక్ష తీరాలని ప్రార్థించి, టి.వి. రూంలో కూతుళ్ల దగ్గరికి వెళ్లింది.

జానకమ్మ వెళ్లగానే అసలు విషయం రాందాసుతో చెప్పాడు. పదిరోజుల తర్వాత ఇక్కడో కొత్త సినిమా పాట ప్రారంభోత్సవం జరుగుతుంది. ఆ సందర్భంలో





సినీజీవులు తనకు తెల్సినవాళ్లు వస్తారట. షూటింగ్స్ కోసం వాళ్లు ఈ ప్రాంతంలో అందమైన ప్రదేశాలను, పరిసరాల్ను పరిశీలిస్తార్ట. పనిలోపనిగా సుమిత్రని కళ్యాణిని వాళ్ళకి పరిచయం చేస్తాట్ట.

"చాలా బావుంది మీ సంకల్పం"

"మీరుంటారుగా అప్పటిదాకా"

"ఆ ఇక్కడే వుంటా. నా స్నేహితులు రైస్ మిల్లు లీజ్‌కు తీసుకున్నారు. నాకు పదిపైసల వాటా"

"మీ ఫ్యామిలీ? "

"నా భార్యపోయి ఐయిదేళ్లు గావస్తున్నది. ఇద్దరమ్మాయిలు. వాళ్లని అమ్మమ్మ పెంచుతున్నది. నేను జానకమ్మ పంచన చేరా. ఆవిడకు మొగదిక్కు లేదుగా. నన్నిక్కడే వుండమన్నది"

"అట్లాగా"అని బెనర్జి లేచి "మళ్ళీ కలుస్తాలెండి" అని తొందర తొందరగా వెళ్ళిపోయాడు.

బెనర్జి రోడ్డున వస్తుంటే గాంధీబొమ్మ సెంటర్లో బోసుబాబు పదిమంది యువకుల మధ్య కాస్త ఆందోళనగా కనిపించాడు.

జీప్‌నిండా యువకులు, వాళ్ళ మొహాల్లో ఆందోళన, మూడు మోటార్‌సైకిళ్లమీద ముగ్గురేసి చొప్పున యువకులు బైలుదేరటానికి సిద్ధంగా వున్నారు.

"నీవు జీపులో యిరుక్కోరా" అన్నాడు బోసు.

"కొట్లాటకా? అమ్మో నేను రాను నావల్ల కాద"ని వెనకడుగేశాడు బెనర్జి.

"కాదురా. సంతాపం తెలియపర్చటానికెళ్తున్నాం ఎక్కుబే"

బెనర్జీ ఎక్కి యిరుక్కుని కూర్చున్నాడు. జీప్, మోటార్‌సైకిళ్ళు ఐదు నిమిషాల్లో అంబేద్కర్‌నగర్‌లో ఇరుకుసందు మొదట్లో ఆగాయి.

ఓ పాత డాబాముందు షామియానా, దాని నీడలో పొడవాటి బల్లమీద, తెల్లటి గుడ్డ కప్పివున్న శవంమీద పూలమాలలు, చుట్టూ జనం.

బోస్‌బాబు అనుచరులతోపాటు వెళ్ళి శవం దగ్గర నుంచుని, మొహంమీద గుడ్డ తొలగించి ఓ నిమిషం చూసి తన సహచరుడు అందించిన పూలమాలను శవానికి వేసి,

"జోహార్ ఆశీర్వాదం మాష్టారికి" అన్నాడు.

అనుచరులంతా మూడుసార్లు జోహార్లు చెప్పారు రెండు నిమిషాలు మౌనం.

తాగుమోతు లెక్చరర్ ఆశీర్వాదం విపరీతంగా తాగితాగి నలభైఏళ్లకే చనిపోయాడు. బోసుబాబు ఆశీర్వాదం తండ్రి కృపానం దాన్ని కావిలించుకుని సంతాపం వెలిబుచ్చాడు.

★ ★ ★

వీరయ్య తవుడు బస్తాని గొడ్ల కొట్టంలో గోడవారదింపి, అలుపు తీర్చుకుని, బావి కాడకెళ్ళి తొడుక్కున్న లాల్చీని విప్పి గుంజి ఆరేస్తుండగా, వంటింట్లోంచి తల్లి, భార్య కీచులాట వినిపించింది.

ఏదోలే! మామూలు.. వాదులాటగావాల్నను కొని, వాల్చిన నులకమంచంలో నడుం ఆనించాడు. నాలుగింటిదాకా నిద్రపోతే పాలవేళకి భార్యే లెగ్గొట్టి పాలచెంబులు చేతికిస్తది అనుకుంటూ వీరయ్య "ఏమేయ్ చెంబుతో మంచినీళ్లు తీసకరా" అని కేకేశాడు.

అనురాధ వచ్చి మంచినీళ్లు అందించింది. వీరయ్య కూతురు మొహంలో కళ తప్పిన వైనం గమనించి "ఏందమ్మా కీచులాట" అని వాకబు చేశాడు.

"వింటావుగా. శ్రద్ధగా విను తెలుసుద్ది" తుంచేసినట్లు అని వెళ్ళిపోయింది.

తల్లి గొంతు వినిపించింది.

"ఆ దిక్కుమాలిన గుంపులో నా మనవా

రాల్ని లాక్కెళ్లి పడేస్తానంటే వీరమ్మా అడ్డ గోలుగా పేలమాక"

"అడ్డగోలుగా పేలుతున్నానా. యవ ర్నన్నా పెద్ద మడుసులకు చెప్పు పేలుడె వర్డో చెప్తారు"

వీరయ్య గావుకేక వేశాడు. "ఏందే మీ శిఖలు తరగ, ఏందే మీ గోల, మిట్ట మద్ది నాల, మద్దెల దరువేందంట? "

వీరయ్య తల్లి విసురుగా వచ్చి "గుర వయ్య సంబంధం మనకొద్దురా కొడకా. ఆళ్లు తగనిముండలంట. గురవయ్య పెళ్ళాం తరుపోళ్లు దుర్మార్గపు ముండలని తెల్సిందిలే"

"ఎవరు చెప్పారే? " వీరయ్య కోపంతో గుడ్లురిమి చూశాడు.

"ఎంకమ్మ చెప్పిందిలే. గురవయ్య పెళ్ళాం రాక్షస ముండంట. దాని అక్క బెమ్మ రాక్షసిముండంట. పెద్ద కోడల్ని కిర సనాయలు పోసి తగలేసి చంపిందట్రా దేవుడో. అల్లాటి ఇళ్లలో మన పిల్లల్ని సూత్తా సూత్తా అప్పగిత్తావంట్రా"

"అట్నా. నాకు తెలీనే తెలీదు. అదృట్టవం తులమేనే. మొగ్గలోనే తెల్సుకున్నాం! వొదిలే ద్దాంలే"

"యిగనా పూసే మనకొద్దు సరేనా" అంది కోటమ్మ.

వీరయ్య పెద్ద ఆపద తప్పిపోయినందుకు సంతోషించాడు.

ఓయబ్బో, దేశం గొడ్డుబోలే. ఆలశ్యమైనా మంచి మనువే రాధమ్మకిచ్చి చేయాలను కుంటూ కళ్లు మూసుకుపడుకున్నాడు.



**ప**గటిపూట పదిగంటలకే ఎండ మండిపో తున్నది. రోడ్లమీద జనసంచారం చాలా తగ్గిపోయింది.

నిప్పులు చెరిగే ఎండలో తారు రోడ్డు వేడెక్కి మెత్తబడి తారు నిగనిగలతో మెరుస్తూ సెగ తగుల్తున్నది.

రిక్షాలు రోడ్డు పక్కల చెట్ల నీడలో తల దాచుకుని, బాడుగల కోసం చూస్తూ, దిన దిన గండంగా బతుకుతున్నాయి.

నాలుగు చక్రాల బళ్ళమీద మామిడి పళ్లు అందంగా అమర్చుకుని మధ్యలో మల్లె పూలు అలంకరించి కేకలేస్తూ, నవ్వు కుంటూ, రోడ్లమీద సందడి చేసే కుర్రాళ్లు చెదురు మదురుగా అక్కడక్కడా కనిపిస్తు న్నారు.

"ఈ ఏడాది ఎండలదిరిపోతున్నాయ్‌రా గోపిగా!" అన్నాడు రాజా.

"ఇహ మనం మంచినీళ్లు తాగకూడదు. బీరే వాడాల్రా రాజుగా"

"ఒరేయ్ జానీ, మనోడు బీరు తప్ప మరేం తాగడట్రా"

"అందుకనే వాడి మొహం గోదురుక ప్పలా ఉబ్బరించిపోతోంది" అని నవ్వేడు జాని.

ఇంతలో పాసింజర్లు వచ్చి "ఎంతండీ! మామిడిపళ్లూ" అని బేరం అడిగారు.

"ఈ రకం డజన్ అర్థై రూపాయలు. ఆ రకం డెబ్బయ్యయిదు ఆ బండిమీదవి యాభై సార్"

"అబ్బో ధరలు మండిపోతున్నాయే. ఇచ్చే రేటు చెప్పు"

"నయాపైసా తగ్గదు. ఇవి వంద తొమ్మి దొందలకాడికి ఏశారు. ఇవి ఎనిమిదొందల కాడికి, అవి ఆరొందల రూపాయలు పడ్డాయి. ఈ నిప్పులు చెరిగే ఎండలో మాడతా, నిలబడి యాపారం చేసేది ఆ పావలా కోసమే సార్. సెగ, వడగాడ్పులు మా తిప్పలు చూడండి సార్. ఎన్ని కావాల సార్ రూపాయి తగ్గించి ఇవ్వండి"

"ఆ ఎన్ని అరడజన్ చాలు"

"పట్టండి" అని రాజు పళ్లు సంచిలో వేశాడు. అతను డబ్బులిచ్చి వెళ్ళిపోయాడు.

మిత్రులు హాస్య ప్రసంగంలోకి దిగారు.

"ఆ మన గురువుగారి మొహం గోదురు కప్పలా గుందంటావ్" రాజు సిగరెట్ పొగ వదిలి అన్నాడు.

హి... హి... హి అని ఇకిలించాడు జాని.

గోపి నవ్వుతూ "గంజాయ్ దమ్ముకొట్టే నా కొడకా. కతీజా నా మొహం కిస్ చేసి మామిడిపండులా వుంది ప్యారే అంది యావనుకున్నావో" అన్నాడు.

"ఆ లం... నీ ఉంగరం నూకి ఆ మాటతో నిన్ను ఐస్ చేసిందిరా. హి...హి"

"ఒరేయ్ సోడాబుడ్డి మొహమా. కతీజా నన్ను ప్రేమించిందిరా. పెళ్ళి చేసుకుందాం అందిరా. యావనుకున్నావో"

"ఆ డైలాగు అందరితో అంటదిరా. హెడ్ గాడికి తెల్సిందా నిన్నూ, దాన్నీ కైమా చేస్తాండ్రా"

"ఎంతమందినని చేస్తాండ్రా. ఆ నాకొడు కుని ట్రాన్స్ఫర్ చేశారంటగా"

"మనకు పీడొదిలిందిరా నీ కిహ దానిం ట్లోనే మకామా? "

"నాకు ధైర్యంచాల్టంలే. రాత్రిళ్లు వెళ్లా లంటే!"

"అదేందిరా పొగ గుప్పున లేచింది" అని రాజా పడమర దిక్కుకేసి చూపించాడు.

"ఎక్కడో కొంపలంటుకున్నయ్‌రా. ఈ వడగాల్పుల్లో"

"ఏం గాలిరా మనుషుల్నే లేపేస్తున్నదీ యాడంటావ్. రేయ్ మన గుడిసెలుగావు కదా బాబు"

గోపి అటేపే నోరెళ్ళపెట్టి చూస్తున్నాడు. అతని గుండెలు దడదడలాడాయి. పరీక్షగా సూటిగా చూస్తూ ఆదుర్దాగా "ఓరే, జానీ మన గుడిసెలంటుకున్నట్టేవుందిరా సూత్తుంటే" అన్నాడు.

జానీ గూడా అటే చూస్తూ నోరు తెర్చి గుడ్లప్పగించేశాడు. అతని గొంతెండిపో యింది. మొన్ననే అతను గుడిసె కొత్త తాటాకుతో దిట్టంగా కప్పించాడు. పది రోజుల్లో చెల్లెలి పెళ్ళికి లగ్గాలు పెట్టుకు న్నాడు. బేంకిలో వెయ్యి లోను తెచ్చి యింటో దాచాడు. వీటన్నిటికంటే ముఖ్య మైంది పెళ్ళాం మొగపిల్లోడ్ని కని వార మైంది. గుడిసెలో పచ్చి బాలింత, చెల్లెలు. ముసలి తండ్రి వున్నారు.

"మన వేరా దేవుడో నేనీ దెబ్బతో ఆరిపో యాన్రా బాబో! రాజాగా బళ్లని సందులోకి లాగేయ్. వెళ్తుండా" అని జాని పరుగు తీశాడు.

"మన కట్టమీన గుడిసెలేరా" అని అరుస్తూ, అప్పటికే చాలామంది రోడ్డెక్కి పరుగు లంకించుకున్నారు దూరాన్నున్న తమ గుడిసెల దగ్గరకు.

మనవే, మావే, అంటుకున్నాయ్. యింకే వుందిరో దేవుడో రోడ్డుమీద మొక్కుజొన్న

పొత్తులు కాల్చే స్త్రీలు, లేచి పరిగెత్తసాగేరు.

గోపి వీళ్ళందర్నీ దాటుకుని పరిగెత్తుతున్నాడు. మంటలు బాగా కనిపిస్తున్నాయి. గాలి మహావేగంగా వీస్తున్నది. గాలితోపాటు మంటలు దూసుకుపోయి దూరంగా కొత్తచోట్ల కొచ్చి పడి, గుడిసెలను భస్మీపటలం గావిస్తున్నాయి. నిప్పులు చెరిగే ఎండలో వడగాడ్పులు తీక్షణంగా వీస్తుండగా, భయంకరంగా జ్వాలలు చెలరేగాయి.

గోపి కాలవ వంతెనమీద క్షణమాగి కాలవకట్టమీద తగలబడి పోతున్న గుడిసెల్ని చూశాడు విషాదంగా. పది నిముషాల్లో అంతా ఐపోయింది. గుడిసెలటూ అంటుకున్నాయ్, అటు గూడా తగలపడుతున్నాయ్, మా గుడిసెలే, మావే, యింకేం వుందీ నాశనమయ్యా' అని గుండెలు బాదుకుంటూ చాలామంది పరిగెత్తుతున్నారు. గాలి విపరీతమైన వేగంతో వీస్తూ వేడెక్కిపోయి, నిప్పులు చెరుగుతున్నది బస్తి. పడమట దిక్కున చాలా చోట్ల మంటలు విజృంభించేయి.

గోపి కాలవకట్టమీద పరుగులీశాడు. పొగతో వూపిరాట్టంలే. జనం గోల, ఏడ్పులతో సామాన్లు బయటకు చేరుస్తూ నానా పాట్లుపడుతున్నారు.

గోపి గుడ్శెకాడ మా అమ్మ యట్టెట్ట చేసిందో. అసలింటికాడ వుందో పదకొండు గంటల సినిమాకి ఎళ్ళిందో అని ఆలోచిస్తూనే రొప్పుతూ రోస్తూ జనాన్ని నెట్టుకుని, తప్పుకుని, తోసుకుని నడుస్తున్నాడు. పరిగెత్తే వోపికంతా ఐపోయింది. "మన కొంపంతా కాలిపోయిందిరా ఏం మిగల్లా" అని గుండెలు బాదుకుంటూ ఎదురొచ్చాడు రామస్వామి.

"ఏం మిగల్లేదా? " ఆదుర్దాగా, ఆరాటంగా గోపి అడిగేడు.

"గోడలు మిగిలాయ్. కట్టు గుడ్డలు మిగిలాయిరా గోపి. ఐదు నిమిషాల్లో. అబ్బ, ఏం సెగ, గాలి, పొగ దగ్గరకెళ్ళ...నికి వల్లైందట్రా. సూస్తా నిల్చున్నానంతే ఐదు నిమిషాల్లో గుడ్శె కాల్తూ కూలిపోయింది చూస్తుండగానే.

"మా గుడ్సె కాడెవరున్నారు. మా అమ్ముందా? "

"మీ అమ్మా, అయ్యావున్నారు. వుండి ఏం చెయగల్గాం. నిప్పులగాల్లో, మంటలార్పటం మనతరవా. కాల్వాలో నీళ్లేయి. అటుసూడు. బెస్తపాలెం అంటుకుంది. ఆ మంటలూ, ఈ వడగాడ్పులు మానవ మాత్రుడొల్ల అవుద్దంటరా? ఆర్పటానికి ఫైరింజన్లొచ్చినా, నీళ్లేవి? "

సెగ, పొగ, జనం రద్ధి. వడగాడ్పులు ఆడవాళ్ళ ఏడ్పులు, దిక్కుతోచక అటు యిటూ తిరిగే జనం, శోకాలు, ఏడ్పులు, గుండె బాదుకోటాలు, పెడ...బ్బలు, అరగంటక్రితం కళకళలాడిన గుడిసెల్లో, చిత్రమైన విషాదం గంతులేస్తున్నది. గోపీకి కట్టుకున్న గుడ్డలే మిగిలాయి. జేబులోని మూడొందల డెబ్బయిఎనిమిది రూపాయలే దక్కేయి.

ప్రభుత్వ సారాదుకాణం తగలబడలేదు. గాలి వాలులో దుకాణంలేదు. రేకుల షెడ్ పక్కన దాగివుంది.

"రారా గోపీ" అని రామస్వామి సారాదుకాణంలోకి గోపీని రెక్కపట్టుకుని లాక్కుపోయాడు.

★ ★ ★

రామస్వామి కలలు పదిహేనేళ్ళనాడే పేకమేడల్లా కూలిపోయాయి. అతని మంచి మిత్రుడు సారాసీసానే.

యిల్లు, పొలం, లారీ, భార్యా పిల్లలు, కొడుకు వీళ్ళందర్నీ తల్చుకుంటేనే రామస్వామికి కంపరంగా వుంటుంది.





సారా తాగితే చెప్పలేనంత హాయి. మైమ
ర్చిపోవచ్చు అన్నింటినీ.

చూస్తుండగానే అన్నీ చేతుల్లోంచి జారిపో
యాయి. మిగిలినవి పెళ్ళాం మంగమ్మ,
వొరిగి పోయిన గుడిసె. అది కప్పి
మూడేళ్ళు దాటింది. ఎండకు రక్షణేగాని,
వానొస్తే గుడిసెలో నిల్చోవాల్సిందే. ఆ
గుడ్సె తగలపడిపోయినందుకు రామస్వామి
విచారపట్టంలేదు.

తగలపడిన గుడ్సె ఎటూ, తగలబడిపో
యింది. కట్టుగుడ్డలే మిగిలాయ్. లారివోన

ర్‌గారి ఇంటి వరండాలో పడుకోగలడు.
ఆయన డ్యూటీ కెక్కమన్నప్పుడు లారీ ఎక్క
గలడు. ఆయన యిచ్చిన బేటాలతో, వచ్చిన
కమీషన్‌తో కమ్మగా కుతికెలదాకా తాగి,
రోడ్డుమీద పడిపోర్లాడగలడు. అంతకంటే
చెడిపోగల దశలేనేలేదు. బాధపడేదశల
న్నింటిని అనుభవించేసి యీ దశలో
వున్నాడు రామస్వామి.

అన్ని అధమ దశల్ను చవిచూసి,
సారాను మించిన వస్తువు ప్రపంచంలో
లేదనే నిశ్చితాభిప్రాయానికెప్పుడో వచ్చాడు
రామస్వామి. అతనికి గుదిబండ భార్య
మంగమ్మ. గుడిసెతోపాటు భార్యా తగలడి
పోనందుకు తెగ దిగులుపడుతూ సారా
షాపులో నేలమీద చతికిల బడ్డాడు రామ
స్వామి.

గోపి చతికిలపడటానికి పస్తాయిస్తుండగా
"బాగా కూకో, పిచ్చినాయాలా. మనకి
మిగిలిందే దక్కుడు. దక్కిందే మిగులు"
అని గీతోపదేశం మొదలుపెట్టాడు.

రెండు గ్లాసుల్లో సారా పోసి, సోడా నీళ్ళు
కలిపి అందిస్తే, చెరో గ్లాస్ అందుకుని
గుక్కెడు తాగి, గ్లాసులు కిందపెట్టారు.

"రేయ్ గోపిగా ఆడదాన్ని నమ్మమాక.
నాశనమవుతావ్ ఎర్రినాయాలా" అన్నాడు
రామస్వామి.

విని వూరుకున్నాడు గోపి అతనికి తన
కలలు కూలటం మొదలయినట్లనిపిం
చింది. తను రాత్రి కతిజాతో కల్సి వెళ్ళిన
సెకండ్‌షో సినిమా, తర్వాత ఆమెతో గడి
పిన మిగిలిన రాత్రిని గురించి నెమరేసు
కుంటూ, సంతోషసాగరతీరాన కూర్చుని
అలల దూకుళ్ళు గమనిస్తున్నట్లు
మైమర్చిపోతుండగా, గుడిసెల అంటుకున్న
మంటలు, యదార్థంలోకి తరిమేశాయి.

తమ గుడిసెలు, నాలుగు తగలబడిపో
యాయ్. పావుగంటలో ఐదేళ్ళ మిగులు
సంపాదన బూడిదపాలై పోయింది. ఆ
బూడిదను చూసి తట్టుకునే శక్తి లేక యిట్లా
రామస్వామి గుప్పెట్లో చిక్కుకున్నాడు.
గోపీకి రామస్వామి అంటే అసహ్యం.
అతను తాగొచ్చి చేసే అల్లరి వినివిని అత
నిమీద విపరీత ద్వేషం పెంచుకున్నాడు.

తగలబడిన గుడిసెలెటూ, తగలబడి
బూడిద గుట్టలైనాయి. చేసేదేమీ లేదు.
యింట్లో పరిస్థితి పట్టు సడిలిపోయి, తారు
మారై మూడు నెలలు గావస్తున్నది.

వెనకటిలాగా తల్లి, తండ్రీ అతన్ని, నెత్తిన
పెట్టుకోవటంలేదు. రోజూ తల్లికివ్వాల్సిన
పైకం యివ్వటం మానేసినప్పట్నుంచీ,
గోపిని తుస్కారంగా చూడటమే గాకుండా,
వారం తర్వాత నిలేసింది వెంకమ్మ.

గోపి తల్లిని బుకాయించాడు. మరుసటి
రోజు తల్లిని తిడ్తూ మీదమీదకు వెళ్ళాడు.
ఆ రాత్రి తనే కుండలో కూడు కంచంలో
వేసుకుని తిని గుడిసెలోంచి బయటకొచ్చే
శాడు. మర్రోజురాత్రి యింటికెళ్తే కుండలో
బువ్వేలేదు. గోపీ కోపం పట్టలేక, తల్లిని
తిట్టి, కుండ పగలకొట్టి గుడిసెలోంచి బయ
టకొచ్చేశాడు.

సినిమానుంచి వచ్చి వెంకమ్మ గోపి చేసిన
నిర్వాకానికి మండిపోయి, తెల్లారగానే అన్నం
కుండ పొయ్యిమీదకెక్కించకుండానే గురవ



య్యని వెంటపెట్టుకుని వచ్చి, నడిబజార్లో గోపి చొక్కా పట్టుకుంది.

గోపి తల్లిని నెట్టి కిందపడెయ్యగానే తండ్రి, అన్న, తమ్ముళ్ళు, కలబడి గోపిని కిందపడేసి కుమ్మొదిలి పెట్టారు. నేలమీద పొర్లించి పొర్లించి గోపి వళ్లు హూనం చేశారు.

తర్వాత బళ్ళు నెట్టుకునే కుర్రాళ్ళంతా, చేరి చాలా ప్రయాసపడి, గోపిని రక్షించి దూరంగా లాక్కుపోయారు. యీ బజారు యుద్ధంలో గోపి ప్రిస్టేజి మొత్తం గాలిలో కల్సిపోయింది.

గోపి తమ్ముడు, చిన్నాగాడు, తొమ్మిదంగుళాల కత్తి పిడికిట పట్టుకుని వేసిన వీరంగం చూసి, గోపి శకం ముగిసిందని, చిన్నగాడికే మంచి రౌడీ భవిష్యత్తు వుందని, ప్రేక్షకులు ప్రశంసల పూలవర్షం కురిపించారు.

ఆ రోజునుంచి గోపి వేరైపోయాడు కుటుంబంనుంచి. కతిజా మోజులో పడిన గోపి అవస్థలపాలైనాడు. మామిడి పళ్ళ సీజన్‌రానే వచ్చింది. సగమైపోయింది. పోయిన సంవత్సరం యిదే సీజన్ టయిముకు గోపి పాంటుజేబులు నాలిగిట్లో, చొక్కా మూడు జేబుల్లో ఎక్కడ వెతికినా నోట్లు బొత్తులు బొత్తులుగా వుండేవి.

ఇప్పుడు గోపి జేబులు ఖాళీగా వుంటున్నాయ్. ఒక జేబు హోల్‌సేల్ వ్యాపారస్థుడికి చెల్లిపోతున్నది. ఒక జేబు కతిజా గుప్పెటకు అర్పితమైతే, మరో జేబు కతిజా చిల్లరమల్లర సర్దాలకు అంకితమైంది. బ్రాందీషాపుకు చొక్కాపై జేబు ధారగతమౌతున్నది. పోలీసు, అమాంబాపతుఖర్చుకు పక్క జేబు వుండనే వుంది.

సారాషాపులో జనం పల్చబడ్డారు.

సారా కడుపులో జారిన తర్వాత రామస్వామికి భార్యమీద విపరీతమైన కోపం వచ్చేస్తుండగా, "దీనివల్లే నాశనమైనాన్రా గోపి" అన్నాడు.

"దేనివల్ల. గ్లాసువల్లా"

"కాదు నా పెళ్లాంవల్లరా"

"అవును. మా అమ్మ నన్ను... నన్ను తరిమేసింది. అది తల్లా. రాక్షసా చెప్పు? "

"ముంగల నీవు చెప్పు. నా పెళ్ళాం. పిశాచంటావాకాదా? "

"మంగమ్మ... మంగమ్మ దర్మతల్లి. ఎన్నైనా చెప్పు"

"ఓరి. నీకేం తెల్సురా. ఆ దుర్మార్గపు విష్టరి నన్నడుగు చెప్తా"

"నీవెన్నన్నా చెప్పు మంగమ్మత్త దరమ తల్లి మావయ్యా"

"నీకు మావయ్యనంట్రా! అల్లుడివా నాకు. ఎన్నో వాడివిరా గోపిగా" అని పెళ్ళున నవ్వేడు రామస్వామి.

"నీవు రేత్రిళ్ళు అల్లరి చేసి తరిమేస్తే, పాపం నీ కూతుళ్ళు మాగుడ్సెలోనే గదా రాత్రంతా వుండేది. నీ రెండో కూతురూ చంకలో పిల్లను నా మంచంలో పండేసేది పాపం. అది నామంచం పక్కన పడుకునేది. సద్దుమణిగినాక నేను అది కల్సి కింద పడుకొనేటోళ్ళం. చంటిపిల్ల లేచి ఏడ్చినాకా అది లేచెళ్ళి మంచంలో పడుకుని పిల్లకు పాలిచ్చేది ఏందనుకున్నావో"

"అమ్మనాకొడకా ఎంత దురమార్గంరా గోపి"

"నాదా నీ సొంతల్లుడిదా? వాడో మొగాడా అంట. పెళ్లాన్ని, ఆళ్లకీ యీళ్ళకి తార్చి బతుకుతున్నాడు తెల్సా. పోయి సంపాదించురా అని బలవంతం చేస్తాట్టవోడు. నీ చిన్న కూతురే చెప్పింది నాతో"

"ఓరి నీచపుగాడ్దె కొడకల్లారా. యింత చెడిపోయారంట్రా. యింతకుళ్ళి పోయారంట్రా మీరూ"




"ఎవళ్ళు? మీ అల్లుళ్ళా? నేనా?"

"మీరంతా లుచ్చాలా''

"నీ మూడో అల్లుడు పరమలుచ్చా తెల్సా. అందుకే వాడ్నొదిలేసి అది కంపెనీ సరుకై తిరుగుతోంది. దాని తొడలు, పిర్రల నిండా వాతలు పెట్టాడాడు. మీ సావిత్రి నాకు వాతలు చూపించి ఏడిస్తే, దాని సేతిలో రెండొందలు పెట్టా తెల్సా''

"మా సావిత్రి నీ కాడికొచ్చుద్దా?"

"నా డబ్బు కాడికొస్తది. కొండమీదికోతైనా వస్తది నీకేం తెల్సు తాగి పెళ్ళాన్ని బూతులు తిట్టటం, జుట్టు పట్టి గుంజటం తప్ప. నీ కుటుంబాన్ని పట్టించుకున్నావా? గుండెమీన చెయ్యేసుకు చెప్పు"

"ఓరీ! పసినాయాల్వానుకున్నానే? అందుకే మీ అమ్మ నిన్ను పెందలాడే తరిమేసింది''

"అందుక్కాదు. నేనో ముండనుంచుకున్నా. యింట్లో పైసివ్వటం లేదన్చెప్పి యింటిల్లిపాదీ నామీద దొమ్మిచేసి, నా స్టేటస్ బజార్లో కరాబు సేశారు. నన్నింట్లోంచి తరిమేశారు. యింట్లో చానా సామాన్లు నేను సంపాదించికొన్నవే. అయన్నీ బుగ్గైపోయాయ్. వొట్టి మడుసులం మిగిలాం. అన్నీ మొదలెత్తుక్కోవాల్సిందేగా. ఎళ్తా, మా గుడిసెల కాడికెల్తా, కూసింత గుండె నిబ్బరం వొచ్చింది'' అని లేచాడు గోపి.

రామస్వామి కూర్చునే చెయ్యి చాపి "పది యివ్వు రెండ్రాములేసుకుంటా. బాబ్బాబు'' అని ప్రాధేయపడ్డాడు.

"ఛా లుచ్చా. దమ్మిడి యియ్యను'' అని సారా దుకాణంలోంచి తూలుతూ, కాలిపోయిన గుడిసెలవైపు సాగిపోయాడు గోపి.

కాలిబూడిద గుట్టలుగా మారి మొండి గోడలతో, పొగతో, వేడిగాలితో, వడగాడ్పులతో, అగ్ని గుండంగా వున్న కాలవకట్టమీద జనసంచారమేలేదు.

తూలుతూ తల వంచుకుని నడుస్తుండగా తూర్పు వీధిలోంచి గోపి, గోపి కేకలు వినిపించాయి. గోపి ఆగి చూశాడు.

చింత చెట్టు నీడలో చాలామంది జనం ఉంటే అటేపు నడిచాడు.

గురవయ్య ఎదురొచ్చి వాటేసుకుని భోరున ఏడ్చాడు. గోపి ఏడుస్తూ కూలబడ్డాడు. కాళ్లు, వళ్లు తేలిపోయాయి. తల్లి వొచ్చి నేలమీద పడిపోయిన కొడుకు మొహాన్ని తడిమింది. సారా వాసన వేసింది.

"నీవిట్టా మారతావని కల్లో గూడా అనుకోలేదా కొడకా! నువ్వా కూటికుండ పగలేసినప్పట్నుంచీ మన కుటుంబానికి తిప్పలొచ్చి పడినయిరా తండ్రీ! ఎంత సిక్కిపోయినా వురో కొడకా, నా మాటకెప్పుడైనా ఎదురు చెప్పేవాడివా కొడకా! ఏ గుడ్సేటి లంజో మందుపెట్టి నాకు దూరం సేసిందిరో దేవుడో!"

గోపి కళ్ళు తెరిచి తల్లిని చూస్తూ ఏడుపు కొనసాగించాడు.

"ఏడ్చమాక, ఏడ్చమాకా, గుడ్సెలు తగలడితే తగలబడి పోనీయ్ ఏం చేత్తాం. నీవధైర్యపడమాక. సీట్లు పాడిన డబ్బులుండాయిలే. రేపీపాటికల్లా పాకలేస్తది''

గోపి లేచి నిలబడి తల్లి, తండ్రిని చూశాడు. "నేను అడ్డగోలుగా తిరిగి డబ్బంతా పాడుచేశా. నాకాడ యివ్వే మిగిలున్నాయమ్మా. యింద నీకాడవుంచు, మూడొందల యాభైరూపాయలు''

"తాగ్గాకరా తండ్రే. నా మాటిను గోపిగా'' తల్లి గడ్డంపట్టుకుని బతిమాలింది.

"రేపట్నుంచి తాగనేతాగను. నీమీదొట్టమ్మా''

"సరే, మంచిదే. దా ఎండలో ఎందుకు



చింతచెట్టు నీడలో కెళ్దాందా" అని వెంకమ్మ గోపిని వాటేసుకుని తీసికెళ్ళింది.

మళ్ళీ గోపి తన దగ్గరకొచ్చేసినందువల్ల. కొంపలు కాలిన దుఃఖపు సెగ చాలావరకు తగ్గిపోయి, తేలికైంగి ఆమె మనస్సు.

కాలవకట్టమీద పొగలు సెగలు, ఆడవాళ్ళ మనస్సులో సెగలు, పొగలు, అర్ధరాత్రి దాటింది.

సారాదుకాణం, కల్లుపాక! దగ్గరగా మనుష్యుల కదలిక గుప్పున అవి అంటుకున్నాయి.

తాగుమోతు మొగుళ్ళు, తాగుమోతు కొడుకులు తాగుమోతు అల్లుళ్లవల్ల భయంకరమైన అగచాట్లు అనుభవిస్తున్న వెంకమ్మ, మంగమ్మ, రోశమ్మ, పోలేరమ్మ తెగబడి సారా దుకాణం, కల్లుపాకలమీద నిప్పులు కురిపించారు. చాటలతో నిప్పులు విరచిమ్మేరు.

★ ★ ★

మంగమ్మ దిగులుగా ఒంటరిగా రోడ్డు మీద నిలబడివుంది. ఉదయం ఎనిమిది గంటల సమయంలో దోసెలపెనం ముందు కూచుని వ్యాపారం రెండు చేతులా, హడావుడిగా చేసుకునే మంగమ్మ దశ తిరగబడిపోయింది.

ఈ రోజు రోడ్డుపాలబడ్డది. బతుకు బజారుపాలైపోయింది. తన పొట్ట తానెట్లా పోషించుకోవాలో ఆలోచించసాగింది. పొయ్యి అంటించి పని సాగించటానికి సత్తు గిన్నెలన్ని కరిగిపోయాయి. ఇహన చిన్న కూతుర్లాగా కలవారిళ్లలో పాచిపనులు చేసుకుని బతకాల్సిందే. అన్నం వండుకోటానికి కుండగూడా దక్కలేదు. వంటికున్న చీరె మిగిలింది.

ఔరా! బతుకెంత గమ్మత్తుగా తారుమారైంది. తలదాచుకోటానికి గుడిసెగూడా లేదు. భీభత్సమైన తన స్థితినుంచి బయటపడే దారి కానక మంగమ్మ మానసిక క్షోభలో చిక్కుకుంది.

ఆ ప్రభుత్వంవాళ్లు ఇచ్చే రూపాయిలు చేతిలోకొచ్చేదాకా ఈ అవస్థ తప్పదని తేల్చుకుని గుండె రాయి చేసుకుంది మంగమ్మ.

బూడిదరంగు పాత చీరెకట్టుకున్నది మంగమ్మ. మసి, మట్టి, బూడిద అంటుకుని ఆ చీరెను మహామురికిగా మార్చేశాయి.

చేతులు వెనక్కి పెట్టుకుని బావురుమంటూ, జనసంచారంలేకుండా తయారైన కాలవకట్టను చూస్తూ నిల్చున్న మంగమ్మ దృష్టికి చాలా దూరాన ఓ వ్యక్తి యీ వైపే వస్తూ కనిపించాడు. గుండె వేగంగా కొట్టుకోవటం మొదలయింది. రెప్ప ఆర్పకుండా చూస్తూ ఆ వచ్చే మనిషి ఎవరో తేల్చుకోటానికి తహతహలాడిపోయింది.

వాడేనా? వాడేనా? నా సత్తెమేనా. నా కొడుకు సత్తెనారాయణేనా? మంగమ్మ గుండెలు దడదడ కొట్టుకోసాగేయి. వాడే నా కొడుకే. నా సత్తెనారయణే, మంగమ్మ "సత్తెవా!" అని పెనుకేక వేసి విర్చుకుపడిపోయింది.

అమ్మలక్కలు పోగై ఆందోళనగా ఒకర్నొకరు చూసుకున్నారు. "ఏంది? పూనకం వచ్చిందేవిటి మంగమ్మకు? " అన్నది రవణమ్మ.

"అమ్మ... మా అమ్మకేమైంది. నిలబడి నన్ను చూస్తా ఉందిగా? ఇంతలో ఏమైంది? "

కాకిపేంటు, కాకిషర్టులో వున్న సత్యాన్ని వెంకమ్మ గుర్తుపట్టింది.

"సత్తెవా! నువంట్రా తండ్రె ఎన్నాళ్లకొచ్చావయ్యా" వెంకమ్మ సత్యం చేతులు పట్టుకుని పరామర్శించింది.

సత్యం నేలమీద కూర్చుని తల్లి తల

నిమిరి, "అమ్మా! అమ్మా నేనేనే సత్యాన్ని! లేలే కళ్లు తెరువు" అంటూ చెంపలు నిమిరాడు.

రవణమ్మ చెంబుతో నీళ్లు తెచ్చి మంగమ్మ మొహం మీద చిలకరించింది.

మంగమ్మ కళ్లు తెరిచి "అమ్మా అమ్మా" అనే సత్యాన్ని చూస్తూ వుండిపోయింది. చుట్టూ జనం ముసురుకున్నారు. ముసిరిన జనాన్ని కొందరు వెనక్కి నెట్టేశారు. ఎవరో మంచం తెచ్చి వేశారు. మంగమ్మ లేచి మంచంమీద కూర్చుని చెంబులో నీళ్లు గటగట తాగేసింది. కొడుకుని మరో మారు చూసి బోరున ఏడుస్తూ సత్యం వళ్లో వాలి పోయింది. చాలాసేపు అట్లాగే అతని వళ్లో సోలిపడుకుంది. వెంకమ్మ ప్రశ్నలు మొదలెట్టింది "ఏం ఉద్యోగం చేస్తుండావ్? "

"ఆర్. టి. సి. డ్రైవరుగా వున్నా"

"ఏడ? "

"బెజవాడలో!"

"జీతం ఎంతిస్తరూ? "

"పదేడొందలొస్తాయ్!"

"మీ అమ్మని మర్చిపోయావేంద్రా తండ్రీ? " సత్యం తలొంచుకుని తల్లిని చూస్తూ మౌనం వహించాడు.

మంగమ్మ కళ్లు తెరిచి సత్యాన్ని చూసి నవ్వుతూ లేచి కూర్చుంది.

"ఎట్టా తెల్సిందీ" అని అడిగింది.

"నిన్న రేడియోలో వార్తల్లో చెప్పారు. పేపర్లో పొటోలుగూడా వేశారుగా వచ్చా ఏం భయపడగాక, నేనున్నాగామ్మా"

"అవును, నీవున్నావుగా. వచ్చావుగా. కొండంత అండ దొరికింది" అంటూ మంగమ్మ ఏడ్పు మళ్లీ ప్రారంభించింది.

సత్యం తల్లి వీపు నిమురుతూ ఓదార్చసాగేడు.

జనం తల్లీకొడుకులను ఏకాంతంగా వదలి ఒక్కొక్కరే వెళ్లిపోయారు.

తల్లీకొడుకులు ముచ్చట్లలో లీనమై ఒకర్నొకరు చూసుకుంటూ ప్రపంచాన్నే మర్చిపోయారు.

రామస్వామి, సత్యాన్ని తోడేల్ను చూసినట్లు చూస్తూ మాటా పలుకులేకుండా మౌనంగా మెలగటం మంగమ్మ గమనించకపోలేదు. "నీవన్నా ఆయన్ని పలకరించరా దంట్రా అబ్బయ్యా" అని కొడుకుని మెత్తగా మందలించింది.

"దోవలో ఎదురుపడ్డాడ్లే. పలకరించా! సారా దుకాణంలోకి లాక్కపోతుంటే విదిలించి పారేశా! అందుకా గుర్రు"

"ఈ ముదనష్టపోడితో వొచ్చిన చావదే గదంట్రా. ఎట్టాంటి సంసారానికీ గతి పట్టిందంటే ఈ తాగుబోతు బుద్ధేగదంట్రా తండ్రీ' ' అని మంగమ్మ తలబాదుకుంది.

సత్యం తల్లిని వారించాడు దిగులుగా, విసుగ్గా చూశాడు.

"తప్పుడు ముండా నీ కొడుకుతో వెళ్లిపోవే! నా యింట్లోంచి పొండి ముంగల" అని లేచాడు రామస్వామి.

"నీ ఇల్లు! ముక్కెలిరగతీస్తా యామనుకుంటున్నావో! ఎనకట్లాకాదు. నా చేతిలో నీకు చావుంది. అమ్మ ఒంటిమీద చెయ్యిపడిందా నీకీళ్లిరిచేస్తా జాగ్రత్త. తగ్గుతగ్గు. నీ నోరు తగ్గించుకో"

"నా ఇంటికొచ్చి నా మీదే రాంగ్ చేస్తావంట్రా నా కొడకా" అంటూ కాలెత్తి సత్యాన్ని తన్నబోయాడు.

ఆ ఎత్తిన కాలు పట్టుకుని సత్యం తండ్రిని కిందపడేసి కాలితో కుమ్మొదిలి పెట్టాడు.

"ఇంత కాలంనుంచి అట్టా కుమ్మొదిలే వాడు లేకనే గదంట్రా ఈ ముదనష్టపోడు అదిరిపాటు పడ్తున్నది. నా సావు చదరం చేశాడు గదంట్రా. వీడ్ని రాబందులు పీక్క

తినా! వీడ్ని పల్లకాట్లో కీడ్చరా! నేసుకపడి పోతా తండ్రే"

రామస్వామి వెల్లికిలాపడి రొప్పుతూ రోజుతూ భార్యనీ, కొడుకునీ కసిగా చూడ సాగేడు.

సత్యం తన దగ్గరవున్న మరో ముఖ్యమైన శక్తిని తల్లికి, తండ్రికి చూపించాడు.

హేండ్‌బాగ్‌లోంచి పది రూపాయలనోట్ల కట్టని పిడికిట పట్టుకుని చూపిస్తూ "వెయ్యి రూపాయలమ్మా రేపీపాటికి ఇల్లేస్తా. మీ ఇద్దర్కీ గుడ్డలు కొంటా. సామానులు తెస్తా! మీకే కష్టంలేకుండా చేస్తా" అన్నాడు ఆవేశంగా.

బూడిద దులుపుకుని లేచి నిలబడ్డాడు రామస్వామి. "కాలాంతకుడివేరా సత్తిగా మాకు తవ్వి తలకెత్తతానంటే వద్దంటామా. బాబ్బాబు నా మీద కచ్చపెట్టుకోమాక. ఈడనే వుండిపో. మాకో నీడ సూపించు" అని గొణిగాడు.

"ఎయ్యి రూపాయలంట్రా అబ్బాయా? సంపాదించుకున్నావన్నమాట. మిగులులో బతుకుతుండావా తండ్రే? మెకానిక్కుగా నిలతొక్కుకున్నావంట్రా. అబ్బా! నా గుండెల మీన భారం దింపావ్ సత్తిగా"

మంగమ్మ కళ్లల్లో నీళ్లు తిరిగాయి. సత్యం యధాప్రకారం నోట్లకట్టను సంచిలో పెట్టేసి భుజానికి తగిలించుకుని తండ్రివైపు చూసి పాంట్ జేబుల్లోంచి ఐదు రూపాయల బొత్తితీసి ఒక ఐదు తండ్రికిచ్చి "అలవాటు పడ్డ ప్రాణానివి తాగిరాపో" అన్నాడు.

రామస్వామి కొడుకుని వాత్సల్యంగా చూస్తూ "కేటు నాకొడకా! బెజవాడ పోకడ పోతున్నావ్ గదరా సత్తిగా, యిప్పుడే పావు గంటలో వస్తా. మీ అమ్మ మాటలన్నీ నమ్మమాక. అది కిలాడి లంజె" అనేసి వెళ్లిపోయాడు.

మంగమ్మ కొడుకుని చూస్తూ వుండిపోయింది. చాలా ఎత్తుగా ఎదిగిపోయిన తన ఏకైక పుత్రుడ్ని సంతృప్తిగా చూస్తూ వుండిపోయింది.

నా కొడుకు పెద్ద మెకానిక్ అయిపోయాడన్నమాట. మా కష్టాలు కడతేరుతాయన్నమాట. ఇహ డబ్బుకి అగచాట్లు పడక్కర్లేదన్నమాట.

సత్యం తల్లి దగ్గరకొచ్చి ఐదు రూపాయల నోట్ల బొత్తిని, ఆమె దోసిట్లో పెట్టి "నాలు గొందల తొంబయి ఐదు ఇస్తుండా! నీక్కావల్సిన చీరెలు కొనుక్కో ముంగల. కట్టుగుడ్డగా నీకు దక్కింది. గుడిసెలో కుండలు గూడా లెవ్వుగా. కుండలు, చట్లు, అటికెలు, సత్తుగిన్నెలు, గళాసులు, చెంబులు ఎత్తకొచ్చుకో" అన్నాడు.

మంగమ్మెంతో సంతోషిస్తూ, "సరే కొను కొత్తాగాని యాడ పెట్టుకునేన్రా? గోడల్లెవ్వు. నెత్తిన నీడలేదు. తీసకొచ్చి ఆట్నె పరుసుకుని కూకోమంటావట్రా. ముందల రెండు నిట్టాళ్లపాక ఏసుకున్నాక కుండలు, చట్లు ఎంతసేపు పట్టద్ది తేటానికి. ముంగల గుడ్సేసుకోవాల్రా తండ్రే!" అంది.

"అట్నే లేమ్మా. రేపీపాటికి గుంజలు, బొంగులు అడితీల్లోంచి తెస్తా. తాటాకే యిస్తా. ముంగల గుడ్సె ఏసుకుందాం. ఆనేకే సావాన్లు కొందువుగాన్లే. రెండు కోకలన్నా తెచ్చుకో పోనీ"

"ఆ దీంతోనే తంటాలు పడతాలే అబ్బయా! గుడ్సేసుకోవాలా, మట్టి గోడలు పెట్టుకోవాలా. ఆ పనుల్లో వుంటే కోకకి మట్టి, మశానం అవుద్దిగా యట్టాగో. అందాకా ఈ కోకతోనే కాలచ్చేపం చేస్తాలే"

"అంతేనంటావా! సరే నీ వీల్నుపట్టి బాగా ఆలోచించుకుని చేసెయ్యి. రేత్రికి హోటల్లోంచి బువ్వెత్తకొస్తా మరి"

"తాటాకు బుట్టలో ఏపించుకొస్తాలే. నీకెందుకాశ్రమ. యా మంటావ్! నీవు





కమ్మంగా తినిరా. ఈడే పడుకుందువుగాని"

"అట్నేలేమ్మా!"

* * *

ఆకాశంలో సాయంత్రంనుంచి మబ్బులు పోగవుతున్నాయి. ఎండలు ముదరబోయే ముందు పడే జల్లులు అనుకున్నారు గుడిసెలు లేని అగ్ని బాధితులు.

వీరయ్య మంగమ్మను చూసి పోవటానికొచ్చి తాటాకు మీద కూర్చుని గుడిసె కప్పుతున్న రామస్వామితో, అతనికి తాటాకు అందిస్తున్న మంగమ్మతో కష్టసుఖాలు చెప్తున్నాడు.

సత్యం తాటాకు బిగించి కడ్తున్నాడు.

"మొత్తానికి బాబు, కొడుకు, తల్లి చేరి గుడిసె నేత అయిందనిపించారు. కూలోళ్ళు దొరకని టయాన" వీరయ్య మెచ్చుకోలుగా అన్నాడు.

"గుడ్సి కప్పటానికి రెండొందలడిగార్రా వీరయ్య బావా! యాందనుకున్నా" రామస్వామి నడికొప్పున కూర్చుని అన్నాడు.

"కూలోళ్ళు దొరకటంలా. పనోళ్ళకి కరువొచ్చిపడ్డది బావా!"

"కరువా! అన్నింటికీ కరువే వీరయన్నా! తాటాకు ఎయ్యి ఏడొందలు రూపాయలు. ఐదొందలాకు బొటాబొటిగా సర్దికప్పేడు మీ బావ"

"నిట్టాళ్లెంతకు తెచ్చార్రా సత్తెవా!"

"జత యనబై కాడికి తెచ్చా. బొంగు ఒక్కటి పది రూపాయలు, కాని గుంజలు ఆరు వంద రూపాయలు మాయ్యా!"

"అబ్బా! అడితిలోళ్లు తెగ సంపాదిస్తారి హన. పాప భీతి, కనికరం సూడకుండా ఇట్టంవొచ్చినట్టుగా పెతిదానికి రేట్లు పెంచేత్తున్నారుగా"

"వెయ్యి రూపాయలయింది మాయ్యా! ఇంకా గోడలు లేపాల. గుమ్మంకొనాల"

"అమ్మబాబో! ఎయ్యంత్రా బాబా. ఐతే ఐందిలే. కమ్మటి రెండు నిట్టాళ్ల పాకా దిట్టంగా అమిరిందమ్మా మంగమ్మక్కా. నీ కొడుకు సరైన టయానికొచ్చి నిలబడ్డాడు. మా పోరం బోకోడున్నాడు. ఏం లాభం! మద్రాసెల్లి పదిరోజులయింది. ఆడేకూకున్నాడు గాల్లంజ కొడుకు. వాడికిల్లు కాబట్టదు. ఏడకన్నాపోతే యిగపత్తాచిక్కడురా సత్తెవా"

"శీనుగాడేం పనిలో ఇరుక్కున్నాడూ!"

"అదే చిన్నకారు తోల్తున్నాడు. ఆర్నెల్నుంచి కుదురుగానే వొళ్లు దగ్గర్పెట్టుకునే మసలుతున్నాడ్లే!"

"డ్రైవింగ్ లైసెన్సొచ్చిందా? !"

"అదే.. జానికమ్మగారే యిప్పించారు దరమతల్లి. ఆడికి అన్నం పెట్టింది తల్లి. అయితేనేం మావోడు కుక్క సాకిరి చేసి ఆర్ని మెప్పించాడ్లే. మా వోడిట్టా వొళ్లొంచి సాకిరి చేస్తాన్నాడంటే నాకే శానా ఆచ్చెర్యంగుందంటే నమ్ము. ఆరింటికి కాపలాకాశాడు. ఆ ఆడ పిల్లలకు చీరెలు గూడా విస్త్రీ చేపించి యత్తకెల్లి యిచ్చేవాడు. అమ్మాయిల్ను కాలేజీలో కుర్రోళ్లు అల్లరిపెట్టుంటే మన పాలెం కుర్రోళ్లని, ఐరన్ రాడ్లని తీసికెల్లి ఆళ్లని హడలెత్తించేశాడ్లే"

"అయితే శీనుగాడు రుస్తుం అయ్యాడన్న మాట"

"ఆ రుస్తువా పాడా! కూస్త గుండె కాయ కాస్త ధైర్యం గలోడ్లే. అంతే"

"నీ పోలిక రాలే. నా చెల్లెలు పోలికొచ్చిందంటావ్? " గలగలనవ్వాడు రామస్వామి.

"అవునే బావా! నీ కొడుక్కి మా మంగమ్మక్క బుద్దులొచ్చాయిగానీ నీ లుచ్చా బుద్దులు రానట్లేగదా!"

"అమ్మో బలేదెబ్బ కొట్టేవురా వీరయ్య

బావా నన్ను. మొత్తానికి గొప్ప మాటకారి వేనే..." అని రామస్వామి గుడిసెమీద నుంచి నిచ్చెన సాయంతో కిందికి దిగాడు.

సత్యం స్నానం చేస్తుండగా మంగమ్మ చెత్తాచెదారం వూడ్చి కాల్వలో పోసింది. రామస్వామి నులకమంచంలో వెల్లకిలా పడుకుని బీడి తాగుతున్నాడు.

వీరయ్య కూతుర్ని సత్యానికిచ్చి కట్టబెట్టా లని పట్టుదలగా వున్నాడు.

విషయం మంగమ్మతో కదుపుదామా, సత్యాన్నే అడుగుదామా అనే గుంజాటనలో వుండగా మంగమ్మ అంది,

"ఓ వీరన్నా పాక కొత్తది. బాగాపొందిగ్గా కుదిరింది. పెళ్లికళొక్కటే తక్కువ. మా సత్తే నికి పెళ్లి సేద్దామనుందయ్యా!"

"మీ సత్తేనికేవమ్మా కళ్లకద్దుకుని పిల్ల నిచ్చి ఎకరం పొలమిచ్చి చేసుకుంటారు. వాడికేం రాజాబిడ్డ"

"నీవంతగా మాటలతో మెచ్చుకోవటం కాదు. నీ కూతుర్నియ్యరాదా. మేం అలగా మూకని తటపటాయిత్తుండావా? "

వీరయ్య దిగ్గునలేచి మంగమ్మ చేతిలో చీపురుకట్ట లాక్కుని కిందపడేసి ఆమె చెయ్యి పట్టుకుని "ఈ మాటమీనే నిలబడు. మంచి రోజొచ్చి పిల్లని మీదని కాయంచేసు కుపొండి. తల తాకట్టుపెట్టి యీ నెల్లోనే పెళ్లి చేస్తా"

"అట్నేకానీ సత్తేం నామాట కాదన డులే"

రాత్రిపూట వురుములు, మెరుపులు ఉత్తర దిక్కునుంచి ఆకాశంలో నల్లని మేఘాలు పరుచుకున్నాయి.

భూమిలోంచి వేడిసెగలు వస్తుంటే పైనుంచి చల్లగాలి వీస్తోంది.

వారం కిందట తగలబడిపోయిన గడ్డివా ములమీది బూడిద గాలితోపాటూ తేలి పోతూ వీరయ్య ఇంటిచుట్టూ పరుచుకుంది.

కొన్ని వాముల బూడిద గుట్టల అడుగున ఇంకా పొగరాజుతూనే వుంది.

పేడదిబ్బలు మీద గాలిసుళ్లు తిరుగుతూ నిప్పురేపుతూ పొగతో వుక్కిరిబిక్కిరి చేస్తూనే వుంది.

అగ్నిప్రమాదం జరిగిపోయి వారం దినాలు దాటినా, గడ్డివాముల పేడ దిబ్బల బూడిద కిందయింకా నిప్పురగలటం వీరయ్య, కోటమ్మ, వీరమ్మలకు అమిత ఆశ్చర్యం గల్గించింది.

తమ రెండు వేల రూపాయలు ఖరీదు చేసే గడ్డివామి, బూడిద గుట్టగా మిగిలిపో తున్నందుకు వీరమ్మ, కోటమ్మా కుమిలిపో తూనే వున్నారు. గొడ్ల కోష్టాం కాలిపో యింది. ఇల్లు దక్కింది. అదిచాలు.

పాడిగేదల్ను కట్టు గుంజల్నుంచి తప్పించే ప్రయత్నంలో వీరమ్మ, కోటమ్మల మొండి ధైర్యం.సాహసాన్ని తల్చుకుంటుంటే తామేనా అట్టా తెగబడి నోరులేని జీవాల్ను కాపాడుకోగల్గింది... అని తెగ ఆశ్చర్యపోతు న్నారు.

వీరయ్య అన్నం తింటూ పెళ్లికబురు మెల్లగా పెళ్లాం చెవినేశాడు.

"ఓరి, నీయమ్మ కడుపు చల్లగుండా. ఇంటికి రాంగానే చెప్పలేదేం" వీరమ్మ ఆశ్చ ర్యంతో కోపం కలిపి చూస్తూ అంది.

"ఏందే? నా కడుపు చల్లంగుండాలంటు న్నావేందే వీరమ్మా? " కోటమ్మ కలుగచేసు కుంది.

"నీ మనవరాలికి, నీ పినతల్లి మనవడ్ని చెటిల్ చేశాడంట మీ అబ్బాయ్"

"నా పినతల్లి మనవడెవడ్రా అబ్బాయ్? ఆడెక్కడ్నుంచి వూడిపడ్డాడ్రోయి నాయనా"

"ఆడేనే అక్కమ్మ గోరి రామస్వామి కొడుకు సత్తెన్నారాయణే"

"ఆడంట్రా. రామస్వామిగాడి కొడుకా!




ఆడు దేశాలమీదికి పోయినోడంట్రా బాబా"

"సత్యం ఎంత బుద్ధిమంతుడో తెల్సా. బెజవాడలో ఆర్టీసి బస్సులు తోలతాడు. రెండువేలదాకా జీతం వస్తది. ఏందనుకున్నావో, కొంపలు కాలేయని తెలియంగానే రెండు వేలెత్తుకొచ్చి చిటికెలో, రెండు నిట్టాళ్ల పాక దిట్టంగా కప్పించాడు. వస్తువులన్నీ బుగ్గైనయిగా. అన్నీ కొత్తవి కొన్నాడు. అమ్మా, అబ్బలకి గుడ్డలు కొన్నాడు. ఏందనుకున్నావో"

"మరి అబ్బయ్యని ఇంటికి తీసుకురాపొయ్యావంట్రా. మేం చూసేవోళ్లంగదా"

"వాడ్కి శలవైపోయిందంట. సాయంకాలమే బస్సెక్కి వెళ్ళిపోయాడు"

"సత్తెం బుద్ధిగా డ్రైవరు పనిచేత్తున్నాడంటావ్. అనురాధ సుకపడద్ది. మంగమ్మ మెతకదే. దాని కూతుళ్లు సెట్కారీలు. రామసామి తాగుబోతోడు మరి"

"అడ్డగోలుగా ఆలోచిచ్చుమాక. పెళ్లాన్ని బెజవాడ తీసికెళ్తాడుగాని, కాలవకట్టమీద గుడిసెలో కాపరం పెట్టడుగా"

వీరమ్మ మెత్తబడ్డది. కట్నం కానుకల మీద లేనిపోని ఆశల్లేవు. నేనే ఎకరం పొలం పిల్లోడికిత్తా. పెళ్లి లచ్చనంగా చేత్తానన్నా మంగమ్మ సరే అంది. అసలు పెళ్లూసు ఆమె కదిపిందే ఎర్రి మొకవా" అన్నాడు వీరయ్య.

"అట్నా. అమ్మాయిని మొన్న సిన్మాహాలు కాడ చూసిందిలే మంగమ్మ. కన్నార్పకుండా చూసిందిలే" అంది వీరమ్మ.

"నా కూతురుకు వంక పెట్టేవాళ్లెవరు? బంగారు బొమ్మ. శ్రీదేవి వున్నట్టుంటదని దాని స్నేహితురాళ్లంతా అంటారు"

బయట పెద్ద వర్షం మొదలయింది.

అనురాధ, వీరమ్మ, కోటమ్మ ఒక్క వుదుట్న బయటికి పరిగెత్తి, పాడి, సూడిగేదెల్ని, పడ్డదూడలను విప్పుకొచ్చి ఇంట్లో వరండాలో గుంజలకు కట్టేశారు.

ఫెళఫెళ వురుములు, తళతళ మెరుపుల్తో కుండపోతగా వాన దంచిపారేస్తున్నది.

తడిగుడ్డలు పిండుకుని పొడివి కట్టుకుని అంతా మునగతీసుకుకూచున్నారు.

పిడుగులు పడ్డాయి దగ్గర్లో. వర్షం ఆగకుండా కుండపోత పోస్తున్నది.

కొంపలు కాలిపోయిన వాళ్ళ పాట్లు అంత యింతా గాదు, యీ వానలో పాపం' ' అన్నాడు వీరయ్య.

"మనకి రాత్రికి జాగారవే. గొడ్ల కాళ్ల మధ్యన పడుకోవాల"

"మన నెత్తిన గుడ్సెన్నావుంది. కూకోటానికి, ఆళ్ళెక్కడ తలదాచుకుంటారో"

దబ్బు, దబ్బుమని చప్పుడు చేస్తూ మొండిగోడలు కూలిన చప్పుళ్లు. పైన మెరుపులు, వురుములు, పిడుగులు. రాత్రంతా అలా కురుస్తూనే వుంది వాన. రోడ్లమీద మోకాలి లోతు నీళ్లు పారుతున్నాయి. వెయ్యి గుడిసెల బూడిద వాననీళ్లలో తుడిచేసినట్టు కొట్టుకుపోయింది. వారంరోజుల్నుంచి అగ్నిగుండంగా మారిన బజార్లు, పేటలు, ఈ వానధారతో చల్లబడ్డాయి.

దిక్కుతోచని అగ్నిబాధితులు వర్షంలో వణికిపోతూ రాత్రంతా గడిపారు.

★ ★ ★

తిలక్ గారికి జీవితం పీడకలలా ఉంది. లారీసంఘం కార్లో తిరుగుతూంటే కొత్త కొత్త విషయాలు తెల్సి వస్తున్నాయి. పరిచయస్థులే పాత మొహాలే కొత్త కొత్త కోణాల్లో చిత్రవిచిత్రంగా కనిపిస్తున్నారు. గత పది పదిహేనేళ్లల్లో తెగసంపాదించేసి, మిడిసి పడుతున్నవాళ్ళని చూశాడు.



తనని పక్క గౌరవిస్తూ, పెద్దనిచేసి తప్పుతూనే తన వెనకాల "ఆ తాగుమోతు మనిషి మాటలకేంలెండి" అంటూ తనను చులకన చేసిన సందర్భాలూ వున్నాయి.

తనకు పెద్దరికం ఇచ్చి తమ మధ్య కూచోపెట్టుకుని తామే నిర్ణయాలు చేసేస్తూ తనను వెర్రిపీనుగని చేసినప్పటి తన అనామకత్వం తల్చుకుంటే వళ్లు గగుర్పొడుస్తోంది.

వాళ్లలోవాళ్లు లోపల్లోపల ద్వేషించుకుంటూ లేనిపోని ఫోజులు పోతే మిడిసిపడ్డ క్షణాలని తలుచుకుంటే నవ్వొస్తుంది. ఈమధ్యనుంచి తిలక్‌గారికి పరధ్యానం ఎక్కువైంది. దిద్దుకోలేని పొరపాట్ల మధ్య చిక్కుకున్నానని తెల్సుకోవటంవల్ల ఆత్మవిశ్వాసం లోపించింది. తనమీద తనకే కోపం వస్తోంది. లక్షాధికార్లైన తన స్నేహితులమీద కోపం, వాళ్ళతో ఢీకొనే శక్తిలేదనే తాపం!

ఇంటి పరిస్థితులేమో కృంగదీస్తున్నాయి. పెద్దకొడుకు చెడిపోయాడు. భార్య వదిలేసింది. వాడెట్లా బాగుపడతాడో, పెళ్లి కాని కూతురు. తగిన దారి చూపించలేకపోతున్నాడు.

"నాన్నా కాఫీ" భారతి గ్లాస్ అందిస్తూ ప్రేమగా నవ్వింది. పొద్దుటినుంచి ఈ రకం నవ్వుతో ఐదారుసార్లు తిలక్‌గార్ని పరవశింపచేసింది. అడిగి అడక్కముందే షేవింగ్ సెట్ అందించింది. స్నానానికి వేడినీళ్లు, టవల్ సిద్ధం చేసింది. సిల్కులాల్చీ ఖద్దర్ పంచ, కండువా యిస్త్రీ చేసినవి అద్దంపక్కన పెట్టింది. ఇప్పుడు కాఫీ గ్లాస్!

"ఏంటి తల్లీ పొద్దుటినుంచి సమస్తోపచారాలతో వుక్కిరిబిక్కిరి చేస్తున్నావ్"

"అరుణను చూడాలని వుంది నాన్నా"

"అమ్మ వెళ్ళమంటే వెళ్ళి చూసిరా, దాన్దే వుంది పిచ్చి తల్లీ"

రెట్టింపు ఉత్సాహంతో తల్లిని కావలించుకుని, విషయం చెవిన వేయగానే రాధమ్మ గారు రుసరుసలాడింది. "బావుందే నీ వాలకం. తోచితోచనమ్మ మొగుడ్నొదిలిన వదినను చూట్టానికెల్తుందంట" అని ఎద్దేవా చేసింది.

"ఐతే వాళ్ళ సంగతే పట్టించుకోవద్దంటావా మరి" అంటూ గునిగింది భారతి.

"ఆ పిల్లరాదే పిచ్చిమొహమా. ఈ బెడదల్లోంచి బైటపడ్డది. మళ్ళీ వచ్చి ఇరుక్కుంటుందా! నీకుమల్లే ఉద్యోగం చేసుకుని తెరిపిన బడాలనివుంది"

"నే వెళ్తే అన్ని సంగతులు తెలుస్తాయ్ గామ్మా"

"చెప్పాగా. నాకిష్టంలేదు. వెళ్తే వెళ్ళిరా. నేనెవర్నీ ఆపేస్థితిలో లేను" అని భారతి చేతుల్ను తన భుజంనుంచి విదిలించేసింది రాధమ్మ. భారతి నిరుత్సాహంగా గోడకు ఆనుకుని తల్లిని చూస్తూ వుండిపోయింది. రాధమ్మ కూతుర్ని చూసి "పిచ్చి సన్నాసిని పాపం అన్ననూ, వదిన్నూ కలపాలని తాపత్రయం. కాని మన మొగాళ్ల తాగుబోతులాయిరి. ఈ కొంపకు చేటు తెచ్చిందెవరు?

మీ నాయనా సక్రమంగా ఉంటే ఈ క్షోభలుండేవా? అబ్బ తాగి అర్ధరాత్రి కొంపకొస్తే కొడుకు తాగి మూడోజాముకు వస్తుండే. రాత్రిళ్లు తాగుమోతులు. పగలు ప్రజానాయకులూను" టి.వి. ముందు కూర్చున్న భర్తకు వినపడేట్టుగా అంటూండగా వాకిట్లో మోటార్ సైకిల్ ఆగింది.

బోస్ విసవిసా నడిచి వస్తూ గృహవాతా

వరణాన్ని పసికట్టేశాడు. చేతిలోని విస్కీసీసాను దాచటానికి తంటాలుపడ్తూ తన గదిలోకి దూసుకెళ్ళిపోయాడు. తిలక్‌గారు చల్లగా జారుకున్నారు వూరిమీదకు. భారతి బోస్ గదిలోకెళ్ళి తన ప్రయాణం గురించి సలహా అడగ్గానే బోస్ పెళ్లున నవ్వి "ఈ ఇంట్లో అందరికీ అన్నిరకాల స్వేచ్ఛాస్వాతంత్రాలున్నాయ్. ఎక్కడికైనా పోవచ్చు ఎప్పుడైనా రావచ్చు ఏమైనా చేయవచ్చు" అన్నాడు.

భారతి అందుకుంది. "నీవు తాగుడు మానవచ్చుగదా"

బోసు నవ్వుతూ, "మానాలనే అనుకుంటున్నా, కాని మానెయ్యలేకపోతున్నా. మనం మన అదుపులో ఉండలేకపోతున్నాం"

"ప్రయత్నిద్దూ! కొద్దికొద్దిగా తగ్గించుకుంటూరా. నిదానంగా దోవలో కొస్తావ్"

"నిజవే. ఈ రాత్రి బ్రేక్ ఇనస్పెక్టర్ గృహ ప్రవేశం కొత్త ఇంట్లోకి. టౌన్లో ముఖ్యులు యాభైమందికి కాక్‌టైల్ పార్టీ ఇస్తున్నాడు. నేను ముఖ్యుల్లో అతిముఖ్యుడ్ని. పోవాలా? వద్దా? ఈ సొసైటీలో విశాలంగా, విశ్రాంతిగా, ఖుషీగా గడపాలంటే ఈ రకం సంబంధాలు కొనసాగించాల్సిందే అమ్మడూ!'

భారతి గాయపడ్డ హృదయంతో గిలగిలలాడుతూ విషాదంగా చూసింది.

"లాయర్ శ్రీనివాసరావుగారు పూర్తిగా మానేశార్టగా అన్నాయ్. వాళ్ల అమ్మాయ్ నాతో చెప్పింది"

"శీనుగాడా! వాడ్ని డాక్టర్ చస్తావురా అని భయపెట్టాడు. తను చస్తే ఈ పిల్లాపీచు ఏమౌతారో అని దిగులేసి మానేశాడు. మనకెవరున్నారే? పెళ్ళాం బిడ్డలు లేని స్వేచ్ఛాజీవిని"





బయటికొచ్చి జీవితాన్ని చేతులారా నాశనం చేసుకుని, పశ్చాత్తాపపడుతూ కుములుతున్న అన్నని తల్చుకుని బాధపడింది భారతి.

రాధమ్మ కాఫీ గ్లాసుతో బోసు గదిలోకెళ్ళటం చూసి భారతికి గుండె చెరువైంది.

ఆ సమయానికి అక్కడ లేని అరుణ తలపుకొచ్చింది. స్త్రీ ప్రతిక్షణం పరాభవం, హేళన భరిస్తూ, రోజులు గడుపుకుపోవటం చాలా యాతనే.

చావుకంటే ఘోరమైన యాతనలు అనుభవించే మౌనంగా వెళ్ళిపోయింది గావల్ను అరుణ.



భారతి బస్ ఎక్కి కూచుని నిబ్బరంగా గాలి పీల్చుకుంది.

కొత్త వాతావరణంలో వారం పదిరోజులు గడపబోతున్న ఉత్సాహం ఆమెలో సెలయేరులా గలగల పారుతున్నది.

అరుణ పుట్టింట్లో ఊహాతీతమైన ఆత్మీయత, హృదయాలని స్పందింపచేయగల ఆదరణ అపారంగా వుందని భారతి ఎప్పుడో గ్రహించింది.

ఉన్నత కుటుంబాలలో జరిగే ఘోరాలు పరువు ప్రతిష్టల గోడలు దాటి బైటపడలేక లోపల్లోపలే అణగారిపోతూ ఎండిపోతున్నాయనిపించింది భారతికి.

బస్ వేగంగా పోతున్నది. చుట్టూ పత్తి,

మిర్చి పొలాలు పచ్చగా నయనానందక రంగా, లేత ఎండలో ఆహ్లాదాన్ని కలిగిస్తు న్నాయి.

చేలల్లో పనికెళ్లటం కోసం గుంపులు గుంపులుగా స్త్రీలు పిల్లలు గట్లమీద పరు గులు తీస్తున్నారు.

తారు రోడ్‌మీద లారీలు, బస్‌లు పోతూ వస్తూ సందడి చేస్తున్నాయి. రోడ్డుపక్కనే బోల్తాపడ్డ ఓ లారీ చక్రాలు ఆకాశాన్ని చూస్తూ ఆశ్చర్యాన్ని కల్గిస్తున్నాయి.

భారతి కిటికిలోంచి ఆ దృశ్యాలను చూస్తూ పరవశించిపోతున్నా, అప్పుడ ప్పుడూ లేనిపోని భయాలు దూసుకువ స్తూనే వున్నాయి.

వెంటనే కొత్త కొత్త ఆశలూ మళ్ళీ విశాల మైన పచ్చని చేలులాగా పరుచుకుంటు న్నాయి.

అరుణను తల్చుకుంటేనే మనస్సులో వాగులు, వంకలు గలగల ప్రవహిస్తున్న ట్లుగా అనిపిస్తుంది.

వెంటనే గతించిపోయిన జీవితం తాలూకు చేదు అనుభవాలు బండరాళ్ళు లాగా, అడ్డుగా నిలబడి కనిపించి విసికి స్తాయి.

ఇల్లు, తాగుబోతు తండ్రి, అన్న వాళ్ళ అరుపులు ఆగడాలుతో గుండె దడదడలా డుతూ వుంటుంది.

అరుణ వాళ్ళ ఇంట్లో వారంరోజులు స్థిమి తంగా గడపొచ్చనే ఆలోచనలో కలలు కంటూ ఉల్లాసంగా వుంది భారతి.

బంధుత్వాలు దూరమై, లేనిపోని కల తలు విరోధాలు దాపరించాయి. తన రాయ భారం భార్యాభర్తల మధ్య కలతల్ను తీసే యగలదా? ఏ గొప్ప మార్పులు బోసుబా బులో వచ్చాయని తను అరుణకు చెప్పగ లదు.

బస్ ఆగింది. భారతి బస్ దిగేప్పటికి ఎండ కరకరలాడుతున్నది.

అరుణా వాళ్ళ వీధి గుర్తుల్ను జ్ఞాపకానికి తెచ్చుకుంది. చింతచెట్లు దాటంగానే అరుణా వాళ్ళ ఇల్లు కాంపౌండ్ గోడ కనిపిస్తుంది.

భారతి చేతి సంచితో రోడ్డుపక్కగా కాలి బాటమీద పోతూ, ఇరువైపుల ఇళ్లని చూస్తూ నడుస్తున్నది.

పాత పెంకుటిళ్లు, పడిపోయిన ప్రహరిగో డలు, చీమిడిముక్కు పిల్లలు.

ఓ స్త్రీ ఇంటివాకిలి ఊడుస్తున్నది. ఆవిడ వీపుమీద చంటిపిల్ల, కోతిపిల్లలా వాటేసుకు న్నున్నది.

మొగాడు నులకమంచంమీద పడివు న్నాడు. కూలి చేసివస్తూ కల్లు దుకాణంలో తాగొచ్చినట్లు వున్నాడు.

ఆ స్త్రీ కూడా కూలిపనికెళ్ళి ఇప్పుడే కొంప కొచ్చినట్లుంది.

ఇంటిచాకిరికి నడుం వంచింది.

పిల్లల్ని సముదాయించుకుంటూ ఇల్లువా కిలి వూడ్చుకుని అన్నం వండి తాగొచ్చిన మొగుడ్ని లేపి అన్నం పెట్టాలి. వాడి తాగుమోతు కళలన్నింటిని భరిస్తూ, తన పనులు వగతెంచుకోవాలి.

అరుణా వాళ్ళ ఇంటి ప్రహరిగోడ తుఫా న్‌కు మొత్తం పడిపోయినట్లుంది. ఆ పడి పోయిన రాళ్ళనే పేర్చి గోడ ఆకారం కల్పిం చారు.

షామియానాలు కనిపిస్తున్నాయి. ఏదైనా శుభకార్యమా?

ఆవరణలో చాలామంది ఆడవాళ్ళు కూచుని వున్నారు. భారతి ఆశ్చర్యంగా చూసి, తేరుకుని చివరికెళ్ళి కూర్చున్నది. వెంటనే భారతికి వాతావరణం అర్థమైపో యింది.

మహిళల సమావేశంలా ఉందనిపించి కుతూహలంగా చుట్టూ చూసింది. అక్కడ

చేరిన వాళ్ళలో ఎక్కువసుంది పొలంపను లకెళ్ళే స్త్రీల్లాగే వున్నారు.

బల్ల వెనుక కుర్చీల్లో కూర్చున్న ఆ యిద్దరు స్త్రీలనీ ఎక్కడో, ఎప్పుడో చూసిన జ్ఞాపకం.

ఓ పొడుగాటి ఆవిడ లేచి మాట్లాడుతు న్నది.

ఏదేశంలోనైనా స్త్రీలు యదార్థ గౌరవం పొందాలంటే వారి స్వయంకృషి, చైతన్యం చాలా ముఖ్యం.

మన సమాజంలో తీవ్రంగా ఆలోచించా ల్సినవి చాలా వున్నాయి. పైకి కనపడేవి కొద్దే. కనపడకుండా మనల్ని వేధించేవి, పీడించేవి బోలెడు.

యిందాక మన లక్ష్మిగారు చెప్పినట్లుగా సామాన్యులకు కనిపించేవి కొన్ని. మేధావం తులకు తెల్సేవి కొన్ని.

మన సమాజంలో స్త్రీలను ఉద్ధరించటా నికి గొప్ప సంఘసంస్కర్తలు బయలుదేరి కృషి చేసిన విషయాలను వనజాక్షిగారు మనకు చాలా తెలియచేశారు.

స్త్రీ సమాజాలు, అభ్యుదయ మార్గంలో కృషిచేసే కార్యకర్తలు, స్త్రీ జాతి విముక్తి కోసం చేయాల్సిన కార్యక్రమాలను ఉదయం గారు నిన్న మనకు వివరించారు.

నవజాతి నిర్మాణం కోసం, సోషలిస్టు దేశాల్లో స్త్రీ పురుషుల పరస్పర సహకా రంతో, ఆర్థిక, సాంఘిక రాజకీయ వ్యవస్థ, సోషలిస్టు సమాజం దిశగా పయనించి ఏయేఘనకార్యాలు సాధించారో సుగుణ గారు మనకు కళ్లకు కట్టినట్లు చెప్పారు.

మనదేశంలో నేటి ఆర్థిక సాంఘిక వ్యవస్థ స్వరూపమే పూర్తిగా మారనిదే స్త్రీ బానిస సంకెళ్ళనుండి విముక్తి కావడం అసంభవం.

ఆర్థిక సమానతే స్త్రీ విముక్తికి, పురుష విముక్తికి తద్వారా మానవుని సంపూర్ణ స్వాతంత్ర్యానికి ఏకైక మార్గం.

మార్క్స్, ఎంగెల్సు చెప్పినట్లుగా సాంఘిక ఉత్పత్తి కార్యకలాపాలనుండి స్త్రీలు మినహాయించబడినంతకాలం, వారు యింటిపనులకే పరిమితం చేయబడినంతవ రకూ విమోచన, స్త్రీ పురుష సమానత్వం అసంభవం, అత్యాచారాలన్నీ ఎక్కువగా సమాజంలో అట్టడుగు వర్గాలమీదే జరుగు తున్నాయి. ఏకాకులై చిక్కిపోయిన అబలల మీద అత్యాచారాలు సునాయాసంగా జరు గుతున్నాయ్.

ప్రజల చైతన్యాన్ని సక్రమ మార్గంలో నడ పటానికి మన మహిళాసంఘం కృషిచే స్తూనే వుంది. ఈ కృషి చాలదు. స్త్రీలలో ఇంకా చైతన్యం, సంఘటిత శక్తి పెంపు చేయాల్సిన అవసరం చాలావుంది.

పోలీసు వ్యవస్థలోను, దాని ప్రజావ్యతిరేక స్వభావంలోను ఏమీ మార్పులేదు.

ఈ శాఖలో కొందరు క్షుద్రులు పెచ్చరిల్లి నేరాలు నిర్భయంగా చేస్తుంటే దిక్కెవరు?

శ్రద్ధగా, ఆసక్తిగా వింటున్నదల్లా, తన భుజంమీద చెయ్యి పడగానే పక్కకు తల తిప్పి చూసింది, భారతి.

నవ్వుతూ కనిపించింది అరుణ.

తనను ఆశ్చర్యంగా, అనురాగంగా చూస్తున్న వదినను, కుతూహలంగా, ఆప్యా యంగా చూసింది భారతి.

"ఎప్పుడొచ్చావ్?" మెల్లగా రహస్యంగా అరుణ అడిగింది.

"పావుగంట ఐందోయ్ వచ్చి. నీవు కనిపి స్తావేమోనని చూశా. గమ్మున ఈ చివర్న చతికిలపడ్డా. బ్రహ్మాండంగా మాట్లాడేస్తున్నా రీవిడ"

"మూడు రోజుల కిందట వచ్చుంటే ఇంకా బ్రహ్మాండంగా మాట్లాడినవాళ్ళ ఉపన్యా సాలు వినే చాన్సు తగిలుండేది"





"పోవోయ్! యిట్లా సంగతని కార్డురా సుంటే రాకపోయానా? మంచి చాన్సు పోగొట్టేవ్ నాకు"

"క్షమించు భారతీ. నీవు రావనుకున్నా"

"వెతుక్కుంటూ వచ్చాగా మరి"

"నీలో ఆ ఔన్నత్యం వుందనుకో మొద ట్నుంచీ"

"అట్లా మాట్లాడమాక. నేను నీ గొప్పత నాన్ని మొహంమీదే అనాల్సి నస్తుంది"

"అంతా బావున్నారా? "

"ఆ...!"

"కాస్త టీ తాగుదువుగానిరా" అని లేచింది అరుణ. ఆవిడ వెనకాలే బయలుదేరింది భారతి.

గాడి పొయ్యిదగ్గర అరుణ అన్న గోర్కి పెత్తనం కట్టుకుని వంటవాళ్ళకేవేవో సలహా లిస్తున్నాడు.

భారతి రెండు గ్లాసులతో టీ తీసుకొ చ్చింది. ఇద్దరూ నిలబడే తాగుతున్నారు.

"ఒరే గోర్కి, ఈ కామ్రేడెవరో గుర్తు పట్టావా? " అని గోర్కిని దగ్గరకు పిల్చింది.

భారతిని చూసి నవ్వుతూ, "ఓహో! తమరా! రెడ్ శాల్యూట్ భారతీ" అని చెయ్యి చాపేడు.

భారతి నవ్వి కాస్త సిగ్గుపడుతూ.

"మాకింకా అంత చైతన్యం కలగలేదండీ.

మాకింకా పాత అలవాట్లు, సాంప్రదా యాలు వదల్లేదండీ"

"వాటికి వ్యతిరేకంగా, దృఢంగా, పోరాటం సాగించటానికి కృషి ముఖ్యం"

అరుణ నవ్వుతూ మధ్యలో కలుగచేసు కుంది "ముందు టీ తాగసియ్యరా బాబు! తర్వాత నీ పోరాట పంథా గురించి అదర కొడుతువు గానీ"

"స్త్రీకి చైతన్యం పెరిగితే మొగాడికి లేని పోని బెడదలు తప్పిపోతాయ్. స్త్రీ హృద యంలో జ్ఞానదీపాలు వెలిగితేనే ఈ దేశంలో విప్లవం విజయవంతం అయ్యేది"

యిద్దరూ టీలు పూర్తి చేశారు.

"అన్నం, కూరా, పుల్సు, పచ్చడి తయారై పోయాయి. మీరు తయారవ్వండి"

"అక్కడ ఉపన్యాసం పూర్తికాందే" అంటూ అరుణ కదిలి సభలో కొచ్చి కూర్చుంది. భారతి ఆమెను వెంబడించింది.

ఉపన్యాసం ముగిసింది.

తీర్మానాలు చదువుతున్నారు.

తీర్మానాలు కాగానే అంతా లేచి అన్నాలు తిన్నారు.

కొందరు నిద్రల్లో పడ్డారు, కొందరు యిళ్ళకి బయలుదేరుతున్నారు.

భారతి జంపకాన దులుపుకుని వేపచెట్టు నీడన వేసుకుని నిద్రపోయింది.

★ ★ ★

"ఏది ఏమైనా సరే! మేము మా ఆదర్శా లతో బతకటానికే నిశ్చయించుకున్నాం" అన్నట్లుగా జీవితానికో ధ్యేయాన్ని పెట్టుకుని కృషిచేస్తున్నది ఆ కుటుంబం, అని భారతి గ్రహించింది.

సాటి స్త్రీలలో చైతన్యం పెంచటానికి, అరుణ కుటుంబం పాటుపడటం చూస్తుంటే భారతికి ఎంతో ఆశ్చర్యం వేసింది.

ఈ ఆవరణలోని వాతావరణం గమనిం చిన భారతి, అరుణతో జోసన్నయ్య వ్యక్తి గత సమస్యను ముచ్చటించటానికి ఆసక్తి చూపలేదు. దాన్ని కాలమే పరిష్కరిస్తుం దనే నమ్మకం మిగిలింది.

అరుణ కూడా ఆ ప్రసక్తే తీసుకురాలేదు. అదో సమస్యగా భావించుకోవటం లేదుగా వల్సు.

మహిళాకార్యకర్తలంతా వెళ్ళిపోయాక యిల్లు బోసిగా కనిపించింది. యింటికంతా పదిమంది మిగిలారు. యింట్లో ఎక్కడ చూసినా పుస్తకాలే.

భారతికి కొబ్బరినూనె సీసా, దువ్వెన తెచ్చియిచ్చింది అరుణ పెద్దక్క నటాషా.

ఆమె యింట్లో ఎవ్వరితోనూ కలుపుగోలుగా వున్నట్లు అనిపించదు.

వరండాలో కూచుని పిల్లలకు ట్యూషన్లు చెప్తూనో, ఒంటరిగా కూర్చుని పుస్తకాలు చదువుతూనో సీరియస్ మొహం పెట్టుకునుంటుంది.

అరుణ అన్నతో అరుణ పెళ్ళిలో కాస్త పరిచయం భారతికి. ఐదారేళ్ళకిందట అరుణను దిగపెట్టటానికొచ్చి వెంటనే వెళ్ళిపోయాడు గోర్కి. అతనితో అరుణ విషయం మాట్లాడటానికి ధైర్యం చాలటంలేదు భారతికి. అరుణ అమ్మమ్మతోనే కదపాలి అనుకుంది.

భారతి జుట్టుకు నూనెరాసుకున్నాక "సీసా ఎక్కడ పెట్టమంటారు జేజమ్మా" అని పలకరించింది.

"అక్కడే ఎక్కడన్నా పెట్టమ్మా! యింకా ఈ మాయదారి మంద సిగలున్నాయిగదా!' అందామె.

గోర్కి బయటకెళ్ళేవాడల్లా వెనక్కొచ్చి "భారతీ! మా అమ్మమ్మను పలకరించమాక. నిన్ను హడలకొట్టేస్తుంది. పాతపురాణం తవ్వి నీ మైండ్ ఖరాబు చేస్తుంది. ఆ దెబ్బతో ఎంత తొందరగా పారిపోతే బావుణ్ణనిపిస్తుంది నీకు. వారం రోజులుండదల్చుకుని వచ్చావుగా, వెళ్ళబోయేపుడే, "వెళ్తున్నా జేజమ్మా" అంటే చాలు" అన్నాడు నవ్వుతూ.

భారతి బిత్తరపోయింది.

"ఇను కూతురా, నా అల్లుడ్ని నువ్వు పుట్టక ముందు ఈ వూరి కాంగిరేసోళ్ళు, పోలీసులికి పట్టిచ్చి, చింతల తోపులో కాలిపించారు.

"నేను నా కూతుర్ని కనిపెట్టుకునే ఈడనే పడుండా! నా ఒక్కగానొక్క కొడుకుని జాన్సికిచ్చి చేశా. ఎందుకని? ఈళ్లందర్నీ కడుపులో పెట్టుకుని సాకాల్సిన నా కూతురు అర్ధంతరంగా సచ్చిపోబట్టి. నా కొడుకుని పదేళ్లనాడు నక్సలైటని అయిపులేకుండా సేసి నా కడుపులో చిచ్చుపెట్టారు. నా పెద్ద మనవరాల్ను సూస్తుంటే కడుపు సంద్ర మౌద్ది. దానికిద్దరు కూనలు.

"నా సిన్న మనవరాల్ను అరుణమ్మని నా పిన్నాంకూతురు కొడుకు బోసుబాబుకిప్పించాయామైంది. ఆ సచ్చినోడు తాగుమోతు లండికొడుకై అరుణమ్మని చెండుకు తింటుంటే ఆ పిల్ల పుట్టింటికి పారిపోయొచ్చే

"ఇంకా ఈ ఇంటినపడి సేకిరి చేస్తా బతికుండా. నా మనవుడు గోర్కిగాడు పెళ్లిపెటాకులు మానేసి రాసకీయాల్లో తిరగతానే యగసాయం సూసుకుంటా ఉన్నాడు.

"వద్దుర తండ్రే! అలివిగాని యగసాయం సెయ్యమాక. అని నెత్తినోరు బాదుకున్నా వినకోకుండా కొత్తరకం పత్తంట పదెకరాలు సేద్యం తలకెత్తుకున్నాడు. ఇంటో వుండే అడుగుబొడుగు బంగారం తాకట్టు పెట్టి యవసాయ కర్చులకి ఎదసల్లేడు. ఇదమ్మా మా ఘోస.

"చూశావుగా వారం రోజులుమట్టి సుట్టుపక్కల ఆడపాపలంతా వచ్చి కూకుని సభలు సేసుకుని పోయారా. ఓరి సాకిరీ వారు సేసుకున్నారు. ఆడా ఈడా వసూలు సేసుకొచ్చి బువ్వల్తిని పొయ్యారనుకో! మాట సామెతకి అంటున్నాలే! ఏమనుకోకు.

"ఆడబతుకులు అన్నేయాల పుట్టలు! ఇంతకూ నేసెప్పొచ్చేదేంటంటే రాధమ్మ




కూతురా! శానా దూరాబారం లెక్క సెయ్య కుండా వచ్చావ్ సూసిపోటానికని. నాకు చాన సంతోషంగుంది. కమ్మంగా వుండు. నీక్కావల్సినయి అడిగి సేపించుకు తిను.

"ఆడపిల్లలు ఇహ సాహసంగా ఆళ్ల యవ్వారాలాళ్లు సూసుకోవల్సిందే. నీకిష్టంగుంటే నా సెవినెయ్యి. నా మనవడు గోర్కిగాడ్ని సూశావుగా. ఆడు నిండుకుండ ఏవనుకున్నావో. ఎగసాయం చదువంట, బాపట్లో ఐదేళ్లు సదివేడు. ఆడి బాబు పోయేనాటికి ఐదేళ్లోడు. మీ యిద్దరికీ జోడు సరిపోద్ది. బాగా ఆలోసించుకు సెప్పు. నేనొచ్చి మా రాధమ్మతో మాటకలపతా. మీ అయ్యగూడా సస్తున్నాడంటగా తాగి. నా మాట కూస్త కటువులే, నేనెప్పుడూ ఓర్నీ లెక్కచెయ్యలా! ఓర్నీ అవమానం కూతకూ యలా. కుండ పగలేసినట్లంటా అంతే!" అంది ఆ వృద్ధురాలు.

★ ★ ★

పిండార పోసినట్లున్న వెన్నెల్లో జీప్ గతుకులరోడ్డు మీద నిదానంగా పరిగెత్తుతోంది.

రోడ్డుకిరువైపులా సరివి తోపులు మామిడి తోటలు, వెన్నెల్లో నల్లని గుట్టల్లా భ్రమింప చేస్తూ ఈదురుగాలికి అప్పుడప్పుడు గుబురుగా వూగుతున్నాయి.

జీప్‌లో కూర్చున్న వాళ్లు అప్పుడప్పుడు తలలు తిప్పి చూస్తున్నా వాళ్ల మెదళ్లలో వేరే ఆలోచనలు విజృంభిస్తున్నాయి.

జీపు మలుపు తిరిగింది. కాలవకట్టమీద చలిమంటవెలుగు. నల్లని ఆకారాలు, అటు యిటూ తిరుగుతున్నాయి.

జీపుని ఇసక నేల మీద పడవలా ఊగిస లాడుతూ పోనిస్తున్నాడు డ్రైవర్.

చలిమంట దాపున గుడిసెలు చెల్లాచెదరుగా కనిపిస్తున్నాయి. గుడిసెల దగ్గర జీపు ఆగింది. చలిమంట చుట్టూ దిసమొలలతో పిల్లలు, జోగుల్లాంటి ఏనాదులు, డోలు వాయించుకుంటూ, పాటలు పాడుతూ, ఈలలేస్తూ వాళ్ల ప్రపంచంలో వాళ్లు ఆనందంగా గడిపేస్తున్నారు. వాళ్లు జీపు వెల్తుర్లో ఒక్క నిమిషం వెలిగి మళ్లీ చీకట్ల పాలైనారు. వాళ్ల డోలు చప్పుడు ఆగింది. పాటలు, ఈలలు ఆగాయి. జీప్ లోంచెవరూ దిగలేదు.

'నర్సిగా' అనికేక జీపులోంచి.

"లేడో!" మంటదగ్గర్నుంచి సమాధానం.

"సీతయ్యా"

"లేడో!

"చిన్నోడో"

"ఒరులేరండి, సామీ" అని స్త్రీ గొంతు వినిపించింది.

"చెంచమ్మేనా చెప్పేది" జీపులోంచి మొగ గొంతుకకేక.

"అవునో! ఏందంట... మొగోళ్లు కాలవకట్టకి ఎల్లిండ్రు. గేస్ లెవిట్లు ఎలిగించుకొని తీసుకెళ్లిన్రు"

"సరే రేపు సరుకు తెస్తారన్నమాట కాయంగా"

"తెత్తారు సామీ, డబ్బులు పార్నూకండి సామే"

"ఇస్తాంలే"

తెలివిమీరిన జనం కూలి జనం చేత చాకిరి చేయించుకోవటం మరిగేరు. వాళ్లని తమ గుప్పిళ్లలో బిగించుకోవటానికి కావల్సిన కుయుక్తులన్నింటిని సమయం, సందర్భం తెల్సుకుని వాళ్లపై ఉపయోగించి కావల్సిన ఫలితాలను పొందుతున్నారు.

మద్రాస్‌నుంచి వచ్చే కప్పలవ్యాపారస్థులు, ఈ ప్రాంతపు ఏనాదులకు కూటికి డబ్బులిచ్చి చేతికి పెట్రోమాక్స్ లైట్లిచ్చి రాత్రిళ్ల వాళ్లచేత మైదానాలలో, కాలవ అంచుల్లో, దొరువుల్లో, మామిడి తోపుల్లో బతికే

కప్పల్ని పట్టించి గోతాల్లో, డబ్బాల్లో ఇసు ముక్కలమధ్య వేయించి మద్రాస్‌కు రవాణా చేస్తున్నారు.

చీకటిమధ్య చలిమంట వెలుగు పెరిగింది. డోలు మోత ఎక్కువైంది. ఏనాదులు వాళ్ల ఆనందంలో లీనమైనారు.

జీపులో వచ్చిన వాళ్ల పని పూర్తయింది. దూరంగా సరివి తోపుల్లో పెట్రొమాక్స్‌లైట్లు అప్పుడప్పుడు కనిపించి కొరివి దయ్యాల్లాగా మాయమౌతున్నాయి. పొట్ట తిప్పల కోసరం ఏనాదులు రాత్రిళ్లు గుడిసెలొదిలి, నిద్రలు మాని చీకట్లో పాముల్ని లెక్కచేయక కప్పలవేట సాగిస్తున్నారు. యజమానులు జీపులో కూచుని వాళ్లని తనిఖీ చేయటానికి వచ్చిపోతున్నారు.

జీపువెనక్కి తిరిగింది. చీకట్లో యిసక భూమిమీద మెత్తగా నిదానంగా పోతుంది.

వాళ్ల చెవులకు ఏనాదుల డోలు చప్పుడు వినిపిస్తూనే వుంది. అరుదుగా అప్పుడప్పుడూ కొరవిదయ్యాల కాంతి కనిపించి మాయమౌతోంది.

"ఇది ముగ్గురు బిడ్డల తల్లైనా ఏనుగగున్నలా వుంటది రా సాంబా" అన్నాడు జీప్ డ్రైవర్.

"మొన్న దీన్ని మార్కెట్‌కాడ డాషిచ్చా తప్పుకుని సణుగుతూ వెళ్లింది"

"దీన్ని మామిడి తోటలోకో సర్వితోపులోకో లాక్కెళ్లాలిగాని, మార్కెట్ కాడ సినీమా హాల్‌కాడా ఏంటిరా సాంబా"

"రయిక కొనుక్కోవే జ్యోతిలక్ష్మి అని నోటు చూపిస్తే చాలు రయ్‌మని మన వెనకాలే వస్తర్రా! మీకేం తెల్సురా" అని తన విజ్ఞానానికి తనే వెకిలిగా నవ్వుకున్నాడు జోసఫ్.

"ఈ సీజనైపొయ్యేలోగా దీన్ని లొంగతీసుకోవాల"

"అంతదాకానా, జీపుని వెనక్కి తిప్పు గుడ్సెలోంచి లాక్కుని జీప్‌లో నూక్కెళ్లదాం దాన్ని. నా తడాఖా చూపిస్తా" సాంబడు ఆవేశంగా పోజుపెట్టాడు.

వాడ్ని భుజం తట్టి మెచ్చుకున్నాడు జోసప్.

"ముందు సారా దుకాణం కాడకెళ్లి మళ్లీ వద్దాంలే బాయ్" అన్నాడు డ్రైవర్ బుడే.

రెండు నిమిషాల్లో సారాయి దుకాణం ముందు జీపు ఆగింది. అంతాదిగి, వళ్లు విర్చుకుని గొప్ప రౌడీ పోజులో మోరలెత్తుకుని నాలుగఃగుగులు వేశారోలేదో కంగుతిన్నారు. వాళ్ల గుండెలు జల్లుమని దడదడ కొట్టుకోసాగేయి.

పోలీస్‌జీపు ముందు సీట్లో ఎస్సై కోటారెడ్డి నిండుగా ఠీవిగా ఫీల్డు మార్షల్ పోజులో కూర్చుని వున్నాడు. అతని ఎడం కాలు జీప్ బయట అంచున నిగనిగలాడుతున్న బూటును నిగడతన్ని మరీ కూర్చున్నాడు.

వీళ్లకు చచ్చినంతపనైంది. ఇపుడిక్కడ ఈ నా కొడుకు ఎదురైనాడేంటి భగవంతుడా అనుకుంటూ "నమస్కారం సాబ్" అనేసి చేతులు కట్టుకుని నిలబడేలోపునే యస్సై గాండ్రించాడు "ఇటేం పన్రానా కొడకల్లారా?"

"మరేసార్! అదే సార్! ఏనాదోళ్ళు కప్పలేటకెళ్లేరోలేదో మా వోన్రుగారు చూసిరమ్మంటే వచ్చాంసార్" అన్నాడు జోసఫ్. ఈ మూడు మాటలు చెప్పేటప్పటికి నోట్లో తడి ఆరిపోయింది. రెండుసార్లు చేతులు పట్టుతప్పాయ్!

"ఎవడుబే మీ ఓనర్?"

"తంగవేలు, డేవిడ్‌రాజు, మద్రాస్‌వాళ్లు సార్"

"రేపోసారి స్టేషన్కొచ్చి కనపడమని చెప్పు"




"సరే సార్"

"కప్పల వ్యాపారంతోపాటు స్మగ్లింగ్ బిజినెస్, చీటింగ్ బిజినెస్ గూడా చేస్తున్నార్టగా'

"లేద్సార్"

"నీకెంతెల్సునూ నా కొడక? తెలీనట్లు అమాయకుడిలా పోజ్‌పెడ్తున్నావ్. ఇరగ తీస్తా రాస్కెల్. జీప్ ఎవర్ది కప్పలోళ్ల దేనా? "

"కాద్సార్ కాంట్రాక్టర్ బాపయ్యగార్దండి"

"డ్రైవర్ ఎవడ్రా మీలో"

"నేనే నేనేసాబ్" అని సలాం చేశాడు బుడే మరోమారు.

"డ్రైవింగ్ లైసెన్స్ వుంద్రా? "

"మొన్నే డబ్బు కట్టేను సాబ్"

"లైసెన్సు లేదన్నమాట. దొంగనా కొడ్కా వీడెవడ్రా? " సాంబును కొరకొరా చూస్తూ అడిగాడు.

"అజంతా వైన్స్‌లో పనిచేస్తా సార్"

"మీ మొహాలు డాకునాకొడుకుల మల్లే వున్నాయ్‌గద్రా"

'ఉత్తపుణ్యానికే అట్టా బూతులు తిట్టా మీరు నోరు పారేసుకోటం ధర్మంకాదుసార్!' అని అందామనుకున్నాడు సాంబడు.

ఇంతలో యిద్దరు కానిస్టేబుళ్లు వీళ్లని సమీపించేప్పటికి సాంబడికి, బుడేకి అకస్మాత్తుగా ఒళ్లు చెమటలు పట్టేశాయి.

ఓ కానిస్టేబుల్ వచ్చి ఒక్కొక్కరి జేబులు తడిమి నడుం, పొట్టా నిమిరి కత్తులు, సైకిల్ చైన్లు లాంటి మారణాయుధాలు వున్నాయేమోనని తనిఖీ చేశాడు.

"ఏంలేవు సార్. వీళ్లు ఆడవాళ్లకోసం గాలించే బాపతు గాళ్లుసార్" అని సర్టిఫికేట్ ఇచ్చాడు.

"ఏంరా ఆడపిల్లల మెళ్లో చైన్స్ తెంపుకుని పారిపోతుంటార్రా? "

"ఛా... తల్లి సాక్షిసార్. అట్టాంటి లుచ్ఛా పన్లు చెయ్యంసార్. ఏదో నెలకోసారి సర్దాగా తాగాలనిపిస్తే..."

"మీకెన్నేళ్లురా? "

"యిరవై రెండు సార్!"

"ఇరవై సార్ నాకు"

"నాకూ యిరవై సాబ్"

"తాగాలనుకున్న వాళ్లకి టౌన్లో సారా షాపులేవంట్రా"

"ఇక్కడ టౌన్లోకంటే చవకసాబ్"

"ఊ! తాగేసి వెళ్లండి... వచ్చార్గా" యస్సై పర్మిషనిచ్చి "ఈ చుట్టుపక్కల యింకోమారిట్లా కనిపించారో భద్మాష్ నాకొడకల్లారా మీ తాటవలిపిస్తా" అని మళ్లీ గాండ్రించాడు.

"అట్టాగే సార్ రానేరాం సార్"

"సెంట్రల్ ఎక్సైజ్ డిపార్టుమెంట్ వాళ్ల జీపనుకున్నా! మీరా, నాకొడకల్లారా. అంత రేష్‌గా వచ్చి బ్రేకేస్తావా నా కొడకా"

తలలొంచుకుని చేతులు వెనక్కి కట్టుకుని నిలబడిపోయారు.

"రాత్రి పదిదాటితే ప్రభుత్వ వాహనాలు తప్ప మరో వాహనం రోడ్లమీద రాష్‌గా తిరిగితే నేను సహించను తెల్సా పోండి"

వాళ్లు స్మశానానికి నడ్చినట్లుగా సారా దుకాణంలోకి నడిచారు.

వాళ్ల వెనకాలే కానిస్టేబుల్ వెంబడించాడు. గ్లాసుల్లో సారాతోపాటు సోడా కల్పుకుని గటగట తాగేసి మూతులు తుడ్చుకున్నారు. సిగరెట్ వెలిగించి విచారంగా పొగ విడిచారు.

ఓ కానిస్టేబుల్ బుడేను చూసి ప్రశ్నించాడు.

"వారం రోజుల్నాడు ఆ రికార్డు డాన్సు

ల్లేసే యానాది వరలక్ష్మిని మూకుమ్మడిగా మానభంగం చేసినోళ్లెవరో మీకు తెల్సున్రా? వాళ్లూ జీప్‌మీద వచ్చి సర్వీతో పులోకెత్తికెళ్లి..."

"మాకేం తెలీద్సాబ్, ఈవాళే సర్దావేసి జీపెక్కాం సార్ ప్రమాణంగా సాబ్"

కానిస్టేబుల్ నవ్వి, పెదాలు కొరుకుతూ మునిపంటితో వాళ్లని బాగా గుర్తుంచుకోటానికి పరిశీలనగా చూడసాగేడు.

వీళ్లకు వంటిమీద తేళ్లుజెర్రులు పాకినట్లుగా అవస్థ పడిపోయారు.

"మిమ్మల్ని యస్ఐ గారెందుకు దయదల్చారో తెలుసురా"

"మేం ఏవి నేరం చేయలేదుగా సాబ్" బుడే గొణిగాడు.

"రాష్‌గా వచ్చి బ్రేక్ వేశావని, అయ్యగారు చిరాకుపడి తర్వాత చల్లబడ్డాడనుకుంటా సార్" జోసఫ్ నెమ్మదిగా మనవి చేసుకున్నాడు.

కానిస్టేబుల్ తల అడ్డంగా రెండుమార్లు ఆడించి "బాపయ్యగారి జీపేనని నేను చెప్పబట్టి అయ్యగారు చప్పబడ్డార్రా"

వాళ్ల మొహాల్లో కానిస్టేబుల్ మీద కృతజ్ఞతాభావం వెల్లివిరిసింది.

"మీరు దేవదూత మల్లే కాపాడారు సార్'

"లేకపోతే మమ్మల్ని, జీప్‌ని స్టేషన్కి తోలుకెళ్లేవాళ్లు. తాటవొల్చేవాళ్లు"

"ఛా! ఛా అంత అడ్డగోలుగా యస్ఐగారు వ్యవహరించరు. నిదానంమీద పిండేస్తారు" అని పొగిడాడు కానిస్టేబుల్.

"తవరూ తలా రెండు డ్రాములు గోల్డుస్పాట్‌లో కల్పుకుని పుచ్చుకోండిసార్" అని సవినయంగా సాంబుగాడు ఇర్వై రూపాయల నోటు పాంట్‌జేబుల్లోంచి సర్రున తీశాడు.

"చాచా! డ్యూటీలో యస్సైగారి సమక్షంలో తాగటవే బాబోయ్ యింకేవన్నా వుందా బెదరో" అని భయం నటించాడు ఐదు నిమిషాలకిందటే నా కొడకా అన్న కానిస్టేబుల్!

వీళ్ల హృదయాలు తేలికపడ్డాయ్! ఆ ఇర్వై రూపాయల నోటు సాంబుగాడు కానిస్టేబుల్‌కి అందించాడు.

నోటు అందుకుని కానిస్టేబుళ్లు ఆ తావు వదలగానే ముగ్గురు మిత్రులూ గోల్డుస్పాట్‌లో తలా రెండు డ్రాముల సారా కల్పుకుని కుషీగా నవ్వుకుని వెనకటి వూపులోకి పుంజుకుని సిగరెట్‌లు తాగేరు. ఉల్లాసంగా పొగవదిలి బతుకుజీవుడా అనుకుంటూ బయటకొచ్చి వెళ్తాంసార్ అని సెల్యూటు చేశారు యస్సైగార్కి.

యస్సై తలాడించాడు. బుడేను చేతిసైగతో తన దగ్గరకు పిల్చి "ఆకుపచ్చ జీప్ ఎవరికన్నా వుందా మిస్టర్" అనునయంగా అడిగాడు.

"తుక్కు సాహెబుగారికుంది సార్"

"తుక్కు సాహెబు ఎవరు? "

"పాత ఇనపసావాన్లు, తుక్కు వస్తువులు కొనే సాహెబుసారు" అని యస్సైగారికి చెప్పి పక్కనే నిలబడ్డ కానిస్టేబులువంక నేను నిజం చెప్పానుగదూ అన్నట్లుగా చూశాడు.

కానిస్టేబుల్ యస్సైగారికి జ్ఞాపకం చేశాడు.

"అదేసార్... రామారైస్ మిల్లులో దొంగిలించిన ఐరన్ గర్డర్‌లు కొన్నాడని మనం స్టేషన్కు పిలిపించి..."

"ఓహో ఆనా కొ... వాడు జీప్ మైన్‌టైన్ చేస్తున్నాడా"

"చిత్తం" అన్నాడు పి.సి.

"ఇంకెవరికన్నా వుందా మిస్టర్"

"సారా కాంట్రాక్టర్ తిరుపతి రాయుడిది ఆకుపచ్చ జీపే సాబ్" బుడె నవ్వుతూ చెప్పేడు.

"ఓహో నైస్! నీవెళ్లొచ్చు జాగ్రత్తగా వళ్లు దగ్గరపెట్టుకుని తిరగండి. మీ వెనకే జీప్‌లో వస్తాం. బాపయ్యగారి సినిమా హాలు దగ్గర మీ జీపు వుండాలి. తెల్సిందా" యస్సై తాపీగా చెప్పాడు.

"సినిమా హాలు దగ్గరకాదు సార్! బాపయ్యగారి రైస్‌మిల్లు ఆవరణలో షెడ్ వుంది సాబ్. అక్కడ ఆపేసి ఇళ్లకెళ్తాం సాబ్ మామూలుగా"

"అట్లాగే వెళ్లండి. అనుమానాస్పద పరిస్థితుల్లో మరోసారి కనిపించారో టేక్కేర్! తోలు వలిచేస్తా" యస్సై ఆ ముగ్గురికి అక్షింతలు చల్లి పంపించాడు.

ఇరవై రూపాయలు గుంజిన పి సి కాస్త చిరాకు నటిస్తూ "అబ్బా ఈ సారా దుకాణాలు, బ్రాందీ షాపులు, బార్‌లు వచ్చిపడ్డాయ్. మనకు క్రిమినల్సు పెరిగిపోయార్ సార్" అని "తమరి ఉద్దేశ్యమేమిటో శలవియ్యండి" అన్నట్లుగా ముకుళితహస్తాలతో నిల్చున్నాడు.

సైకాలజిలో యంఏ పాసైన వాడు యస్సై. తత్వవేత్తలా మొహం పెట్టి "నాయుడూ! ఈ కుర్రనా కొడుకులు వున్నారు చూశావ్ వీళ్ల దురభ్యాసాలు, విచ్చలవిడిగా తిరగటం, తప్పుడు దోవలు తొక్కటం ఎందుకంటావ్? " అడిగాడు పిసిని.

"ఏమోసార్! తమరికి చెప్పేంతటివాళ్లమా! తమరే శలవివ్వాల"

"తాము కావాలనుకున్నది సాధించలేక తప్పుడు దోవలు తొక్కేస్తున్నారు"

"అట్లాగాసార్"

"వీళ్లు మారడం అంత సులభంకాదు. ఏదో చైతన్యం వస్తుందనుకోవటం భ్రమే నాయుడూ!"

"బెమ్మాండంగా చెప్పారు సార్ తమరు"

యస్సైగారు తన జ్ఞానానికి మురిసిపోతూ గూడా చిరునవ్వు నవ్వకుండా, "ఇప్పుడు ప్రతిరంగంలోను, అనవసర విషయాలు కూడా చాలా అవుసర విషయాలుగా చెలామణైపోతున్నాయ్" అన్నారు గంభీరంగా.

పి. సి. లిద్దరూ అంతకంటే గాంభీర్యంగా శ్రద్ధగా విని వూరుకున్నారు.

★ ★ ★

"ఈ యస్సైగాడు ఘరానా పోతున్నాడు మనముందు. మొన్న మా వోనరుగారితో కల్సి విస్కి తాగుతూ, ఎంతో సోషల్‌గా వున్నాడు. మా వోనరు తల్చుకుంటే వీడ్ని ట్రాన్సుఫర్ చేపిచ్చి పార్నూకుతాడు" అంటున్నాడు బుడే.

"అబ్బో వీడు మన తోలు వలుస్తాట్ట. వీడితోలు వలిచేవాళ్లు లేరనుకుంటున్నాడు. సాలెగాడు ప్రభుత్వం సారా వ్యాపారం చేస్తున్నది. ప్రభుత్వోద్యోగి, ఆ సారాషాపు ముంగల చేరి, సారా వ్యాపారానికి ఆటంకం కలిగిస్తూ కస్టమర్సుని వేధిస్తున్నాడు" జోసెఫ్ తెలివితేటలు ప్రదర్శిస్తున్నాడు.

"భలే చెప్పావురా. ఈ ఐడియాతోనే రేపు దినపత్రికలకు, సంపాదకులకు లేఖ ఒకటి రాయాలనిపిస్తున్నదిరా సాంబా"

"తప్పకుండా రాయి. పోలీసుల నిరంకుశత్వాన్ని ప్రజలకు, ఎప్పటికప్పుడు తెలియచెయ్యాల్రా"

"ఇవాళ ఎంత మజా చేసుకుందామనుకున్నామో అంతా తల్లకిందులైపోయింది"

"ఆపరా. నేనిక్కడ దిగిపోతా"

జీపు ఇరుకువీధి మొదట్లో ఆగగానే జోసఫ్ దిగిపోయాడు. గుడ్‌బై, టాటాలు చెప్పుకున్నారు.

"మా వైన్‌షాప్ దగ్గర ఆపు నేదిగిపోతా"

రెండు నిమిషాల్లో వైన్‌షాప్ వీధి మొదట్లో జీప్ ఆగింది. "రేపు కలుస్తాబే సినిమాహాలు దగ్గర వుండు" అని సాంబు గాడు దిగేశాడు.

జీపుని బాపయ్యగారి రైసుమిల్లు ఆవరణలోకి పోనిచ్చి ఆపి తాళాలివ్వటానికి, ఆఫీస్ రూమ్‌కు వెళ్ళాడు బుడే.

బాపయ్యగారు జీప్ రాకకోసం ఎదురు చూస్తున్నట్లు, ఆదుర్దాగా సిగరెట్ పీల్చుతూ కుర్చీలో కూర్చుని వున్నాడు.

"ఎక్కడెక్కడ తిరిగొస్తున్నావురా దొంగనాయనా"

"మన సైట్ దగ్గర కెళ్ళి ఎన్ని గుడిసెలున్నాయో చూసి రమ్మన్నారుగదా సార్. దోవలో ఇంజన్‌ట్రబులిచ్చింది.సరి చేసుకొస్తున్నా"

"ఎన్నున్నాయ్"

"పది గుడిసెలున్నాయి సార్"

"యస్సై ఫోన్‌లో పిచ్చి పిచ్చిగా వాగేదేంది. టౌన్ చివర సారాకొట్టు దగ్గర కెళ్ళిందా మన జీప్"

"మన జోసఫ్, సాంబయ్య నన్ను తగులుకున్నార్ సార్. అటేపే ఏనాదులతో పని వుందన్నార్సార్. మద్రాసు కప్పల కాంట్రాక్టర్, జోసెఫ్ క్రిస్టియన్ను కదా. వాళ్ళ పని మీద జోసెఫ్ తిరుగుతున్నాడ్సార్. లిఫ్ట యిచ్చానంతే సార్"

"ఆ క్రిమినల్ గ్యాంగ్‌తో నీకేం పని? యస్సైనా కొడుకు మహా ప్రమాదపు నా కొడుకు. మనల్ని లెక్కచెయ్యటంలే జాగ్రత్త. వాడి చేతిలో చిక్కి నాకు తలనొప్పి గల్గించమాకండి"

"సరే సార్... వస్తా సార్"

"పెందలాడే ఆరుకల్లా రెడీగా వుండాలి"

"అట్నే సార్"



ఎండాకాలం రాకపోయినా కాలువలు కట్టేసి పదిరోజులయింది. నీళ్ల పారటం లేదు. నిలవనీరు కదలిక లేక మురుగువాసన కొడ్తున్నది.

కాల్వకట్ట చివర్న ఏనాదుల్లో చాలామంది మొగాళ్లు రిక్షాలు తొక్కుతూ పొట్టతిప్పలు పడుతుంటారు. ఆడవాళ్లలో కొందరు బస్తీ మధ్య తరగతి ఇళ్లల్లో పాచిపనులు చేసుకుని మరికొందరు పంటకాల్వలకు అడ్డంగా మొవ్వలు పెట్టి, చేపలు పట్టి మనుగడ సాగిస్తుంటారు.

ఎండాకాలం మురుగునీళ్లలో అడుగుబొడుగున మిగిలిన చేపల్ని పట్టి సొమ్ము చేసుకోవటం, మాంచి కాలక్షేపం. గొప్ప సరదా కార్యక్రమం వాళ్ల జీవితాలకు.

ఉదయం ఐదుగంటలకే ఏనాదులు పిల్లా జల్లాతోసహా కాలవలోకి దిగేరు. కాల్వకి అడ్డుకట్టవేసి మళ్లు మళ్లుగా విభజించి చేపల్ను కట్టడి చేశారు. మోకాలు లోతు నీళ్లలో, గోచి పాతరాయుళ్లు కేరింతలు కొడ్తూ బురదనీళ్ళని బయటకు వెళ్లేస్తున్నారు. తొలి ఉదయకిరణాలు, వాళ్ళ అర్ధనగ్న శరీరాలను మృదువుగా స్పర్శిస్తున్నాయి.





కాల్వలో అడ్డుకట్టలోంచి నీళ్లు నింపాదిగా తగ్గిపోతుండగా, తళతళ కత్తుల్లా మెరుస్తూ చేపలు, ఎగిరి దూకి మళ్ళీ బురదనీళ్లలో మాయమౌతుంటే, ఏనాదులు ఉత్సాహంలో కేరింతలు కొడ్తూ చెలాకీగా, వొడిసి పట్టుకుని బుట్టలో పడేస్తున్నారు.

బాలకిష్టడు, సీతారావడు, నర్సయ్య పక్కన చేరి, చాలా సేపు దోసెళ్లతో నీళ్లను తోశారు. వాళ్ళ కళ్లముందు బురదలో చేపలు ఈదలేక నింపాదిగా పాకుతుంటే, లటక్కున గుప్పెళ్లతో పట్టుకుని పిడికిలిలో కొచ్చిన చేపల్ను బుట్టల్లోకి తోసేస్తున్నారు.

చేపలు దొరికినకొద్దీ వాళ్లలో ఉత్సాహం పెరుగుతున్నది. బుట్టలు నిదానంగా నిండుతున్నాయి.

చెంచమ్మ మరో నలుగురు స్త్రీలు, రాత్రే కట్టివుంచిన కట్టె పేళ్ల మోపెత్తుకుని బస్తీలో అమ్ముకోటానికి బైలుదేరి, కాల్వ దగ్గరకొచ్చి నిలబడ్డారు.

చెంచమ్మ కొడుకుల్ను కేకేసి పిలుస్తుంటే వాళ్లు వినిపించుకోవటంలేదు. చేపలవేట సరదాలో కేరింతలు కొడ్తూ, వేటిని గమనించకుండా వున్నాడు.

ఏదో కేకకు సీతారాముడు, నిలబడి వెనక్కి తిరిగి తల్లిని చూశాడు. చూసి వెంటనే వంగి చేపను అదిమి పట్టుకుని బుట్టలో పడేసి వెనక్కి తిరిగి చూసి, చేయి సైగతో చెంచమ్మని వెళ్ళమన్నాడు.

చెంచమ్మ పెద్దగా కేకేసి "కూడు తిన్నంద్రోయ్. తిని మిగలింది ఉట్టిమీద పెట్టంద్రేయ్. జాగ్రత్త బువ్వల్తిని గొడ్లు తోలుకెళ్ళండ్రోయ్. ఎగనూక మాకండి సర్నా" అని చెప్పింది.

"సరేలేయమ్మా. అట్నేలే. ఎగనూకంలే" అని సీతారావుడు కేకేసి, పనిలోకి వంగేడు.

చెంచమ్మ బృందం తల బరువుతో విస విసా యిసకలో నడుస్తూ కనుమరుగైనారు.

చేపలు చవగ్గా కొట్టెయ్యటానికి చేపలు రుచిమరిగిన ఆసాములు గట్టువద్దకు చేరుతున్నారు.

★ ★ ★

చెంచమ్మ పైన జోసఫ్ పన్నిన పథకం బాగా పారింది. వారంకిందటే మచ్చికై అతనిచ్చిన రూపాయి తీసుకుంది.

నిన్న సాయంత్రం సినిమాహాలు దగ్గర చెంచమ్మ కనిపించింది ఆమెతో మరో ఇద్దరు స్త్రీలు, ముగ్గురు పిల్లలు, ఒక మొగాడు వున్నారు.

జోసఫ్ బుడేతోపాటు జేబుదొంగలైన వెంకట్‌గాడు, రవిగాడు, ఆడపిల్లల మెళ్ళో గొల్సులు తెంపే బ్యాచ్ ముగ్గురూ టీలు తాగుతూ తమ తమ నైపుణ్యాలను ప్రదర్శించటానికి తహతహలాడుతూ అదనుకోసం నిరీక్షిస్తున్నారు.

జోసఫ్ ఏనాది స్త్రీలను వాళ్లలో చెంచమ్మను దూరంనుంచే చూసి మిత్రబృందాన్నొదిలి చెంచమ్మను కల్సుకోటానికై రూపాయి బుకింగ్ దగ్గరకొచ్చి చెంచమ్మని చూసి నవ్వాడు.

చెంచమ్మ అమాయకంగా నవ్వి, సిగ్గుపడుతూ వినయంగా దగ్గరకొచ్చి, "అన్నో, జోసపన్నో పదిరూపాయలుంటే ఇవ్వన్నా బటువాడో కాంగినే సెల్లపెట్తాగా. మా బాబుగా పట దయిసెయ్యి" అంటూ ప్రాధేయపడ్డది.

"ఇప్పుడెక్కడ బట్వాడే చెంచాయ్! వోన్రు గారు పట్నం ఎళ్ళాడు రాత్రి. పది దినాల్దాకా పత్తా దొరకదు" అని ముసిముసి నవ్వులు నవ్వేడు.

"బాబ్బాబు నీకాడ పది లేకుంటయ్యా అన్నా నిమ్మలంగా చెల్లపెట్తాలేన్నా. టయం అయింది. మావోల్లు గేటు కాడ కాసుకు నుంద్రు"

"ఇస్తాకాని, రేపు మద్దినాలకు కట్టెల మోపెత్తకరా. కట్టెవేసి చెల్లబెట్టు సర్నా" జోసఫ్ ఇకిలిస్తూ అడిగాడు.

"అట్నే తెత్తా, నీవు చెప్పిన టయానికి మోపెత్తకొత్తాగా బాబా"

"ఎండనబడి వొస్తావ్ గావల్ను, కల్లు కూడా తాపిత్తా. వత్తావ్‌గా. మోపెత్తకొస్తా వుగా" అనేసి జేబులోంచి పది నోటు తీసి యిచ్చాడు.

చెంచమ్మ పది రూపాయలనోటు రవి కలో దోపేస్తూ, నవ్వి "వత్తాలే. నేనెల్తుండా' ' అనేసి బిరబిర్నెల్ని తనవాళ్లలో కల్సి సిని మాహాల్లో కెళ్ళిపోయింది.

జోసెఫ్ ఉత్సాహంగా మిత్రుల దగ్గరకె ళ్లాడు. బుడే అతన్ని కుతూహలంగా వెళ్లిన ప్పట్నుంచి గమనిస్తూనే వున్నాడు. చెంచ మ్మతో మాట్లాట్టం, నోటు చెంచమ్మకి వ్వటం. వాళ్ళిద్దరూ నవ్వుకోటాలు చూస్తూ నేవున్నాడు.

జోసఫ్ విజయం తన విజయంగా తలచే వాడు బుడె. "పిట్టను బుక్ చేశావా? " అడి గాడు లొట్టలేస్తూ.

"ఎడ్వాన్సిచ్చా పది"

"ఎంతకు మాట్టాడేవ్? "

"యాభై"

"చవకే అనుకుంటా"

"కారు చవకగదాట్రా. మనం కాబట్టి వస్తున్నదిగాని మరొకడికి ఒప్పుకోదు"

"మాకూ ఛాన్సిప్పిత్తావా బ్రదర్" రవి ప్రాధేయపడ్డాడు.

"తలా పది పార్సూకండి"

"ఒకే తీసుకో దాన్దేవుంది"

★ ★ ★

కట్టెపుల్లలమోపు నెత్తిమీద మోస్తూ బస్తీ యిరుకుసందులో తిరుగుతున్నారు స్త్రీలు. చెంచమ్మ గూడా వుంది.

" మీరటుపోయి అమ్ముకురాండసే. నేను మనకప్పలాసావికి మోపేసి మారకాట్ కాడ కలుస్తా" అని చెంచమ్మ పక్కదారి తీసింది.

మిగతావారు ఎవర్దారిన వారు చీలి "కట్టెలో కట్టెలో" అని కేకలేస్తూ బస్తీ సందుల్లో కల్సిపోయారు.

చెంచమ్మ పావుగంటలో కప్పల కాంట్రా క్టర్ విడిది ఇంటిముందు అరుగుమీద కట్టెల మోపెత్తిపడేసింది.

పెంకుటిళ్ళ వరసలో చివర ఇల్లది. నిర్మా నుష్యంగా ఇరుకుగా వుంది. చెంచమ్మ ఆ పరిసరాలు బాగా ఎరుకైనందువల్ల అరు గెక్కి వరండాలోకి నడిచి తలుపు తట్టింది.

జోసఫ్ తలుపు తీస్తూ చిరునవ్వుతో ఆహ్వానిస్తూ, "మోపెత్తు కొచ్చి లోపలెయ్యి. పట్టు. ఇద్దరమెత్తికెల్దాం" అన్నాడు.

"అట్నే ఏత్తా" అని చెంచమ్మ వెనక్కి తిరి గింది. చెమటతో తడ్సిన రెవిక బిర్రుగా కని పించింది జోసెఫ్‌కు.

చెంచమ్మ వంగి మోపెత్తేప్పుడు జోసఫ్ కూడా వంగి ఆమె రవికముందు బరువుల్ని దగ్గరగా కుతిగా చూసి తెగింపు ధైర్యం కల్పించుకున్నాడు.

ఇద్దరూ కల్సి లోపలకు మోపెత్తుకెళ్ళి మూలన పడేశారు. వాళ్ళ కాళ్ళకింద వరి పొట్టు మెత్తగా ఉంది. ఐసుగది చల్లదనం. జోసఫ్ జేబులోంచి పది రూపాయల కాయితం, ఆమె చేతిలో పెట్టపోయాడు.

"నిన్నిచ్చిన పది సరిపోయిందిగా? " అల సటగా రొప్పుతూ అమాయకంగా అంది.

జోసఫ్ కానవ్వు ఎంతో ఆత్మవిశ్వాసం గల్గించింది.

జేబులోంచి మరో పది రూపాయల కాగి తాన్ని చెంచమ్మ గుప్పెట్లో వుంచేసి, చెయ్యి వదలకుండా "నా దగ్గర పడుకోవాలి మరి"





అని గొణిగాడు.

చెంచమ్మ నవ్వి "అట్నెలే... ముంగల నాకు చానా దాహం ఏత్తుంది, నీళ్లివ్వ" అంది.

"కల్లు తెప్పించి పెట్టా, తాగు"

"కల్లా? తే!" అంది సంతోషంగా.

జోసఫ్ వెనకగదిలోంచి వరిపొట్టు గది లోకి వెళ్ళాడు. చెంచమ్మ రెండు పదులను పైట ఛెంగుకొసన బిర్రుగా ముడేసి జోసఫ్ దాహం తీర్చటానికి సిద్ధపడ్డది.

జోసఫ్ రెండు కల్లుసీసాలు తెచ్చి చెంచ మ్మకొహటి అందించి తన సీసా గటగటా తాగేసి సీసాను వరిపొట్టుమీద విసిరేశాడు.

చెంచమ్మ సీసా కాళీచేసి కిందపెట్టింది.

"పడుకో!" అని కటికనేల చూపించాడు.

చెంచమ్మ నవ్వి, "యీడనా? చా... ఆడకి పా!" అని వరిపొట్టు గదిలోకి నడి చింది. ఆమెను వెనకనుంచి వాటేసుకుని వెళ్ళాడు జోసెఫ్.

బుడే నోట్లో సిగరెట్ ఆఖరి దమ్ము పీల్చి సిగరెట్ పారేసి, పొగవదుల్తూ గదిలోకొచ్చే శాడు. జోసఫ్ పేంటుగుండీలు పెట్టుకుం టూవుండగా, వరిపొట్టుమీద వెల్లికిలాప డున్న చెంచమ్మ చెంత చేరాడు బుడే.

"ఈన గూడానా? " చెంచమ్మ అయిష్టంగా గొణిగింది

"ఆ" అనేసి తప్పుకున్నాడు జోసఫ్.

పావుగంటన్న కాలేదు. సాంబుగాడు లుంగి ఎగగట్టుకుని వచ్చేశాడు.

"ఏందీ ఇంకోరొత్తున్నా"రని కూచోబో యింది.

"లెగమాకేలంజా" అంటూ చెంగున చెంచమ్మ మీదపడి అదిమేశాడు.

చెంచమ్మ అసహాయంగా పెనుగులాడ బోగా మొహంమీద రెండు దెబ్బలు కొట్టి తనపని ప్రారంభించాడు. వెంకట్‌గాడు, రవిగాడు ఆదుర్దాగా దొడ్లో అటు ఇటు తార ట్లాడుతుండగా "వెళ్ళరా రవి" అని సిగ్నలి చ్చాడు జోసఫ్. కల్లుసీసా కాళీచేసి గాలిలోకి విసిరేశాడు.

చాలా గొప్ప సాహసకార్యం చేస్తున్నట్లు విర్రవీగుతూ సిగరెట్లు తాగుతున్నారు మిగి లిన యువకులు.

చెంచమ్మ పూర్తిగా అలిసిపోయింది. ఒకడు వెళ్లిపోగానే మరొకడొచ్చి నలిపి, కొరికి, యిరగతీసి, హింసించి, ఉద్రేకం చల్లా ర్చుకుని మెత్తబడి పిల్లుల్లాగా జారుకుంటు న్నారు.

ఒళ్ళంతా హూనమైంది. లోపలంతా భగ్గున మంటపుడ్తున్నది. వీపంతా సలుపు తున్నది. మొహమంతా పళ్లగాట్లతో తీపులు తీస్తున్నది.

భరించలేక సన్నగా ఏడ్పు తనకు తెలీ కుండగానే కట్టలు తెంచుకుని వచ్చేస్తున్నది.

వెంకట్ వచ్చి స్నేహితులతో "లంజ కల్ల బొల్లి ఏడ్పులన్ని ఏడుస్తున్నదిరా" అని చెప్పాడు.

"నీవు జాడించావా లేద్రా? " అడిగాడు బుడే అనుమానిస్తూ.

"జాడించటంలో అట్లా ఇట్లా కాదు. వాయించిపారేశాబే" అని తన ప్రతాపం చాటి సిగరెట్ వెలిగించాడు.

గదిలోంచి ప్రాణసంకటమైన రోదన హెచ్చుస్థాయిలో ఒక్క ఉదుటున వినిపించ గానే బడాయ్ కబుర్లతో సర్దాపడుతున్న వారికి కలవరం పుట్టింది.

"నేను చూసివస్తానని జోసఫ్ గదిలోకెళ్లి "ఏందే చెంచ! కల్లు తాగతావంటే? పెద్దగా గోల చెయ్యబాకే ముండా" అని గదమా యించాడు.

చెంచమ్మ కూర్చుని ఏడుస్తూంది. వంటి మీద నూలుపోగన్నది లేదు.

"ముందు కోక కట్టుకో. కల్లు తాగు పలా వ్ తెత్తగా. యాడవబాకే, ఎర్రిలంజా" అంటూ బుజ్జగించాడు జోసఫ్.

"నేనెర్రిలంజనేరా! లుచ్ఛానాకొడకా. నీయమ్మను, నీయప్ప సెల్లెళ్లను దెం....రా. నా కొడకా" చెంచమ్మ బండబూతులు లంకించుకుంది. ఏడుస్తూ మొండిమొలతోనే దొడ్లోకొచ్చేసింది.

యువకిశోరాలు బెదిరి కాలికి బుద్ధి చెప్పబోయారు.

జోసఫ్ ఆ అవతారం సహించలేక వీళ్ళంతా కల్సి విప్పి పారేసిన కోకను రవికను, అసహ్యాంచుకుంటూ పట్టుకొచ్చి చెంచమ్మ మొహానకొట్టి "కట్టుకో ముందు... పేణం తీత్తా బాంచెత్" అని బుకాయించాడు.

చెంచమ్మ మొలకు చుట్టుకుంటూనే ఏడుపూ, బూతులూ ఆపకుండా శాపనార్థాలు మొదలుపెట్టింది.

చెంచమ్మ ధోరణికి బెంబేలెత్తిపోయి ఒక్కొక్కరే మొహాలు చాటు చేసుకోటానికి చల్లగా దొడ్డి తలుపు తీసుకుని బతుకు జీవుడా అనుకుంటూ బయటపడ్డారు.

చెంచమ్మ ఏడుపు అరుపులు వినిపిస్తూనే వున్నాయ్. ఒకరి మొహాల్లొకరు చూసుకుంటూ దూరంగా పరుగెత్తి ఓ పాకా హోటల్లో బల్లలమీఁగ కూలబడ్డారు.

ప్రమాదకరమైన చోటునుంచి బయటపడి స్థిమితంగా వుండటానికి తిప్పలు పడుతూ, ఆకలి తీర్చుకోనారంభించారు.

అక్కడ జోసఫ్ చెంచమ్మను బుజ్జగించటానికి, సముదాయించటానికై పడిన తిప్పలు ఫలితం యివ్వలేదు.

చంచమ్మ బూతులు తిట్టూనే వుంది.

రవికతొడుక్కుంటూ, మొహం, తొడలు కడిగి తుడ్చుకుంటూనూ కూడా నోరాప లేదు.

జోసఫ్ [illegible] ప్రాణం తోకదాకా వచ్చి కొట్టుమిట్టాడుతున్నాడు. పారిపోయిన మిత్రుల్ని తల్చుకుని మండిపడుతూ, చెంచమ్మని కాచుకొస్తున్నాడు. నిమిషాలు బరువుగా ఆదుర్దాగా గడుస్తున్నాయి.

జన్మలో యింత చెండాలపు పని చేయకూడదనే వైరాగ్యం పుట్టుకొచ్చి జేబులోంచి యిరవై రూపాయల నోటు చెంచమ్మ దగ్గర కెళ్ళి యివ్వబోయాడు.

చెంచమ్మ అమాంతం అతని మణికట్టు రెండు చేతుల్తో పట్టుకుని, అతని జబ్బ నోటికి దొరికించుకుని కండ వూడివచ్చేట్టుగా కసుక్కున కొరికి నోటితో విదిలించేసింది.

జోసఫ్‌కు ప్రాణాలు పోతున్నట్లనిపించింది. చెంచమ్మ నోటి పట్టును వదిలించుకోటానికి అతని వల్లకావటంలేదు.

ఇద్దరూ కిందపడ్డారు. జోసఫ్ పెనుగులాడి, కాలితో తన్ని చెంచమ్మ నోటినుంచి తన ఎడం జబ్బని వదిలించుకున్నాడు.

షర్టంతా రక్తమయమైంది. అతని రక్తం కళ్ళచూడగానే చెంచమ్మ ఆవేశం, ఏడుపు, తగ్గిపోయింది.

చేసిన దారుణాన్ని సహించి, భరించిన చెంచమ్మ పూర్తిగా అలిసిపోయింది. తుపుక్కున ఉమ్మేసి బూతులు తిట్టింది.

జోసఫ్ ఒక చేత్తో జబ్బను గట్టిగా పట్టుకుని ప్రాణం పోతున్నట్టు నటిస్తూ గోడకానుకుని నిల్చున్నాడు.

చీరె కట్టుకుని, జాకెట్ పిన్నులు పెట్టుకుంది. జుట్టు గోళ్ళతో దువ్వి గట్టిగా వేలు ముడివేసుకుని బూతులు తిడుతూ, కాలి కింద నలిగిన యిరవై రూపాయల కాయి

తాన్ని క్షణంలో సగంసేపు చూసి, విసవిసా నడ్చి ముందు హాలు తలుపు తీసుకుని బయటకు నడ్చింది.

బతికేంరా తండ్రి అనుకుంటూ జోసఫ్ తన నెత్తురును కళ్లప్పగించి చూస్తూ, అయోమయంగా, అక్కడ కాసేపు కూర్చుని దిక్కుతోచని స్థితిలో లేచి, కుండలో మంచి నీళ్ళు తాగేసి మాసిన టవల్ను భుజంపైన కప్పుకుని, తలుపులన్నీ వేసుకొని సినిమా హాలువైపు బయలుదేరాడు.

అతని మెదడంతా పచ్చి పుండులాగుంది. అమిత భయం ఆవహించింది. చెంచమ్మ పోలీసు రిపోర్టు యిస్తుందేమో అని కంపించిపోయాడు. యస్సై చేతిలో పడితే తనను హూనంహూనం చేసేస్తాడు తప్పదు. ఈ ఊరొదిలి, పారిపోవాలని నిశ్చయించుకున్నాడు.

★ ★ ★

ప్రకాశానికి సందు మలుపులో చెంచమ్మ ఎదురుపడ్డది.

ప్రకాశమే తలవంచుకెళ్ళే చెంచమ్మను పల్కరించాడు. "ఎందే చంచామ్ అట్టా వుండావ్ సీతయ్యకేవన్నా ఐందా"

చెంచమ్మ ఏడుస్తూ రోడ్డుమీద కూలబడ్డది. ప్రకాశం సైకిల్ దిగి స్టాండ్‌వేసి దగ్గరకెళ్ళి "సీతయ్యి ఎప్పుడు పోయాడే పాపం" అని పరామర్శించాడు.

చెంచమ్మ చీదుకుని, ఏడుపు ఆపి "ఆయన బాగుండాడు సామీ" అన్నది.

"మరి దేనికి"

"కప్పల కంపెని గుమాస్తా నా కొడుకు ఆడు లేడూ జోసప్ గోడు ఆడు, ఆడి దోస్తులు నన్ను... నన్ను నమ్మిచ్చి పెంకిటింటికి రప్పించి ...

ప్రకాశానికి సంగతంతా అర్థమైంది.

"ఎంతమందాళ్ళు"

"ఐదుగురు సామే"

"గుర్తుపట్టగలవా? అందర్నీ"

ఆ!

"పద పోలీస్ రిపోర్టిద్దాం దా, నాతో"

"చెంచమ్మ లేచింది. జనం పోగవుతున్నారు. ఏంది? ఏంది? " అంటూ ముసురుకోబోతున్నారు.

ప్రకాశం సైకిల్ నడిపాడు. చెంచమ్మ అతని వెంబటే నడ్చింది.

ఎకాయికిగా పోలీస్ స్టేషన్‌కు తీసికెళ్ళాడు చెంచమ్మను. యస్సైగారు లేరు భోజనానికెళ్లాడు. రైటర్ బీడీకాలుస్తూ పచార్లు చేస్తున్నాడు బోనులో ఎలుకమల్లె.

ఏంది గురుగారు కేసు" అడిగాడు రైటర్.

చెప్పాడు ప్రకాశం.

"ఓహో! వాళ్ళా జోసప్‌గాడా నాకెందుకు తెలీదు ఆ బేచ్ మొత్తం నాకు తెల్సు. అమ్మొ నా కొడుకులు తెగపడ్తున్నారన్న మాట. ఇహ నా పోలీస్‌స్టేషన్ లేదనుకుంటున్నారన్న మాటేగా? " అంటూ వోర చూపు, పోలీస్ చూపు చూశాడు రైటర్ చెంచమ్మను.

రైటర్ చెంచమ్మని పోలీస్ చూపు చూడటం ప్రకాశం గమనించాడు.

బాగుంది కుర్రముండ, అరడజను మందిని సమ్మాయించి పోలీస్‌స్టేషనుకు వచ్చిందన్నమాట.

"ఏంటి ఆలోచిస్తున్నావ్. ఏం చేద్దామంటావ్" ప్రకాశం ప్రశ్నించాడు. ప్రకాశాన్ని గూడా పోలీస్ చూపుతో చూశాడు రైటర్.

"దీనికి నీకు కనెక్షన్‌వుందా? " అని యింకోరినైతే ప్రశ్నించేవాడే రైటర్. నీకు లమా, నీ చుట్టమా నీ తోబుట్టువా అని రెట్టించేవాడే. సరే యీ కేస్ బుక్ చేస్తా




ఎంతిస్తావ్, తెచ్చావా అనేవాడే.

రైటర్ చెంచమ్మకు అభయమిచ్చినట్లుగా "ఆ నా కొడుకుల నెత్తురు పిండతాంగా, వాళ్ళందర్నీ లాకప్‌లో ఏస్తా, గుర్తుపట్టగలవా? "

చెంచమ్మ తలాడించింది.

"నీవు పో, యస్సై గారు రాగానే, వాళ్ళని లాక్కొచ్చి కోటింగ్ యిస్తాలే. దొరికేరు నా కొడుకులు," అని ప్రకాశంవంక చూసి,

"ఈ నా కొడుకులకు జీప్ దొరికింది. యిష్టం వచ్చినట్లు తిరుగుతున్నారు. మా బి.కామ్. చదివే అమ్మాయిని వెంబడించి ఎక్కు తిరిగే సొద్దామన్నార్ట గురుగారు, నాకు నషాళానికెక్కింది. షెకండ్‌షో కెళ్ళి వస్తూ నాకు తగిలారు మంచి మాటల్తో లాక్కొచ్చి లాకప్‌లో వేసి మధ్యాహ్నానికి వదిలేసి వార్నింగ్ యిచ్చి పంపించా, యీ తడవ మాంచి కోటింగ్ వేయిద్దాం! సరేనా గురూ" అని బీడి పారేశాడు.

"నాకీ కాశీమజలి కథలు వినిపించమాకా ఏక్షన్ ఏం తీసుకుంటావో చూస్తాగా" అని ప్రకాశం చెంచమ్మతో,

"పద చెంచమ్మ! యస్సైగారి, సి.ఐగారిళ్ళ' కెళ్దాంపద" అని చంచమ్మతో పోలీస్‌స్టేషన్ ఆవరణ దాటేడు.

* * *

చెంచమ్మ చెట్టునీడలో నేలమీద చతికిల పడి, నిర్జీవంగా చూస్తూ, తనకు దాపరించిన అగచాట్లకు పరితపిస్తూ చాలాసేపు గడిపే టప్పటికి విసుగొచ్చేసింది.

తనకు జోసఫ్ ముదా చేసింది మర్చిపోలే కపోతున్నది. పరిస్థితి ఆవిధంగా తయారౌ తుందని ఏకొద్దిగా గ్రహించినా తను గొర్రె లాగా, ఆ యింట్లోకి దూరుండేది కాదు. తనమీద తనకే అసహ్యం వేస్తున్నది ఆ విషయం తల్చుకున్నప్పుడల్లా. ఆమె నలిగి పోతూనే వుంది.

ఏదో పనిచేస్తుంటేగాని, యీ మానసిక క్షోభ చల్లారదు. చెంచమ్మ నిదానంగా లేచి గుడిసెలో దూరి నేల అలకటం మొదలుపెట్టింది. చాలా సేపు ఆ చుట్టు గుడిసెకు సేవ చేస్తేగాని పాటుకురాలేదు.

చాలా వంద్రు, పేడ మిగిల్తే, బయట గూడా నేలను అలికి, చేతులు కడుక్కుని, కుండలనిండా, కాల్వలోంచి నీళ్ళు తెచ్చిపోసింది.

గొడ్లను ఆసావుల యిళ్ళకు తోలిన కొడుకులిద్దరూ, వాడిపోయిన మొహాలతో, ఆకలి నీరసపు చూపులతో వచ్చి అలికి శుభ్రంగా తయారైవున్న తమ గుడిసె పరిసరాలను చూసి కేరింతలుకొట్టారు.

పిల్లగాళ్ళ మెరిసే కళ్ళలోని ఆనందాన్ని చూసి చెంచమ్మ మనసు కొద్దిగా తేలికపడి ఆ లంజకొడుకుల పాపం వాళ్ళనే నాశనం చేస్తుంటనుకుని తనని తాను ఓదార్చుకుని "బువ్వలు తిందురుగాని రాండసే" అని చెట్టుదగ్గరకు పిల్చింది.

"అట్నేలేమ్మా" అని అరస్తా కాలవలోకి మొండిమొలలతో దూకి స్నానాలు మొదలెట్టేరు.

చెంచమ్మ పిల్లగోళ్ళకి కంచాల్లో బువ్వవేసి, తను తిని, మిగిలిన కూడు దుత్తలో దాచి ఉట్టిలో పెట్టింది. సీతారావుడు, బాలకిష్టడు చాపలు పట్టటానికి కాలవకాడికి లగెత్తారు. గుడిసెలోకి కుక్కలు దూరకుండా, తడిక బిగించి రైసుమిల్లు దగ్గరకు బయలుదేరింది.

అక్కడంతా జనం పోగై జాతరగా వుంది. మిల్లు గేటుకు తాళం వేసుంది. రామిరెడ్డిగారికేమైనా ప్రమాదం జరిగిందేమో, సచ్చిపోయాడేమో అనుకుంది చెంచమ్మ. చింతచెట్టునీడలో కొత్త మనుషులు, ఆదుర్దాగా కోపంగా కనిపించారు.

చల్లగా, నిదానంగా అసలు విషయం తెల్సుకుంది చెంచమ్మ. ఔరా అనుకుని గుండె బాదుకుంది. నెలరోజుల్నుంచి కొత్త ధాన్యం లారీల్లో ఎడ్లబళ్లలో మిల్లు దగ్గరకు వస్తున్నది. రైతుల దగ్గర్నుంచి సన్నకారు రైతుల్నుండి కొనుగోలు చేసి, వాళ్ళకు డబ్బి వ్వకుండా ఏడ్పించటంలో రెడ్డి దిట్ట. దాదాపు రెండు లక్షల రూపాయల ధాన్యాన్ని రైతుల్నుండి పోగుచేసి టౌనుకి లారీలో తరలించి, అమ్మేసి, సొమ్ముచేసు కుని పరారైపోయాడు. కుటుంబం గూడా పదిరోజుల కిందట్నే వూరునుంచి వుడా యించారు.

మోసపోయిన రైతులు, తాళం వేసున్న మిల్లు గేటును చూసి దిక్కుతోచక పిచ్చిచూ పులు చూస్తూ పోగైవున్నారు.

"మిల్లులో పనివల్ల సాయంత్రానికి శేరు బియ్యం, సేరు నూకలు చెంచమ్మ చీరకొం గున మూటకట్టుకునేది. ఈ దినం నుంచి కొంగులో గింజలు రాలవు. రేపట్నించి నా గతేంటి" అని తల్లడిల్లింది చెంచమ్మ.

★ ★ ★

చెంచమ్మ గుడిసెముందు ఈతాకు చాప పర్చుకుని, మగతగా పడివుంది.

మిల్లు మూతబడి, రోజుకు మూనెడు బియ్యం వచ్చే పనిపోయింది. పూట గడిచే మరే ఆధారంలేదు. రోగిష్టి మొగుడు గిద్దెడు నూకలు తేలేడు. పిల్లోళ్ళు కూనలు. యింకెట్టా. జరుగుబాటు కనాకష్టంగా వుండే. కట్టె పేళ్ల మోపెత్తుకుని బస్తీమీన అమ్ముకొని సంసారం గడపాల్సిందే.

చెంచమ్మ దిగులుగా లేచికూర్చుంది. గుడి సెలో మూలనున్న కుండమీదకు దృష్టిపో యింది. కూర్చునే పాక్కుంటూ కుండ దగ్గ రకెళ్ళి దానిమీద మూకుడు తీసి చెయ్యి పోనిచ్చి తడిమింది. కుండ సగానికి బియ్యం నూకలు చేతివేళ్ళకి తగిలాయి.

వారం దినాల్దాకా, గంజినీళ్ళకు కరువులేదు. మనస్సులో గుంజాటన తగ్గింది. చెంచమ్మ మనస్సు కుదుటపడ్డది.

నిత్యం మానాభిమానాల్ని పణంగా పెట్టినా బతుకు గడవటం సంకటంగా ఉందే! చెంచమ్మ ఆలోచించలేక మగతగా పడుకునుండగా గుడిసెల దాపున మాటల అలికిడి వినిపించింది.

చెంచమ్మ బొక్కబోర్లా పడుకుని బైట ప్రపంచాన్ని చూసి బిత్తరపోయింది.

దూరంగా తెల్ల అంబాసిడర్ కారు, తెల్ల గుడ్డలు ధరించిన ఘరానా మనుష్యులు నలుగురు నిల్చొని కనిపించారు.

మళ్ళీ వోట్లేపించుకోటానికి నాయకులు గుడ్సెలకాడికి ఎగబడుతున్నారు గావల్ను అనుకుని చెంచమ్మకు కంపరం మెత్తుకొ చ్చింది.

మేమిట్టా మాడి సస్తన్నాం. మామొరాల కించే సాములు లేరుగదా. ధరలు మండి పోతుండాయి. రెక్కలు ముక్కలు చేసు కున్నా పూట గడవటం అస్తుభిస్తుగుంది. దయాదాక్షిణ్యాలకు కరువొచ్చింది. మోసం మాయగా వుండే మా బతుకు. దయ్యాలు పిశాచాలు రాజ్జం ఏల్తుండాయా? నెయ్యి బువ్వ తినే మారాజులు ఏలతుండారో? మనుషుల నెత్తురు తాగే పిశాచాలు పీక్కు తింటూండాయి మమ్మల్ని. అనుకుంటూ చెంచమ్మ వాళ్ళవైపే శ్రద్ధగా చూసింది. వాళ్ళు ఆ ఖాళీ జాగా మధ్యలోకొచ్చి తూర్పు దిక్కుగా నిలబడి చేతులను, అటూ, యిటూ తిప్పుతూ మాట్లాడుకోవటం గమనించి ఆశ్చ ర్యపోతూ లేచి కూర్చున్నది.

వాళ్ళు చకచకా నడ్చివచ్చి వేపచెట్టునీడలో నిల్చొని సిగరెట్లు కాలుస్తూ గుడిసెలవంక సూటిగా చూస్తున్నారు.

గుడిసెలో పనిపాట్లుకు పోగా మిగిలిన




జనం ఒక్కొక్కరే గుడిసెల్లోంచి బయట కొచ్చి నిల్చుని విడ్డూరంగా వాళ్ళని చూట్టం మొదలు పెట్టారు. పిల్లా పీచు, మొండి మొలలతోనే వాళ్ళ ఆటలు మానేసి, గుమి గూడేరు.

ఆ తెల్లబట్టల వాళ్ళ చుట్టూ, గర్భదరిద్రం మనుషుల రూపంలో పాకుతూ కమ్మేస్తున్న ట్టుగా వుంది.

నరసింహులు తన గుడిసెలోంచి వొంగొని బయటకొచ్చాడు. చేతిలో చంటి పిల్ల నెత్తుకుని ఖామందుల దగ్గరకు నడ్చాడు. అతనికి తెల్లచొక్కా వాళ్ళంటే జంకులేదు. అతనెక్కువగా వాళ్ళమధ్యే మౌనంగా, తలొంచుకునే తిరుగుతూ కలు పుగోలుతనంగా వాళ్ళ కనుసన్నల్లో మెల గటం యిప్పుడిప్పుడే అలవర్చుకుంటు న్నాడు. కాలేజి విద్యార్థులకు కావాల్సిన తేళ్ళని, కప్పల్ని, బొద్దింకల్ని, ఎలకల్ను అడ పాతడపా సప్లై చేస్తుంటాడు. చేతులు వెనక కట్టుకుని వాళ్ళదగ్గరకు చేరాడు.

"ఏందోయ్ ఏనాదీ నీవీడుంటున్నావేంది? ఎన్ని గుడిసెలోయ్ మీవీ? " వాకబు మొదల లెట్టాడు తెల్ల ఖద్దరుబట్టలేసుకుని, కళ్లకి నల్లకళ్లజోడు పెట్టుకుని, పెదాల మద్దెన సిగిరెట్ బిగించిన ఆసామి.

"మాయి పది గుడిసెలే బాబా. చానా సంసరాల్నించి యీడే తలదాసుకుంటుం డావ్ సావే. పోయిన వోట్ల ఎలసన్‌ల యిళ్ళు యీడే కట్టిపిస్తావన్నారు సావే. మాకిళ్ళు యీడ కట్టిస్తారా బాబా!"

నల్ల కళ్లజోడు ఆసామి గాంభీర్యం వహిం చాడు. ఏనాది రాజకీయ చైతన్యం గ్రహిం చాడు.

"తవరి పేరు తెలవదుగాని తవర్ని చాన సంవత్సరాల్నించి బస్తీలో సూత్తానేవుండా, సామీ మాకీడ యిల్లు కట్టిస్తారా సామీ"

నల్లకళ్ళజోడు ఆసామికి రైసుమిల్లు, సిని మాహాలు, ఐదెకరాల చోట్లో పక్కపక్కనే పదేళ్ళనాడే ఏర్పడినాయి. బస్తీ అదిరిపా టుగా పెరుగుతూ విస్తరిస్తున్నది.

దాని పాటు పోకడ తెలుసుకున్న ధనవం తులు ముందుగానే ఐదు పదేళ్ళ దూరదృ ష్టితో స్థలాలు కొనిపడేసి యిళ్ళప్లాట్లుగా చేసి విపరీతంగా ధరలు పెంచి అమ్ముకుని లక్షాధికారులైపోతున్నారు. ఆవిధంగా బలి సిన ఆసాములలో బాలయ్య దిట్టమైన వాడు. యీయనీవిధంగా బల్సిపోవటం చూస్తూన్న కొందరు అసూయ పరులు ఈయన దేశం సొమ్ము దొబ్బెయ్యటంలో దేవేంద్రుడంతటి వాడని బిరుదు యిచ్చారు.

బాపయ్య యిరవై ఏళ్ళకిందటి దాకా తనకు చాతైన మటుకు ఉన్నతంగా ఆలో చిస్తూ, నిరాడంబరంగా జీవించటానికే పాకులాడిన ప్రజాసేవకుడే.

తనముందు తరం నాయకుల్లో చాలా మంది వళ్లుపై తెలియకుండా, ప్రజాసేవ చేసి జైళ్ళకెళ్ళి, పొలంపుట్ర లమ్ముకుని, స్వాతంత్రంకోసం పడిగాపులు కాచి, పిల్లలెది గొచ్చి ఎక్కిరాక యిళ్ళు వాకిళ్ళు, సొంతగ్రా మాలనొదిలి, దిక్కు దివాణం తోచక బస్తీల పాలై, స్వాతంత్ర సమరయోధుల పించెను నూకలకోసం జోలెపట్టి నానా అగచాట్లు పడుతూ, దిక్కులేని చావులు చచ్చి చందా లెత్తించుకుని, ఎత్తుబడి జరిపించుకున్న ప్రజాబంధువుల గాథలు కని విని తెల్సిన కొద్దీ ఉన్నతంగా ఆలోచిస్తూ పోతే కుక్క చావు చావాల్సి వస్తుందని గ్రహించాడు.

తర్వాత ఆలోచించటం మానేసి, వాస్తవా లను ఆకళించుకుని, పదునుగా, సమయాను కూలంగా ఆలోచించసాగేడు.

మొదట్లో పాటు కుదరక తంటాలు పడుతూ లేస్తూ, నిదానంమీద నిలతొక్కు కుని, వొడిదుడుకుల్లేని సాఫీలైన్లో ఆలోచ నలు తీగెలు సాగి, రెమ్మలు, కొమ్మలు,

పూలు పళ్ళదశలో పచ్చగా నవనవలాడుతున్నది.

ఆ దేవేంద్రుడు ఈ ఏనాదులు వున్న స్థలం, దాని వెనక స్థలం, కుడిఎడమల వున్న స్థలాల్ని కొని వారం కిందట రిజిస్ట్రేషను చేసుకున్నాడు. ఈ ఉదయం మంచిద వటం.వల్ల పౌర్ణమినాడు శంఖుస్థాపన చేయటానికి కావల్సిన ఏర్పాట్లు చూసుకోటానికి సపరివారంగా వచ్చేశాడు.

ఏనాదులంతా ఆడామొగా, ముసలి ముతకపిల్లా జల్లా బిలబిలవచ్చి చేరేరు. అంతా చేతులు కట్టుకుని నిలబడ్డారు.

కార్యసాధకుడైన బాపయ్య కాలినడకన యిద్దరంటే యిద్దరనుచరులతో వచ్చాడు. బాపయ్య నులక్కుక్కి మంచంలో ప్రసన్నంగా చాలా ఖరీదైన వస్తువులాగా భద్రంగా కూర్చున్నాడు. ఉదయం ఎండ అతనిమీద పడిపచ్చగా మెరుస్తున్నది. నల్ల కళ్లద్దాలు, రిస్టువాచి, చెప్పులు, బల్సినజేబు అతని ఐశ్వర్యాన్ని చాటుతున్నవి.

దూరంగా చెట్టు నీడలో అంబాసిడర్ కారు మౌనంగా ఖబడ్దార్ యామనుకున్నావో మా యజమానిగారంటే అన్నట్లున్నది.

"మిమ్మల్ని దిక్కులేని పక్షులమల్లే తరిమెయ్యదల్చుకోలేద్రాసుబ్బా" అన్నాడు వారం దర్నీ ఉద్దేశించి బాపయ్య.

"మా కంటా ఏతావు లేదు బాబా యాడ చారెడు నేల ఆపడితే ఆడే నాలుగు బొంగులు నాటుకుని పది తాటాకులు పర్చుకుంటాం. యీడ్నుంచి లెగిచి పోతాంలేండే" అన్నాడు సీతయ్య కీచుగొంతుతో.

సీతయ్యకు లేచి నిలబడే ఓపిక లేక గొంతు కూచున్నాడు. చిరుగుపాత చీరె ముక్క బుజంచుట్టూ కప్పుకుని బజార్లో హోటల్ ముందు శివాలయం దగ్గర కూచుని అడుక్కుతినే భిక్షగాడులా ఉసూరుమంటూ వున్నాడు.

బాపయ్య వాడివంక భయంభయంగా చూశాడు.

వెంటనే తేరుకుని వాళ్ళని చూసి "యీ భూమి యిర్వైవేలు పోసి కొన్నానని మీకు తెల్సు. మిమ్మల్ని గుడ్సెలు పీక్కెళ్ళండని నెల్లాళ్ళనాడు చెప్పేనా? మీరు లేవలేదు. నేను మీతో దుర్మార్గంగా పోదల్చుకోలేదు. పోలీసుల్ని మీమీదికి వుసికొల్పటం నా పాలిసీ కానేకాదు. మీ పదిళ్ళ వాళ్ళకి తలా వందయిస్తా. తీసుకుని ఖాళీ చేసెళ్ళిపోండి. నేను టాక్టర్ల మీన యిసకతోలించి మెరక చేపించుకోవాల" అని బాపయ్య తనతో వచ్చిన అనుచరులలోని, తోలు సంచి వళ్ళో పెట్టుక్కూచున్న వ్యక్తిని చూసి సైగచేశాడు.

అతను తోలుసంచి తెర్చి పదిరూపాయల బొత్తి బాపయ్య చేతికందించాడు.

బాపయ్య నోట్లకట్టను పట్టుకుని "రాంద్రా మీలొంప, పెద్దెవడో వచ్చి తీసుకొంద్రా" అని చెయ్యెత్తేడు.

యవరూ ముందడుగు వేసి రాలేదు.

"మీ కడుపులో ఆలోచనేందో చెప్పంద్రా ఐతే" అన్నాడు విసుగ్గా.

"మాకు సాల్దు బాబా మీరిచ్చేది. మాకేడన్నా స్థలం సూపించండి. మీరు పలుకుబడిగల మారాజులు మిమ్మల్నే నమ్ముకొన్నాం"

బాపయ్యలో విసుగు మాయమైంది. మంచి కంట్రాక్టు తేలిగ్గా వచ్చినంత సంతోషం కలిగింది.

వాళ్ళందరి కళ్ళలో ఏమీ చెయ్యలేని చేతగాని తనం కనిపించింది. వాళ్ళ దీనత్వానికి కరిగిపోయే స్థితినెప్పుడో వదిలించుకున్న బాపయ్య నిర్లక్ష్యంగా సిగరెట్ వెలిగించాడు.

"సరే! తలా రెండొందలిస్తా, ఖాళీ చేయండి"




వాళ్ళంతా భారంగా నిట్టూర్పులు వది లారు.

"ఏంట్రా మాట పెగల్దేంటోయ్"

"మాకేడన్నా చోటు చూపించుబాబా! మీరు పలుకుబడిగల మారాజులు"

"మీరిచ్చేది సాల్దుబాబా, వంద తాటాకు డెబ్బయ్ రూపాయల గ్గూడా రావటంలా పెద్ద బొంగు పది రూపాయలు. బొంగుల కట్టపాతిక తక్కువలేదు"

"మూడొందలు దయసేయండి"

"సావాన్లు సపలైసేయండి"

"ముంగల మాకు స్థలం కాయంసేయండి'

బాపయ్య శ్రద్ధగా విన్నాడు.

"మీకు స్థలం చూపిస్తా. టౌన్లో మున్సి పల్ కాలనీ పక్క స్థలంలో మీకు తలా మూడు సెంట్ల జాగా యిప్పిస్తా"

"మూడు సెంట్ల స్తలవే. ఒప్పుకున్నాం"

"అట్టాగే మూడొందలిప్పిత్తా సర్నా"

"తాటాకు గుడిసెకు వంద కాడికివ్వండి"

"నిట్టాడి, ఐదు బొంగులు దయసేయండి టాక్టరు తవర్ది, రెండుపూటలు మా సరం జాని, కాలిని కాడికి తోలించండి"

ఓరి దొంగలమ్మి కొడుకుల్లారా! మీ కోరిక లకంతులేదుట్రా. నేను కాస్త మెత్తపడ్డాన నేగా నన్నిట్లా పీక్కుతింటున్నారు. కానీండి, ఏం చేస్తాం. తేళ్ళపుట్టలాంటి మిమ్మల్నీడ నుంచి సొంతం తరిమేస్తేగాని యీ స్థలా నికి దశ యెత్తుకోదు. మిమ్మల్ని తరిమేసి, చుట్టూ ప్రహరి గోడ కట్టించి పదివేల కోళ్ళకు సరిపడే పెద్ద పెద్ద షెడ్‌లు వేయించి స్టేటుబాంకు సహాయంతో, భారీ పోకడ పోవాలి మరి. అనుకున్నాడు బాపయ్య.

వాళ్ళ వైపు చూసి "పది రోజుల్లో, ఖాళీచే యాలోయ్ మీ కోరికలన్నింటిని తీరుస్తాం. ముంగల డబ్బు తీసుకోండి" అని తోలు సంచి అనుచరుడితో "మూడొందలు చొప్పున పారేయ్" అని లేచాడు.

వ్యాపార రాజకీయాలు, రాజకీయ వ్యాపారం జములుగా, ప్రశాంతంగా, అహిం సగా, అలగామూకను, దరిద్రనారాయణు లను శ్రీమన్నారాయుడైన బాపయ్య సొంతం జయించేసి, విజయగర్వంతో తల వొంచుకుని గంభీరంగా నడ్చుకుంటూ అంబాసిడర్ కారు ఎక్కి కూర్చున్నాడు.

★ ★ ★

ఎక్కడెక్కడి నానాజాతి పక్షులన్నీ కొల్లేట్లో వాలి గూళ్ళు కట్టుకుంటాయంటారు.

బస్తీకి ఉత్తరంగా శాస్త్రప్రకారం స్మశానం వుంది. దాని పడమరగ నిక్కున సహజమైన పల్లపు బంజరు భూమివుంది. బస్తీలో స్వాతంత్రసమరయోధులున్నారు. బస్తీని పురపాలక సంఘం యాభైయేళ్ళనుంచి ఉద్ధ రిస్తున్నది.

పాతికేళ్ళనాడు పురపాలక సంఘ అధ్య క్షుడు, సదరు బంజరు భూమిని రాజకీయ బాధితుడుగా గుటకాయి స్వాహా చేశాడు. ఆ బంజరు భూమికి పట్టా సంపాదించి, పెత్తనంలో వుండగానే మున్సిపాలిటి చెత్త బండ్లతో రబ్బిష్ తోలించి గజం ఎత్తు మెర కచేయించేశాడు. ఆ స్థలాన్ని, మున్సిపాలిటి వారి అవసరం నిమిత్తం, వాళ్లచేత కొని పించి సొమ్ముచేసుకుని, ముగ్గురు కూతుళ్ళ పెళ్ళిళ్ళు చేసి, అధ్యక్షపదవినుంచి తప్పుకుని, దరిమిలా పక్కనున్న స్మశానంలో మానెడు బూడిద పోగై నిదానంగా కాలగర్భంలో కల్సిపోయాడు.

ఆ బంజరుభూమి మీద కిక్కిరిసినట్లుగా గుడిసెలు మొలిచాయి. బస్తీలో పలుకుబడి గల రాజకీయ పార్టీల వాళ్ళు, తమ అను యాయులచేత గుడిసెలు వేయించి, పేదల్ను వృద్ధిపించారు.




వర్షాకాలంలో ఆ భూమంతా మోకాల్లోతు నీళ్ళ చెరువుగా తయారై, ఎండాకాలంలో ఎండి నివాసయోగ్యమయ్యేది. ఎక్కడెక్కడి దిక్కు మాలిన బీదాబిక్కి జనం వచ్చి గుడిసెలు వేసుకుని, దుర్భరమైన అవస్థలను కూడా లెక్కచేయక, కాలం గడుపుతున్నారు.

చిన్నచిన్న గుడిసెలు లేపుకుని, దాన్లో దూరి, తిండితిని, జీవనోపాధికొరకు బస్తీమీదకు వెళ్ళి నానా అగచాట్లు పడి, చీకటిపడగానే గుడిసె మొహాలు చూస్తూ బతుకులు యీడుస్తున్నారు.

ఓ వెన్నెల రాత్రి బాపయ్యగారు, ఏనాదులను, వారి గుడిసెలను, రెండు ట్రిప్పుల్లో తోలించేసి చేతులు దులుపుకున్నారు.

సీతయ్య లేని ఓపిక తెచ్చుకుని చెంచమ్మ సహాయంతో, తన గుడిసెను కొత్త తావులో లేపుకున్నాడు.

నర్సయ్య, వెంకటయ్య, పెద్దోడు కొంచెం విశాలమైన గుడిసెలను దిట్టంగా ఏర్పాటుచేసుకున్నారు.

బావి వసతి వుంది. కరెంటు దీపాలు లేవు. ఆ చివర్న మొత్తానికి బాపయ్య వాళ్లకో నెలవు ఏర్పాటుచేసి తన స్థలం చుట్టూ కాంపౌండు గోడ ప్రారంభించాడు.

ఏనాదులందరూ ఆ కొత్త ప్రాంతానికి నిదానంగా అతికిపోతున్నారుగానీ సీతన్న యిమడలేకపోయాడు. రాత్రిళ్ళు కుళ్ళు గవులు వాసన రెండురోజులు అతన్ని హైరానాపాల్చేసింది.

చెంచమ్మ చేతులు కట్టేసినట్లు వున్నాయి. చేసుకోటానికి చాకిరి లేదు. యింటో జరుగుబాటులేదు. బాపయ్య యిచ్చిన దయా భిక్షం రెండొందలు ఎంతకాలం ఆదుకుంటాయి?

యిల్లు గడిచేమార్గం కనిపించటంలేదు. కటిక పేదరికం, పస్తుల పేదరికపు విషకౌగిలి బిగియపోతున్నదని చెంచమ్మ కంపించిపోతున్నది.

మొండిధైర్యంతో యాతనలను అనుభవించాల్సిందే అని మనస్సుని గట్టిచేసుకుంది. అంతకంటే గత్యంతరంలేదు.

★ ★ ★

పాక హోటల్ ప్రాంతంలో జోసఫ్ స్నేహబృందం వారం దినాల్నుండి కనిపించటంలేదు. ప్రకాశం మాత్రం సాయంకాల సమయాల్లో వచ్చి కూర్చుని తన వైద్యవృత్తితో కాలక్షేపం చేస్తున్నాడు.

సాయంత్రం ఐదు గంటల సమయంలో 'వందనాలు బిడ్డా ప్రకాశమా వందనాలు' జోసఫ్ తండ్రి అబ్రహాంమాష్టర్ పల్కరించగానే ప్రకాశం గుండె జల్లుమన్నది. ఆయన దీనవదనం చూస్తూ ప్రకాశం "కూర్చోండి మాష్టారు" అని గొణగ గల్గేడు.

అబ్రహం మాష్టారు మొహానికి పట్టిన చెమట తుడ్చుకుని, సర్వర్ తెచ్చిన రెండు గ్లాసుల నీళ్ళు తాగేసి మూల్గేడు. ప్రకాశానికి మాష్టారి ఆందోళన ఆరాటం అర్థమైపోయింది.

"మావోడ్ని లాకప్‌లో వేశారయ్యా ప్రకాశమా. యస్సై నన్ను చీదరించేశాడు. వినరాని కూతలు కూసి నన్ను గెట్ ఔటని తరిమేశాడు ప్రకాశం. పొద్దున్నుంచి ఎందర్ని కల్సి సహాయం కోరానో, బాపయ్యగార్ని కల్సా, మన ప్రభుదాస్‌ని బ్రతిమాలాను. మన డాక్టర్ ఏసుపాదంగార్ని వేడుకున్నా, వారు ఫోన్ చేసినా లాభంలేకపోయింది. పాస్టర్ పీటర్ గారియింటికెళ్ళి మొరపెట్టుకున్నా. ఆయన ప్రార్థన చేసి నీ పేరు చెప్పి, వెళ్ళి పట్టుకోమన్నాడు నీ వల్లనే అవుతుందన్నాడు" అని నిట్టూర్పు విడిచి ఆయాసప

డ్డాడు.

కాఫీ గ్లాస్ అందించాడు ప్రకాశం. "మరేం ఆదుర్దా చెందకండి, తాగండి. నా శక్తికొద్ది ప్రయత్నం చేసి మన జోసఫ్‌ని యీ రాత్రికే యింటికి చేరుస్తాగా మాష్టారూ. మీరు నాకు టీచర్, మా అమ్మ అంటావుంటది. అబ్రహాం మంచి ప్రభుసేవకుడు. మనకి దూరపు చుట్టం బంధుప్రీతి గలోడని చెప్తావుంటది" అని ఓదార్చాడు.

"అవును చెంద్రమ్మ అక్క మా అంకుల్ దైవసహాయంగారు, ఆల్ఫ్రేడ్‌గారు అంతా ఒక్క కుదుట్లోవాళ్ళేగా బిడ్డా ప్రకాశమా" అబ్రహాం మొహంలో కాస్త వెలుగొచ్చింది. అణిగిపోయి, పొద్దున్నుంచి దిగజారిపోయిన శక్తి లేచి నిటారుగా నిలబడింది.

"ఈ యస్సై అంత పొగరు మోతుగా మాట్లాడాడేంది, మా ముదనష్టపు నా కొడుకు యింత చెడిపోయాడని నాకిప్పుడే తెల్సింది. నా కడుపున చెడపుట్టాడు జోసఫ్‌గాడు. బాగా చదివి బాగుపడ్రా. యం.ఏకి కట్టి చదువుకో నాయనా అని ప్రతిలెటర్లో వార్నింగులిస్తుంటా. నా చిన్నతనంలో నా తండ్రిపోగానే, నా తల్లి హాస్టల్లో వుంచి చదువుకోమంది. పేదరికంలో గడ్చిపోయింది నా బాల్యమంతా. యసెసెల్సీ పాసై, ట్రయినింగ్‌అయి,ఏకోపాధ్యాయుడుగా చేరి నిమ్మళంగా, యింటర్ పాసై, బియ్యే ముగించి బియ్యిడి చేసి, యీనాడు జిల్లా పరిషత్ హైస్కూల్లో హెడ్మాష్టరుగా వొచ్చే సెప్టెంబర్‌లో రిటైర్ కాబోతుండా" అని తన పేదరికం, స్వయంకృషి చాటుకుని సానుభూతి వాతావరణం సృష్టించేసుకుని, ముక్తాయింపుగా "కాలం మారిపోతున్నది. మా జిల్లాపరిషత్, డి.యి.వో. ఆఫీస్ లంచాలు లేనిదే కాయితం కదలని పరిస్థితి దాపరించేసింది. ప్రతి డిపార్ట్‌మెంటూ ఆ రకం దుర్మార్గ స్థితిలో పెరుగుతున్నాయిలే, ఏం చేస్తాం. మరి ఈ యస్సై మనకులమంటేనే మండిపడతాడంటగా.

"అదేం కాదు. ప్రథమ కోపం పెచ్చు స్నేహానికి కన్సెషనిస్తాడు. ఆ డిపార్టిమెంటే బాడ్కో డిపార్టిమెంట్. పైగా పై ఆఫీసర్ల వత్తిడి జాస్తిగదా. వచ్చే వారం, డి.యస్పీ. దొరగారి ఇనస్పెక్షన్, సర్కిల్ దొరగారి ఘుషాయింపులు ఫోన్లో గంట గంటకూ. ఈ నెల్లో స్టేషన్లో ఆదాయం తగ్గింది. కేసులేం లేవు. రోడ్‌మార్జిన్ మామూళ్లు నిఖరాదాయం కొద్దిగా వుంది. డబ్బు కట్ట లొచ్చే నేరాలేం రాలే రెండు నెల్లనుంచి. బెదిరించి, భయపెట్టి గుంజె మొత్తాలేం తగల్టంలేదు. ఐ.పి.సి. సెక్షన్లకింద బిగించే పవర్‌గల్గిన చీటింగ్, డెకాయిటి, మర్డర్స్ కిరోసిన్ కూనికేసులేమి ఈ పోలీస్‌స్టేషన్ పరిధిలో జరగటంలేదు. స్టేషన్ బోసిపోయి బావురుమంటున్నదంటారు"

పోలీస్ యంత్రాంగపు ఫొటోస్టాట్ కాపీని ప్రకాశం, అబ్రహాం మాస్టారికి అందించాడు.

"ఐతే మా జోసఫ్ సంగతేం తేల్చావ్? నన్నీ కష్టంనుంచి తప్పించు" అని చేతులు పట్టుకున్నాడు అబ్రహాం.

ప్రకాశం లేచి 'వెళ్దాం పదండి' అని నడిచాడు. అబ్రహాంగారు అతన్ని అనుసరించి మధ్య దోవలో ఇరవైరూపాయల వందకట్ట గుప్పెట్లో పట్టుకుని "రెండు వేలు ఎత్తకొస్తుండా, యస్సై మొహానకొట్టి మావోడ్ని లాకప్‌లోంచి విడిపించు" అని ప్రకాశం చేతికిచ్చేశాడు.

"మీరు పోలీస్‌స్టేషన్ ఎదరనున్న వేపచెట్టుకాడ వుండండి. నేను యస్సై ఇంటికెళ్ళి కనపడి మాట్లాడొస్తా. ఆయన చీకటి పడితేగాని బయల్దేరడు. స్టేషన్లో కాసేపు వుండి తర్వాత ఆఫీసర్ల క్లబ్‌లో వాల్తాడు. సరే మీరీరోడ్‌నుంచి స్టేషన్‌కి పదండి" అని యస్సై ఇంటికి దారితీశాడు ప్రకాశం.




అబ్రహాంగారు బతుకుజీవుడా అనుకుంటూ వేపచెట్టువైపు నడిచాడు.

అలా ఓ అరగంట ఎదురుచూస్తూ నిల్చున్నాడు అబ్రహం. యస్సై మోటార్ సైకిల్ మీద రాష్‌గా వచ్చి పోలీస్‌స్టేషన్‌ముందు ఆగాడు. మోటార్ సైకిల్ వెనక సీట్లోనుంచి ప్రకాశం దిగినిల్చున్నాడు. అబ్రహం నిదానంగా చీకట్లోంచి వెల్తుర్లోకొచ్చి నిలబడ్డాడు. యస్సై ఠీవిగా దిగి దర్జాగా మోటార్ సైకిల్ స్టాండ్ వేస్తూ గమనించనట్లుగా చూసి స్టేషన్‌లోకి ఉషార్‌గా నడిచాడు. ప్రకాశం అనుసరించాడు.

అరగంట తర్వాత లాకప్‌నుంచి బయట పడిన జోసఫ్‌ను ప్రకాశం నడిపిస్తూ స్టేషన్ బైటికి తీసుకొచ్చి అబ్రహాంకు అప్పగించాడు. "తండ్రి, కొడుకులను రిక్షాలో ఎక్కించి ప్రకాశం భారంగా నిట్టూర్చాడు. అతని మదిలో చెంచమ్మ దీనస్థితి, దుర్భర దారిద్రంవల్ల కలిగే యాతనలు వరదలా ఆవరించాయి.



కాలవకట్టమీది మురికివాడ చీకట్లో నిద్రపోతున్నది. పగలంతా చాకిరి చేసిన జనం, పెందలాడే దీపాలు వెలగగానే అన్నాలు తినిపడుకున్నారు.

మంగమ్మ గుడిసెలో లాంతరు వెల్తుర్లో, కునికిపాట్లు పడుతూ బాదం ఆకులను బొత్తులు తట్టలో పేర్చుతున్నది. ఎర్రకారం దంచి డబ్బాలో పోసింది.

కొడుకు సత్యం అండ దొరికినప్పట్నుంచీ ఆమెకు ఎన్నడు లేని ధీమా వచ్చేసింది. వెనకటి భయం, పిరికితనం, రేపెట్టా గడుస్తుందో అనే దిగులు మనస్సులోంచి మాయమైనాయి.

నైనంగా రేపటి చాకిరికి కావల్సిన సరంజామాను గుడిసెలో మూలకు చేర్చి దీపం తగ్గించి సత్యం కొని ఇచ్చిన నులకమంచం మీద బొంత పర్చుకుని పడుకుని, కళ్లు మూసుకుంది. మాగన్నుగా నిద్ర ముంచుకొస్తుండగా "లం... కొడుకును సూసుకుని మిడ్సిపడ్తున్నది లం..." మొగుడు గొంతు లీలగా వినిపించింది.

ఈ వారంలో మూడుసార్లు తనమీద కలబడి, బూతులు తిడ్తూ ఒళ్లు హూనం హూనం చేశాడు సచ్చినోడు. ఈడెప్పుడు సస్తాడో దేవుడో, అనుకుందాక్షణం మంగమ్మ.

ఈసారి తనమీదికి కలబడితే రోకలితో తలను నజ్జు, నజ్జుగా చితక కొట్టాలని అనుకుంది. అలా కొన్ని వందలసార్లు అనుకున్నది. కానీ ప్రతి తడవా తనవల్ల గావటం లేదు.

గుండెలో కచ్చె, కసివున్నా ఏం చెయ్యలేక పోతున్నది. మొగుడు చాలా మెలుకువగా అంత తాగిన మైకంలో కూడా, తన జుట్టును చిటుక్కున లంకించుకుని తలను గుంజి తనను కిందపడేసి బరబరా నేలమీదకి ఈడ్చి, కాళ్ల, చేతుల్తో కుమ్మేస్తాడు. తనేం చెయ్యలేకపోతున్నది. తనమీద ఎందుకంత కసి ఈ తాగుబోతు సచ్చినోడికి.

య్యామైనగానీ తను కిందపడిపోకూడదు. రోకలి తీసుకుని...

రామస్వామి గొంతు దగ్గరగా వినిపిస్తున్నది. "సత్తిగాడ్ని నరికిపోగులు పెట్టా. ఈ లం...ని గుడ్సెలోంచి తరిమేస్తా, లం... వాడిచేత నన్ను తన్నిస్తదా లం... ఏడున్నావే లం... తప్పుడుముండా" అని రంకె వేశాడు.

గుడిసెలన్ని దాదాపు ఒకేలాగా వున్నా అంత మత్తులో గూడా రామస్వామి తన

గుడ్డెను తేలిగ్గా గుర్తుపట్టగలడు. ఈ విష యంలో అతన్ని అంతా మెచ్చుకుంటారు.

మంగమ్మ మత్తు నిద్ర వదిలింది. మంగ మ్మలో తెగింపు మేల్కొన్నది. గుడిసె తడికె తలుపు తాడువిప్పి బయటకి వచ్చి నిల్చు న్నది.

రామస్వామి చీకట్లో తూలుతూ గడుసు దయ్యంలా వస్తున్నాడు. భార్యని గమనించి "ఏందే నిలబడ్డావ్. మిండగాడి కోసమా, ముండా!" అని రంకేశాడు.

మంగమ్మలో తెగింపు రాజుకుంది.

"నీ నోరు పడ. గమ్మగా గుడ్సెలోకి సావరా. నీ దెవసం సెయ్య" అంది.

"కొడుకుని చూసుకుని మురిసిపోమాక, వాడు నీకు కూడు పెట్టడే. దొంగ లం..."

"నీ నోట్లో పురుగులు పడ. నీవు సక్రంగా వుంటే మాకి తిప్పలుండేవి కాదుకదరా. నీ తాగుడు మమ్మల్నీ తావుకీడ్చుకొచ్చింద్రా. ఆడపిల్లలు సంసార పచ్చంగానే కలో గంజో తాగి బతికేవోళ్లే. నీ ఆగంవల్లే వాళ్లు చెట్టు కొకరు పుట్టకొకరయ్యార్రా యదవ సచ్చి నోడా. సత్తేన్ని సావసితకబాది ఆడ్ని దేశాల పాల్జేశారుగదా. నీ దెవసం ఏనాడు సేస్తారో. ఆనాడే నాకు సుకం"

"సస్తా. సస్తానే. నిన్ను సంపి నేసస్తా. అందాక చావనే చావనూ ముండా"

మంగమ్మ జుట్టు ముడివిప్పి విదిలించు కుని మళ్ళీ ముడి బిగించి తెగువతో వచ్చి వాల్చిన నులక కుక్కిలో కూర్చుంది.

రామస్వామి జోరు తగ్గించి తూలుతూ అడుగులేస్తూ రోలుమీద కూర్చోబోయాడు. చెయ్యి తగిలి బుడ్డి దీపం కిందపడి ఆరిపో యింది.

"దీపం ఆరిపేశావా ముదనష్టపోడా. సీకట్లో అగ్గిపెట్టే యాడని ఎతికేది. అబ్బా ఈ మాయదారి చాకిరి అర్ధరేత్రిదాకా సేయ లేనమ్మా. నా పేణం కడపర్తువుంది. ఛీ... ఛీ. జల్మ"అని సణుక్కుంటూ వచ్చి కింద పడ్డ దీపాన్ని వంగి ఎత్తబోయింది.

రామస్వామి వంగిన మంగమ్మ కొప్పు లటుక్కున కుడిచేత్తో పట్టుకోటానికి తంటాలు పడ్డాడు చీకట్లో పట్టుచిక్కలా.

మంగమ్మ తల విదిల్చి వంగునే నేలమీద వెనక్కి జరిగింది.

రామస్వామి క్రూరంగా నవ్వి "తప్పించు కున్నావా ముండా. యాడకి పోతావే?" అంటూనే మంగమ్మ జుట్టు వడిసి పట్టే శాడు.

మంగమ్మ పిచ్చి తెగువతో తల విది ల్చింది. రామస్వామి పట్టు వదిలేశాడు.

"అమ్మ లం... నిన్ను..."

మంగమ్మ తలతో పొట్టేలు కుమ్మినట్లుగా పొడిచింది."అమ్మో చచ్చానే" అని అర్చి చతి కిలపడి, వెనక్కి విర్చుకుపడిపోయాడు. పడటం పడటం తల రోటికి తగిలింది. "అమ్మో" అని అర్చి పెద్దగా మూల్గాడు. ఇహ లేవనేలేదు.

మంగమ్మ లేచి జుట్టు ముడేసుకుని చుట్టూ కలయచూసింది. అంతా చీకటి. దూరంగా గుడిసెలోంచి పసిపిల్ల ఏడుపు వినిపించింది. ఆకాశంలో నక్షత్రాలు మెరు స్తున్నాయి. చుట్టుతా నిశ్శబ్దంగా, ప్రశాం తంగా వుంది.

మంగమ్మకు నేలమీద పడున్న మొగుణ్ణి చూసి భయమేసింది. ఆ భయంలోంచే మెరుపులా సంతోషం మెరిసింది. రామ స్వామి మొహం దగ్గర వంగిచూసి, చేత్తో గుండెమీద నిమిరింది. "ఓయ్యా! నిన్నే. ఓయ్యా నిన్నే" అని పిల్చింది. వాడు కదల్లా!

మంగమ్మకు భయమేసి భర్త ముక్కు దగ్గర చెయ్యి ఆన్చింది. గాలి తగల్లే.

ఆమెకు తెలియకుండానే కాళ్లు గురవయ్య గుడిసె దగ్గరకు ఆమెను తీసికెళ్ళాయ్.





"గురవయ్య బా. గురవయ్యబా" అంది.

"ఆ... ఆ" అని లేచి "ఏందమ్మా మంగమ్మక్కా. ఇప్పుడే కునుకు పట్టింది. రావసావి బావరుపులు యింటా. యింటానే వున్నా. నిద్ర పట్టేసింది"

"మీ బావ ఎల్లికిలా పడిపోయాడు. వులుకులే. పలుకులే. ఓ పాలి వచ్చి సూద్దువుగాని రా. అక్కని లెగొట్టు"

"ఆ వస్తన్నా" అని వెంకమ్మ లేచి కూచుని "ఇందాక బావ కేక వేస్తా ఎల్లటం యింటానే వున్నా మంగమ్మక్కా కళ్లు ఇప్పుడే మూతలు పడ్డాయి. ఇంతలో నీ మాట ఆలకించా. పద సూద్దాం... చస్తే పీడొదిలిపోద్ది. ముదనష్టపోడు సామి" అంటూ నడిచింది.

ముగ్గురూ రామస్వామి దగ్గరకొచ్చారు. మంగమ్మ గుడిసెలోకెళ్లి అగ్గిపెట్టె తెచ్చి దీపం వెలిగించి భర్త మొహం దగ్గరకు పట్టుకుని చూపించింది.

"రామ్సామీ, రామ్సామీ, రామ్సామీ" గురవయ్య పెద్దగా, కేకేస్తూ తట్టి లేపటానికి ప్రయత్నించాడు.

"ఇంకేడ రావసావి. దీపం ఆరిపోయిందిలే" అంది వెంకమ్మ.

"నిజంగా సచ్చిపోయాడా" గొణిగింది మంగమ్మ.

"పోయాడు. పీడొదిలిందే మంగమ్మక్కా"

"బలే సిత్రంగా చిటికలో పోయాడేబా. వల్లు గుల్ల అయిందిలే ఎప్పుడో. ఆకారానికే గానీ మడిసిలో సారం ఏనాడో అయిపోయింది. నేననుకుంటానే వున్నా. రావసావి ఏ అర్ధరెత్తిరో, ఏ రోడ్డుపక్కనో, సారాకొట్టు కాడో, గుటక్కుమంటాడనుకున్నా. అట్నే అయింది. అదృష్టమంతుడు. ఇంటిముంగలే హరీమన్నాడు" అన్నాడు గురవయ్య.

మౌనంగా మంగమ్మ మొగుడు తల దగ్గర కూర్చుంది.

నిశ్శబ్దం ఆ గుడిసెలోకి తొంగిచూసింది. శవజాగరణకంటే దుర్భరమైన జీవితాన్ని చాలా ఏళ్లనుంచి భరించిన మంగమ్మ ఉదాసీనంగా కూర్చుంది.

సత్యం తన పక్కనుంటే అనుకుందాక్షణం మంగమ్మ.

"గురవయ్యబా. మా సత్తేనికి కబురు చెయ్యవా" అని గొణిగింది.

"అట్నే. ఇప్పుడే మా చిన్నోడ్ని బెజవాడ కంపిస్తా. ఏ లారీమీనో ఎల్లి తెల్లారిపాటికి వత్తాడు సత్తేన్నితోడుకుని"

"పంపు ముంగల. సచ్చి నీ కడుపున పుట్టా"

"అట్నే. పంపతాలే. మేం నీకండగా వుంటాం. సింతపడమాకా"

"పెద్దానికి సిన్నదానికి కబురు చేపింపు. మూడోది యాడున్నాదో, నా పెద్దకూతుర్కి తెల్పు. నాల్గోది చుక్కమ్మ కాడుంది"

అట్నేలే. రేపొద్దున కబురంపతాగా" అని గురవయ్య వచ్చేశాడు ఆవలిస్తూ.

రామస్వామి మట్టిలో కల్సి పదమూడురోజులయింది.

మంగమ్మకు రామస్వామి క్రూరత్వం నుంచి విముక్తి లభించింది. మెళ్ళో వెలిసిపోయిన పసుపుతాడు వదిలిపోయింది.

సత్యం తనతో రమ్మని బతిమాలేడు.

మంగమ్మ మౌనంగా తలొంచుకుని కూర్చుంది. ఆమెలో గట్టి నిర్ణయాలు ఏర్పడ్డాయి. ఆమె దుర్భరమైన జీవితాన్ని అనుభవించింది. భర్త తనను భయంకరంగా రాత్రులు హింసించి నిద్రకు కూడా దూరం చేసేవాడు. పదిమందిలో తలెత్తుకుని తిరగలేకపోయాడు. కూతుళ్ల జీవితాలైనా సక్రమంగా గడుస్తున్నాయనే సంతృప్తి గూడా

ఆమెకు లేదు.

రెక్కల్లో సత్తవ వున్నన్నాళ్లూ నా పొట్ట నేను పోషించుకోవాలనే నిశ్చయానికొచ్చింది.

తెల్లవారకముందే మంగమ్మ లేచి, గుడిసె ముందు వూడ్చి నీళ్లు చల్లి ముగ్గేసింది.

రోడ్డుపక్కన మూడు రాళ్లపొయ్యి రాజేసి పెనం పెట్టింది.

రాత్రే కలిపి గిన్నెనిండా వుంచిన దోసెల పిండి, టిఫిన్, నిండా కారం చెట్ని సరంజామా సర్దుకుని చతికలపడి కూర్చున్నది.

చల్లటిగాలి ఆమె ప్రశాంత హృదయానికి ప్రశాంతతను కలిగించింది.

సత్యం నిద్రలేచి వాకిట్లో పొయ్యిముందు కూర్చుని దోసెలు పోస్తున్న తల్లి ఆలోచనలను గ్రహించాడు. తల్లికిగల పట్టుదల, ఓర్పు, ఆత్మవిశ్వాస బలం అతనికి బాగా తెల్సు. తల్లి ఈ గుడిసెలోనే మామూలుగా కాలం గడపటానికే నిర్ణయించుకున్నట్లు తేలిపోయింది. తండ్రి పీడ వదిలిపోయినందువల్ల తల్లి మనస్సు తేలికై చీకూచింతా లేకుండా పావలా డబ్బులు తేలిగ్గా సంపాదించుకోగలదనిపించింది సత్యానికి.

"నీకు ప్రతినెలా వంద రూపాయలు పంపిస్తానమ్మా సరేనా" అన్నాడు.

"ముంగల మొహం కడుక్కో... అన్నం తిందువుగాని" అంది తల్లి.

సత్యం మొహం కడుగుతుండగా మంగమ్మ తన మనసులో మాట చెప్పింది...

"నీవెంతో కష్టపడి రూపాయి రూపాయి కూడబెట్టి ఎయ్యి రూపాయలు ఎత్తకొచ్చి కొత్త గుడిసె కట్టావు. యింట్లో సావాన్లు వస్తువులు కొనిపెట్టావామరి. ఏటికి వెతుక్కోక్కర్లేకుండా అన్ని వుండాయి. చుట్టుపక్కల గుడిసెలోళ్లంతా, యిరుగు పొరుగంతా మనవంటే పేణాలిత్తారు. తల్లితోడుగా ఒకరికొకరుగా వుంటున్నాం. నా కాలూ చెయ్యి బాగుండేదాకా ఈడేవుండి ఇట్టాపొట్టపోసుకుంటారా అబ్బయ్యా! నా మీన కోప్పడమాక నాయనా!"

"అట్నేలేయమ్మా! నీవెట్టా అనుకుంటావో అట్టాగే కానీయ్. ప్రతినెలా వంద పంపిస్తాగా. నీ ఇష్టం వచ్చినట్టు చేసుకో. ఇప్పుడ్నుంచైనా చీకూచింతా లేకుండా వుండు. కార్డు రాపించి ఏశావంటే రెక్కలు కట్టుకవాల్తా సరేనా"

★ ★ ★

గాయిత్రి బార్ ముందు గుంపు పోగై వుంది. ఇంకా చీకట్లు ముసురుకోలేదు. వీధి లైట్లు ఇప్పుడే వెలిగాయి. సినిమాలకు పోయే జనం గుంపులు గుంపులుగా తొందర తొందరగా పరిగెత్తుతున్నారు. ఈ గుంపువంక చూసి చూడనట్లు చూసి గబగబ వెళ్తున్నారు. ఆకాశంలో మేఘాలు పరిగెత్తుతున్నాయి.

గాయిత్రి బారు ఈ పాటికే కళకళలాడుతూ వుండాల్సింది. అద్దాల బీరువాల్లో రకరకాల బ్రాందీ సీసాలు రంగురంగు విద్యుత్ దీపాలమధ్య తళతళలాడుతూ తాగుబోతులను ఆహ్వానించాల్సిన సమయం.

బారు తలుపులు మూసి వున్నాయి. బారులోపల సందడి బొత్తిగాలేదు. బారు బయటే మద్య నిషేధ ఉద్యమ చైతన్యపు కేకలు.

అరడజను మంది యువకులు, పది మంది స్త్రీలు, రెండు వరసల్లో నిలబడి కంఠనాళాలు ఉబ్బరించేట్లుగా అరుస్తున్నారు.

"కావాలి, కావాలి సంపూర్ణ మద్య నిషేధం కావాలి"

"వర్ధిల్లాలి సంపూర్ణ మద్య నిషేధం వర్ధిల్లాలి"




"పాన శాలలు వద్దేవద్దు, కావాలి కావాలి, పాఠశాలలు కావాలి"

ఎదురు పేవ్‌మెంటు మీద చాలా మోటార్ సైకిళ్ళు, స్కూటర్లు ఇరుకుగా ఆగి వున్నాయి. వాటిమీద వాటి దరిదాపుల్లో యువకులు, లెక్చరర్లు, ఉద్యోగస్థులు నిలబడి చోద్యం చూస్తున్నట్లు చూస్తున్నారు. అసహనంగా చిరాకు పడుతున్నారు బ్రాందీ ప్రియులు.

"ఇంక పోరేం వీళ్లమ్మ..." అన్నాడో బ్యాంకు ఉద్యోగస్తుడు, స్కూటర్ మీద కూర్చున్న ఇంగ్లీష్ లెక్చరర్‌తో.

మద్యనిషేధ ఉద్యమ కార్యకర్తలు ఇక్కడి నుంచి ఎప్పుడు వెళ్తారో! తాము బార్‌లోకి ఎప్పుడు దూరుదామా అని నిరీక్షిస్తున్న మధ్యతరగతి మేధావులు ఓపిగ్గా నిల్చున్నారు.

నీలిలైట్ల కాంతిలో, ఎయిర్ కండిషన్ గదుల్లో హాయిగా, విశ్రాంతిగా కూర్చుని గాజుగ్లాస్‌లో బ్రాంది గుటకవేస్తూ కాలాన్ని దుర్వినియోగం చేసేందుకు అలవాటుపడి అర్ధరాత్రి ఇళ్లకు చేరే దౌర్భాగ్యమూక అది.

"హల్లో బోస్ క్యాబాయ్! ఏందిబాయ్ ఈ తిప్పలు మనకు!" అని హేళనగా నవ్వేడు డాక్టర్ సత్తార్.

"ఠహర్ జరా" బోస్ హామీ నవ్వునవ్వేడు.

చీకట్లు చిక్కనైనయి. వర్షపు జల్లు పల్చగా మొదలయింది.

ఉద్యమకారులు వెనక్కి తిరిగి "సంపూర్ణ మద్యనిషేదం వెంటనే అమలు జరపాలి" అని నినాదం చేస్తూ అక్కడినుంచి రోడెక్కారు.

వాళ్లు మరో వైన్‌షాపు ముందు సత్యాగ్రహం చేయటానికి బయలుదేరగానే ఇక్కడ పేవ్‌మెంట్ల మీద నుంచి, పక్కల్నుంచి, అటునుంచి ఇటునుంచి ఒక్కొక్కరే నిదానంగా బార్‌లోకి బయలుదేరారు మద్యప్రియులు.

బైట దీపాలతోరణాలు, బార్లో దీపాలు వెలిగాయి. బార్ తలుపులు వోరగా తెరుచుకున్నాయ్! నిదానంగా కుర్చీలు నిండాయి. బల్లలమీద సీసాలు, గ్లాస్‌ల సందడి ఆరంభమైంది.

ఓ మందుభాయి "మనకూ రోజులు దగ్గరకొచ్చాయా? " అని గొణిగాడు.

"ఆ! వాళ్ల మొహం! తాటాకు మంటలేనోయ్ ఈ కేకలూ"

"బలే చెప్పార్ సార్! బాగా గెస్ చేశారు సార్! కోట్లతో వ్యాపారం, మజాకా కాదు! కోటీశ్వరులు వూరుకుంటారా! కాంట్రాక్టర్లు చేతులు ముడ్చుకుని నిలబడతారా! అహ. అహ, హి, హి... నవ్వుల మధ్య మద్యపాన ప్రియులు తమ మెదళ్లకు మత్తు మేపుకుంటున్నారు. బయట వానజల్లులు ఎక్కువైనాయి.

మద్యనిషేధ ఉద్యమ కార్యకర్తలు వర్షానికి పూర్తిగా తడిచి ముద్దలైనారు. మరి ఆడవాళ్లు పైట చెంగుల్ని పిండుకున్నా కింద భాగమంతా తడిసి నీరోడుతుంది.

వాళ్లంతా పెద్ద మేడ వరండాలో తలదాచుకుని నిల్చున్నారు. ఓ కార్యకర్త వాళ్లందరికీ టీ గ్లాసులందించాడు. వేడి టీవాళ్ల గొంతులోకి జారి ఉత్సాహాన్ని కలిగించింది.

"మీకు చానా ఇబ్బంది అయింది. రిక్షాలో ఇళ్లకెళ్లండి" దళ నాయకుడు సలహా.

"ఎందుకులే అబ్బయ్యా! ఇవి మాకోలెక్కా, నడస్తా వెళ్లితే దోవలోనే ఆరిపోతాయి కోకలు"

"అంతేలే మంగమ్మక్కా. రిక్షాలో ముడుక్కుని కూకోలేం" అని మంగమ్మకు వత్తాసు పల్కింది వెంకమ్మ.

"మీ ఇష్టం! వాన జల్లు తగ్గింది వెళ్దామా'

"అట్నే అబ్బియ్యా! మేం ఈ బజార్న పడి. ఎల్తాం. కాకితో కబురు సేయండి. మేం రెడీగుంటాం. లగెత్తుకొస్తాం" అని మంగమ్మ చకచకా నడకసాగించి మిగతా వాళ్లలో కల్సింది.

నెల కిందట కాలవకట్టమీద గుడిసెలు తగలబడిన మరుసటి రోజున రాత్రంతా వాన కురుస్తూనే వుంది. కట్టుగుడ్డలే మిగిలినయి. అవ్వే తడిసి ముద్దైనాయి. వాట్నే పిండుకుని ఆనాడు షావుకారు పెంకుటింటి వరండాలో ముణుక్కుని చలికి వణకతా రేపటి పరిస్తితి ఏంది ఎట్లా ఈ బాధలేంది దేవుడా! రావుడా అనుకుంటా ఆ చీకటి వాన రాత్రి అగచాట్లలో కల్గిన ఆవేదన వేరు.

ఈనాటి రాత్రి సారా ఉద్యమంలో పాలు పంచుకుని తడుస్తా ఇంటికెల్తుంటే ఎంత సంబరంగా వుందో మేవేనా, ఈ పనులన్నీ సేస్తున్నది. సిత్రంగుందే అని అనుకుంటుంది మంగమ్మ మాటిమాటికీ.

కాలవకట్టమీద గుడిసెలు తగలబడిన తర్వాత బూడిదెత్తి పోసుకుని నిమ్మళంగా మళ్లీ ఒక్కో గుడిసె చల్లగా లేచినవి. గుడిసెల్లో దీపాలు వెలిగాయి. నేల అలుక్కుని ముగ్గులేసుకుని గుడ్డలు, బొచ్చెలు, కుండలు ఏర్పాట్లు చేసుకుంటుండగా కొందరు బువ్వ లొండుకుంటుండగా, గుడ్డలుతుకుతుండగా పోలీసులొచ్చిపడి మంగమ్మని, ఎంకమ్మని, రోశమ్మని, పోలేరమ్మని పోలీస్టేషనుకు రమ్మని పట్టుపట్టారు.

"మీ మీద కేసు పెట్టేరు. రాండి! ఇనస్పెక్టర్ పిల్చుకుని రమ్మన్నాడు. రాండి ఆయనతోనే చెప్పుకోండమ్మా తొందరగా రాండి"

"మాకేం తెలవదు. మాకు గిట్టనోళ్లు మమ్మల్నింకా కష్టాల్లో తొయ్యటానికి చూస్తుండారు"

"ఆ మాటే చెప్పుకోండొచ్చి" హెడ్ మెత్తగా భయంగా అన్నాడు.

"పదండైతే ఆడ సారాయి దుకాణం, కల్లుపాకా లెగవటానికి మేం ఒప్పం! ఏందమ్మే మాట్టాడరేందే!" మంగమ్మ అరిచింది.

అప్పటికే యాభైమంది పోగైనారు. "అంతే అంతే వీల్లేదు" పెద్దగా అరిచారు కేకలేశారు.

"ఆ మాటే చెప్పుకోండి తల్లుల్లారా!" పోలీసు జవాను బతిమాలుతూ అన్నాడు.

"పదండసే సారా కంట్రాటరేంది, సర్కిలినసపెట్టరేంది. పదండెహె! ఈ బాధలకంటే ఆ జయిల్లోనే కూకుందాం పదండేహె" వెంకమ్మ పెద్దగా గావుకేకవేసింది.

"పదండసె పదండహె!" అని అరుస్తూ వంద మంది పోగై గుంపులు గుంపులుగా బయలుదేరారు.

పోలీసులు "మీరంతా ఎందుకమ్మ! మంగమ్మ, వెంకమ్మ, రోశమ్మ పోలేరమ్మ, రాఫులమ్మ, లచ్చమ్మ, ఈ ఆరు మందే రావాల తెల్సిందా!"

"తెల్సులే బాబా! మేవంతా రావాల్సిందే! మేం వచ్చేదే వచ్చేది. మమ్మల్నందర్నీ బొక్కలో తోయండి. మా అందర్ది వొకటే మాటకట్టు"

పోలీసులు పక్కకి తప్పుకున్నారు.

ఈ గుంపు కాలవకట్ట దాటేప్పటికి యింకా జనం కలిశారు.

"మా లొంపలో సారా దుకాణం వద్దు" ఓ గొంతు పెద్ద కేకవేసింది.

"వద్దో వొద్దు... సారా దుకాణం" బోలెడు మంది అరిచారు.

గుంపు పెరిగింది. పళ్లబళ్ల సెంటరు వచ్చేప్పటికి యువకులువచ్చి కలిశారు. లారీ సెంటరు దగ్గరకు చేరగానే గుంపు ఇంకా పెరిగింది. నినాదాలకు వళ్లొచ్చింది. బలమొచ్చింది.

గుంపు వేగం తగ్గి నినాదాల హోరు పెరిగింది.

అప్పుడు మంగమ్మ తెప్పరిల్లుకుని "ఏందమ్మే కోటమ్మ ఈ జనం ఏందీ, దీని మందవేంది" అని అడిగింది.

కోటమ్మ తత్తరబిత్తర్లాడుతూ "ఇంత మంది ఆడోళ్లు, కుర్రోళ్లు, యింతజనం మన మల్లే యాతన్లు పడుతున్నారుగావల్నే మంగమ్మా" అంది.

"ఔరా మనకిగన భయమెందుకే"

"ఔ ఈళ్లంతా మనపక్కే, దేవుడా రక్షించావు"

గుంపునిదానంగా కదులుతూ బస్సు స్టాండ్ దగ్గరకొచ్చింది. ఎక్కడ బస్సులక్కడ ఆగినయి.

వెంకమ్మ కొడుకు చిన్నాగాడు ఎక్కణ్ణుంచి కొట్టుకొచ్చాడో ఎర్రజండా భుజానేసుకుని గుంపుతో వచ్చి కల్సాడు.

ఇంతలో తప్పెట్లు మోత హోరెత్తింది.

జనం వెయ్యిమందిదాకా పోలీస్టేషన్ ముందు ఆగేరు. యస్సైకి విషయం అర్థమైంది.

మంగమ్మ, వెంకమ్మ రోశమ్మ, పోలేరమ్మ, రావులమ్మ, లచ్చమ్మ, ఎర్రజండా లీడర్లు, బోసుబాబు యస్సై దగ్గరకు వెళ్లారు.

బయట నినాదాలు చల్లబడ్డాయి.

యస్సై ఆడవాళ్లని పరిశీలనగా చూసి, లీడర్లని, బోసుబాబుని ఉదాసీనంగా చూసి ఇహ మీరు పోవచ్చు అని లేచి షేకండ్లు తీసుకున్నాడు.

"మమ్మల్ని తీసకరమ్మన్రంటగా సారు" అడిగింది మంగమ్మ.

"ఇహ వెళ్లొచ్చమ్మా మీరు" నిదానంగా అన్నాడు.

ఆరోజునుంచి వెంకమ్మ, మంగమ్మ నాయకత్వం వెనక్కి చూసుకోకుండా సారా ఉద్యమ బావుటాని భుజానేసుకు తిరుగుతున్నారు.

* * *

బోసుబాబు చాలా ఖరీదైన విస్కీసీసాతో ఫ్రిజ్‌లో వుంచిన డిస్టిల్ వాటర్ బాటిల్ గూడా తెచ్చి తండ్రిని గదిలోకి ఆహ్వానించాడు.

తిలక్ పడక కుర్చీలో కూచుని తనలో కలిగిన పరివర్తనకు పదును పెట్టుకుంటూ సింహావలోకనం చేసుకుంటున్నాడు.

గ్లాస్ తీసుకుని వచ్చాడు బోసు.

దాని వాసన, రంగు ఏవేవో గతించిన మధుర స్మృతులలోకి లాక్కెళ్తున్నది మనస్సును.

నిగ్రహించుకోలేకపోతున్నాడు తిలక్.

"నేను మానెయ్యటానికి ప్రయత్నిస్తున్నారా! తీసుకోను!" అన్నాడు.

బోసుబాబు ఆశ్చర్యపడకుండా స్టూలు మీద సీసాలు, గ్లాస్ పెట్టి వెళ్లిపోయాడు, తన గ్లాస్ ఖాళీ చేయటానికి తన గదిలోకి.

తిలక్ లేచి బయటకు వెళ్లిపోయాడు, వుంటే గ్లాసుకు లొంగిపోవాల్సి వస్తుందని.

గ్లాసుకు లొంగేడా? రాధమ్మకింకా దూరమై పోవటం తప్పనిసరి. పరిస్థితులు మారిపోతున్నాయ్.

బయట రాజకీయాల్లో ధనవంతులు తలెత్తేరు. తనను తప్పకుండా నెట్టేస్తారు. తొక్కేస్తారు. అణచేస్తారు. ఇంట్లో భార్య చేతుల్లోకింకా ఆస్తి, సంపద రాబోతుంది.

తను తాగుడులోంచి బయట పడకపోతే ఇంటా బయటా పతనం ఖాయం.

తను తాగుడు మాని నిలబడగలిగితేనే ఇంటాబయటా నెగ్గుకొచ్చేది.

తన ఆఖరి దశ గౌరవప్రదంగా గడవా



లంటే ఈ దురభ్యాసాన్ని జయించాలి తప్పదు.

తాగుడు మానెయ్యగలను. మానేస్తా.

ఛైర్మన్ పదవిపోతే పోనీ, భార్య గౌరవించినా గౌరవించకపోయినా డోంట్ కేర్! వీణ్ణి... ఈ బోసుగాణ్ణి రక్షించుకోవాలి.

వీణ్ణి తాగుడులోంచి లాగెయ్యాలంటే ముందు తను తాగుడులోంచి దూరమైపోవాలి.

తను నిలతొక్కుకున్న తర్వాతనే ఈ మంచి మార్పులు జరిగేది.

బోస్ మందుకొట్టి, ప్యాంట్, స్లాక్ వేసుకుని టెన్నిస్‌కోర్టుకు బయలుదేరబోతూ ఖాళీ కుర్చీని, స్టూల్‌మీద ఖాళీగాని గ్లాస్‌ని చూసి ఆశ్చర్యపోయాడు.

బయట ఫేం కుర్చీలో కూర్చున్న తండ్రిని చూసి కొద్దిగా కంగారుపడ్డాడు.

ఈయన నిజంగా మానేస్తాడేం కొంపతీసి. మానేసి నన్ను బలవంతం చేస్తాడా ఖర్మ. మానుతావాలేదా? నేను మానంగా నీవు మానలేవా? ఏం మాయరోగం మాను. మానాల్సిందే. లేకపోతే గెట్ఔట్ అంటాడు గావల్ను. నాకు చావుకొచ్చిందే?

స్టూల్ మీద నిండు గ్లాస్ తీసుకుని తండ్రి దగ్గరకొచ్చాడు.

తిలక్ కోపంగా చూశాడు.

"బోసూ! నన్ను బలవంతం చెయ్యమాకు. నేను ఈ రోజునుంచి తాగితే వుచ్చ తాగిందాంతో సమానం. మానేసేస్తున్నా. రోగమొచ్చి మంచానపడినా డోంట్ కేర్! యావనుకున్నావో? కబడ్దార్? " అని గాండ్రించాడు.

బోసుబాబు కాస్త జంకేడు

చేతిలో గ్లాస్ తొణికింది.

చల్లటి విస్కీ, తిలక్ కుడికాలి బొటనవేలి మీద పడి పాదాభివందనం, పాదాభిషేకం అంటూ ఏడ్పు ఏడ్చింది.

తిలక్ గ్లాసందుకుని కాళ్లమీద పోసుకుని గ్లాస్‌ని కుర్చీకింద వుంచాడు.

తండ్రి మందుపుచ్చుకోకుండానే ఓవరైనట్లుగా చేయటం బోసుకేం నచ్చలేదు. తండ్రి తనను తప్పుదోవలోకి తీసికెళ్తున్నట్లనిపించింది. తండ్రి ఇట్లా కొత్త ఆదర్శాల మోజులోపడి తనను కించపర్చటం చాలా దారుణమనిపించింది.

"నీతో కాసేపు మాట్లాడాలి. కుర్చీ తెచ్చుకోరా? "

తండ్రి కంఠంలోని కర్కశత్వానికి వులికిపడి బోసు కుర్చీ తెచ్చుకుని తండ్రికెదురుగా వేసుకుకూచున్నాడు. తిలక్ బోసును ప్రశ్నించాడు.

"ఈ ఇంటి పెత్తనం ఎవరి గుప్పెట్లో వుందిరా? "

ఏవిటి ఈ ఇంటర్వ్యూ? బోసు తండ్రిని విచిత్రంగా చూసి నవ్వుతూ "అమ్మ గుప్పెట్లో" అన్నాడు.

"ఎందుకని వుంది? "

"మనం తాగుబోతులం, అమ్మ తాగదు. అందుకని మనమే అప్పగించాం"

"మనకంటే తెలివి గలదా మీ అమ్మ? "

"కొన్ని విషయాల్లో మనకంటే తెలివిగలదే. కొన్నిట్లో మనకంటే తక్కువే"

"మనిద్దర్నీ ఇంట్లోంచి వెళ్లిపొమ్మంటే ఏం చేస్తావ్? "

తండ్రి ఇట్లా మాట్లాడడం బోసుకు నవ్వొచ్చినా వెంటనే భయం కల్గింది. నాన్నకి పిచ్చెక్కిందా కొంపతీసి అనిపించి అయోమయంగా చూసి ఆలోచనలోపడ్డాడు.

అమ్మా నాన్న ఘర్షణ పడ్డారా? నాన్న చాలా సున్నితంగా ప్రవర్తించే మనిషే! అమ్మతో తలపడతాడా? నాన్నకు అమ్మ

అభిమానం రాబట్టుకోవటం శక్తికి మించిన పనేంకాదు. కాకపోతే ప్రతినెలా ఖచ్చితంగా తన కొచ్చినట్లు జీతం గ్యారాదు. అందు వల్ల అమ్మమీదే ఆధారపడాలి.

తిలక్ కొడుకుని అసహనంగా చూస్తూ అడిగాడు ఘాటుగా. "మనల్ని టౌన్లో రాజ కీయాల్లోంచి గెంటివేయటానికి చూస్తు న్నారు. ఏం చేద్దామంటావ్? "

"ఇవన్నీ తేలిగ్గా కొట్టిపారెయ్యాల్సిన విష యాలేం కావు నాన్నా! నేనేనొప్పుకుంటా. మనం తాగుడు మానేసినంత మాత్రాన ఇవ్వన్నీ తారుమారౌతాయంటావా ఏంటి? " బోసు లాజిక్ వెలగబెట్టాడు.

"ఇప్పటికే మనం తారుమారైపోయాంరా. ఇహ తల్లకిందులుగా బోతున్నాం. మన అడ్రసులే గల్లంతవుతాయ్. మనం మనలో మార్పు తెచ్చుకోలేకపోయామా? మనల్నా దేవుడు గూఢా రక్షించలేడ్రా బోసూ. చీకూ చింతా లేకుండా రాజకీయాల్లో తిరగాలంటే ఇంటి సమస్యలు ఉండగూడదు. ఇవి కాస్త దోవకొచ్చాయ్. భారతి పెళ్లి సమస్య నా గుండెలమీద నుంచి దిగిపోయింది. నేను నిబ్బరంగా స్థిమితంగా వుండొచ్చనిపిస్తుంది. నా శత్రువు నీ శత్రువూ తాగుడే. మనల్ని కృంగతీసేస్తున్నది. నా వెంట్రుక పాటి చేయలేని వెధవలు నా వీపు వెనకాల ఏరకం ఏరకం వాగుడు వాగేరో నీకేం తెల్సు? నా కళ్లలోకి సూటిగా చూసి మాట్లాడటానికి దమ్ములు చాలని వాళ్లు వాళ్ల పోజులకి మనం తాగుబోతు మొహా లేసుకుని తూలుతూ తలలొంచుకెళ్లాల్సిం దేనా అంట? ఇంత బ్రతుకుబతికి? "

"వంకాయలు దొంగిలించేనాడే చెయ్య కుండా ఉరిశిక్షపడ్డనాడు వచ్చి ఈయన ఇట్టా జ్ఞానబోధ చేస్తాడేంది. కర్మ? " అన్న ట్లుగా బాధపడిపోతూ చూస్తున్నాడు బోసు తండ్రిని.

"మనకి ఇంటా బయటా విలువ పోతుంది. ఉత్త తాగుబోతుముండా కొడుకు ల్లాగా ఎదురెదురుగా కూర్చుని తలకాయలు పట్టుకుని ఏడ్చుకోవాల్సివస్తోంది తెల్సా!"

బోసుబాబు ఏడుపు మొహం పెట్టాడు.

"మనిద్దరం తండ్రి కొడుకుల్లాగా కాకుండా స్నేహితుల్లాగా మెలుగుతున్నాం. నీవు తాగుడు మానకపోతే, మన స్నేహం వదు లుకోవాల్సివస్తుంది రాబ్బాయ్! మన సంబం ధాలు కూడా చెడతాయ్"

"నీ ఆర్గ్యుమెంటు కరెక్టే నాన్నా. నేనొప్పు కుంటా. నేననేదేంటంటే... ఇట్లా వున్న పళంగా మానతావా? చస్తావా? అని నా గొంతుమీద కత్తి పెడితే ఎట్లా చెప్పు. నాకు టైం కావాలి నాన్నా"

"ఎంత కాలం కావాలంటావో చెప్పు!"

"ఎంతంటే ఏం చెప్పను? కనీసం మూడు నెలలన్నా కావాలి ఛైర్మన్‌గారూ" అని నవ్వే శాడు బోస్.

"రేయ్ జోక్స్‌కిది సమయం కాదు. నేను చాలా సీరియస్‌గా మాట్లాడతున్నా తెల్సా"

"అంత సీరియస్ ఎందుకనవుసరంగా నా విషయంలో నేను హామీ ఇస్తున్నాగా నాన్నా. నేను కూడా నీకుమల్లే తాగుడు మానేస్తానుగా. అయితే కనీసం వందరోజు లైనా టైమ్ కావాలని ప్రార్థిస్తున్నా అంతే"

"అంత టైం ఎందుకురా పిచ్చి సన్నాసీ"

"ఎందుకంటే నేను తాగుడు ఎలా మానాలి అనే విషయంమీద బోలెడు పుస్త కాలు మహానుభావులు రాసినవి శ్రద్ధగా చదవాలి. అనుభవజ్ఞుల సలహాలూ, డాక్టర్ల సలహాలు కూడా తీసుకోవాలి"

తిలక్ శ్రద్ధగా వింటున్నాడు.

"నా మాట విని నీవు కూడా నిదానంగానే మానేసేయ్ నాన్నా! డాక్టర్ సలహా పాటిస్తూ మానాలి నాన్నా. లేకపోతే లేని

పోని ట్రబుల్సు, ప్రాబ్లమ్సు, ఫేస్ చేయాల్సివ స్తుంది"

"నాకేంరా! అరవైఏళ్లు వచ్చాయ్! ముప్పయ్ అయిదేళ్లు వార్డు కౌన్సిలర్‌గా వెలిగా. రెండుతూర్లు ఛైర్మన్‌గా చేశా చాలామందిని పైకి తెచ్చా. సహాయం చేశా నా శత్రువులకి కూడా చేశా. నిండా నీకు ముప్పయిఅయిదేళ్లు లేవు. భార్య వెళ్ళిపో యింది. ఇంట్లో గౌరవం లేదు. నీవేమైపో తావోనని నా దిగులు ఇంతింత కాదురా తండ్రీ. నీ మేలు కోరి చెప్తున్నా విను"

బోసుబాబు ఏడుపు లంకించుకున్నాడు.

"ఏడవమాక. ఏడ్చుమాక పిచ్చి సన్యాసీ"

"పర్వాలేదు. నా మాటలు వీడిమీద పని చేస్తున్నాయ్. వీణ్ణి దోవలోకి తీసుకురా వచ్చు" అనే ఆత్మవిశ్వాసం ఏర్పడింది తిల క్‌లో.

ముసిముసి నవ్వులతో భారతి వచ్చి తండ్రి, అన్నల తీరు చూసి ఆశ్చర్యపోతుం డగా బోసు చేతి గుడ్డతో కన్నీళ్లు తుడ్చుకుని మౌనం వహించాడు. భారతిముందు ఏడుపు కప్పిపుచ్చుకో జూస్తూ...

"నేను రెండేళ్లనుంచి టౌన్లో అన్ని సమ స్యల్లో కొద్దో గొప్పో తలదూర్చి కృషిచేస్తు న్నానని మీకు తెల్సుగా" అన్నాడు తండ్రితో

ఏవో కొద్దికొద్దిగా నా చెవినపడుతున్నా యనుకో"

ఛైర్మన్ కేండిడేట్‌గా నిలబడాలనుకుం టున్నా నాన్నా"

భారతికి వళ్ళు మండింది. "నీవా? జనం ఇంకా అమాయకులనుకుంటున్నావ్. పాపం నిన్ను చూస్తే జాలేస్తోంది"

"పిచ్చి పిచ్చిగా వాగమాక భారతీ. మేం పెద్దవాళ్లం. ఏవో రాజకీయాలు మాట్లాడు తుంటే అధిక ప్రసంగం నీవునూ"

"నేనూ బియస్సీ పాసైన పాతికేళ్ల యువ తిన్రా బోసన్నాయ్. నేనూ ఛైర్మన్ కేండిడే ట్‌గా నిలబడదల్చా వెనకాముందు ఆలో చించేదే లేదు నాన్నా, తమాషా కాదు నేనం టున్నది. సీరియస్‌గానే చెప్తున్నా" అని దూకుడుగా అన్నది భారతి.

తండ్రి కొడుకులు భారతి ధోరణికి మౌనం వహించారు కొన్ని క్షణాలు.

"నీ దుంప తెంచ. తగ్గు తగ్గు" అని బోస్ ఈసడించగా తిలక్ మందహాసం చేస్తూ, "ఆలోచించాల్సిన, ఆసక్తి గల్గించేవిష యమేన్రా బోసూ" అని భారతిని ఆశ్చ ర్యంగా, ఆనందంగా చూశాడు.

★ ★ ★

"బాలకిట్టాయ్‌కి ఇప్పుడు హాస్టల్లో చేరతా బాగా సదువుకుంటా. నేను శానా శానా సదివి డాకటర్ని అవుతా. మా అయ్యలాటో ళ్లకి మంచి మందు మాకులిచ్చి బాగా చూస్తా"లాంటి కలలు మరుపులోకి పోతు న్నాయి.

చెంచమ్మ కొడుకుని స్నానం చేయించి, కాకి నిక్కరు, బనీను తొడిగించి తలదువ్వి బస్తీమీదకు చెయ్యి పట్టుకుని లాక్కెళ్ళి హోటల్ ముందు నిలబడ్డది.

హోటల్ యజమాని ముసలిచూపులు పడుచు చెంచమ్మమీదకి దూకి చెదిరి, బాల కిష్టడిమీద నిల్చాయ్.

"ఓరే బాబు. నీవు బల్లలు తుడ్చి, ప్లేట్లు, గళాసులు బక్కెట్లో వేసుకుని చెకచకా పని చేసుకోగలవా? " అని ప్రశ్న వేస్తూ చెంచ మ్మను చూశాడు.

"మావోడు బాగా పనిచేస్తడు సామి" చెంచమ్మ ముకుళిత హస్తాలతో ప్రాధేయప డుతూ అన్నది.

"చేస్తా సామి" అన్నాడు బాలకిష్టడు.

"ఏ దినం రూపాయలు ఆ దినం. డ్యూటీ దిగేముందు చేతిలో వేస్తా. మధ్యాహ్నం




బేటా పావలా యిస్తా. బాగా శ్రద్ధగా చేసుకో. సర్నా రేపురా" అని బాలకిష్టడి భుజం తట్టాడు.

అంతేకాకుండా ఆ హోటల్ యజమాని బాలకృష్టడికి ఓ రిక్షా కూడా ఇచ్చి రాత్రుళ్లు తొక్కుకునే వీలు కల్పించాడు. రిక్షా తొక్కడం కూడా త్వరగానే నేర్చుకున్నాడు వాడు.



జానకమ్మ చాలా చురుగ్గా ఆలోచి స్తున్నదీమధ్య. తనమీద తన కుటుంబం మీద రాఘవరావు పెత్తనం చెలాయించడం తగ్గేలా శ్రద్ధ తీసుకుంది. బతకనేర్చిన రాఘవరావు జానకమ్మ మీదకంటే లారీ మీద శ్రద్ధ తీసుకుంటూ రాజీ దోరణికొచ్చే శాడు. జానకమ్మ తనని రాత్రిళ్లు ఇంటికి రావడం మాన్పించేసినందుకు మొదట్లో పౌరుషం అనిపించినా అంతా నా మంచే అని సద్దుకున్నాడు. తనకూ ఈమధ్య ఆమె మీద మోజు తగ్గి డబ్బు లావాదేవీలకే పరి మితమయ్యాడు.

జానకమ్మ రాఘవరావుని తప్పించేసి కొత్త పావుల్ని జాగ్రత్తగా కదపటంలో కేంద్రీకరించింది. బెనర్జీ పరిచయంతో సినీమా వాతావరణం కొద్ది కొద్దిగా అర్థమ వుతుండగా చుక్కమ్మ వారానికి మూడు నాలుగుసార్లు ఫోన్లమీద ఫోన్లు చేస్తూ, "ఎప్పుడొస్తున్నారు, ఎప్పుడు రాదల్చుకు న్నారు? నా మేడ దగ్గర మేడ ఖాళీ కాబో తున్నది. అడ్వాన్సిద్దామా. లేకుంటే ఇంత మంచిల్లు దొరకదోయ్ జానీ" అని తొందర చేస్తున్నది.

సుమిత్ర, కళ్యాణిలు రెక్కలు కట్టుకుని ఎగిరిపోయి, చుక్కమ్మ గుమ్మం ముందు వాలిపోవాలని తహతహలాడిపోతుండగా, జానకమ్మకు, వాళ్ళని అదుపు చేయటం శక్తికిమించిన పనవుతున్నది. "మన ఇంటి ఖర్చులు పెరిగిపోతున్నాయ్. మద్రాస్ వెళ్ళంగానే మిమ్మల్నెవరూ సినిమాల్లో బుక్ చేసి లక్షలు కుమ్మరించరు" అని కూతుళ్లని ఆపింది.

కోరికలు గుర్రాలై పరుగెడుతుంటే, సుమిత్ర ఇరుకు ఇంట్లో వంటగదిలో చాకిరి సహించలేకపోతున్నది. ఫ్రిజ్, కుక్కర్, గ్రైండర్, వాషింగ్ మిషన్, కరెంటు కోతతో పని తెమల్టంలేదు. వీటికితోడు పనిమనిషి మానేసింది. మంచి పనిమనిషి దొరికితే బావుణ్ణు భగవంతుడా అని వారం దినా ల్నుండి ఆదుర్దాపడుతుండగా ఓ ఉదయం సీతారావుడ్ని వెంటపెట్టుకుని, 'చేపలు చేపలో' అని కేకలేస్తూ చెంచమ్మ జానకమ్మ గేటుముందు నిలుచున్నది. జానకమ్మ లోప లకు పిల్చి బేరం చేస్తుండగా సుమిత్ర, కళ్యాణి వచ్చి చేరారు. 'ఇరవై రూపాయ లొస్తే పండగే' అనుకున్న చెంచమ్మతో జాన కమ్మ ముప్పయి యిస్తానని సెటిల్ చేసింది.

చెంచమ్మ వాళ్ళ ధారాళ బుద్ధికి వాళ్ళ అందచందాలకు ఆశ్చర్యపోతూ "రయిక, పాత రయిక యియ్యండమ్మలారా వొళ్ళు దాచుకుంటా" అని దీనంగా అడిగింది. చెంచమ్మ సహజ సౌందర్యాన్ని గమనించిన జానకమ్మ, మాటల్లోకి దించి కొన్ని ముఖ్య మైన ప్రశ్నలు వేసి, సమాధానాలతో తృప్తి చెంది, "మా ఇంటో పనిచేస్తావా" అని అడ గ్గానే చేస్తానని నడుంకు కొంగు బిగించేసి, మూడు దిన్నాల్నుంచి పడివున్న అంటగి న్నెలు తోమి, ఐదు గదులు వరండా చిమ్మి, బట్టలు వుతికి షెబాష్ చెంచమ్మా అనిపిం చుకుంది.

నెల రోజులు గడిచేప్పటికి వాళ్ళందరితో చాలా కలివిడిగా కల్సిపోయి వాళ్ళకెన్నో సదుపాయాలు వళ్ళు దాచుకోకుండా చేసిపె డుతూ, సుమిత్ర, కళ్యాణీ తీరుబాటుగా

కమ్మటి కలలు కనటానికి బోలెడంత తీరు బాటు కలిగిస్తున్నది.

"మాతోపాటు నీవూ మద్రాస్ రావాలోయ్ చెంచమ్మా" అని సుమిత్ర, చుక్కమ్మతో ఫోన్‌లో మాట్లాడిన తర్వాత అడిగింది.

"తల్లే" నాకేడ కుదురుద్ది. రోగిష్టి నామొగుడ్ని ఎట్టా గుడిసెలో పండేసొచ్చేది. నా పిల్లోళ్ళింకా కూనార్లు. పెళ్ళి సెయాల నాకిన్ని లంపటాలున్నాయి తల్లే"

"అవును పాపం" అంది జానకమ్మ.

★ ★ ★

వారం కిందట జానకమ్మ మద్రాస్ వెళ్ళివచ్చాక చెంచమ్మను బాగా మాలిమి చేసుకోటానికి శ్రద్ధ తీసుకుంది. కనకాంబరం రంగు నైలెక్స్ చీరె జాకెట్, లోపల లంగా యిచ్చింది కట్టుకోటానికి.

చెంచమ్మ దశ తిరిగింది. మొగదుర్మార్గానికి బలైపోయినా ప్రకాశం ఆమెను వెంట పెట్టుకుని, యస్సైగారి, బూట్లు లేని పాదాల మీద పడేసినా దక్కని ఫలితం ఇప్పుడు దక్కిందనుకుంది.

అబ్రహంనుండి గుంజిన రెండు వేలుగాక యస్సైగారు పట్టుదలతో, జోసఫ్‌గాడి గ్యాంగి తాటవల్చి ఎండేసి, ఆ ఐదుగురి దగ్గర మరో రెండువేలు పిండేడు. చెంచమ్మకు ఐదొందలు ముట్టచెప్పి, మిగతావి తను పలహారం చేశాడు. కానిస్టేబుళ్ళు యిద్దర్కి తల వంద మొహానకొట్టేడు.

"ఎందుకైనా మంచిది అయ్యగారికోసారి కనిపించి దణ్ణంపెట్టిరా చెంచమ్మా" అని ప్రకాశం సదుద్దేశంతోనే సలహాయిచ్చాడు. చెంచమ్మ "అట్నే ఎల్లి వత్తగా మారాజా. నేను సెడ్డా, సేతికొచ్చిన పైకంతో అనసూయకి పెళ్ళిచేసేత్తాగా" అంది

ఆ పూట తీరిక చిక్కింది. జానకమ్మ వాళ్ళుబయటకెళ్ళగానే,చెంచమ్మ కనకాంబరం చీరెలో ముస్తాబై, ఇంటికి తాళంపెట్టి, ఎస్సైగారి కొంపకు దారితీసింది.

తలుపులు బార్లా తెరిచివున్నాయ్. యకాయికిన చెంచమ్మ వచ్చి గుమ్మం దగ్గర నిల్చుని "సామే దండాలు, సామే దండాలు' ' అన్నది.

యస్సై గారప్పుడే డ్యూటీనుంచి అలిసివచ్చాడు. భార్యా పిల్లలు పుట్టింటికి వెళ్ళడంతో ఏమీ తోచనట్టుగా వుంది అతడికి. గుమ్మంలో చంచమ్మను చూడగానే హుషారొచ్చింది.

"ఏవే! ఐదొందలు చేతికివచ్చాయిగా. కూతురి పెళ్లి చేస్తానన్నావుగా!" అని అడిగాడు ఏదో మాట్లాడాలన్నట్టు.

"సిత్తం" అంది చెంచమ్మ.

"లోపలికిరా"

చెంచమ్మ గుమ్మందాటి అడుగు ముందుకేసింది.

"తలుపెయ్"

చెంచమ్మ తలుపేస్తుండగా, ఫ్యాన్ గాలికి యస్సై చేతిలో పేపర్ ఎగిరి నేలను కర్చుకుంది. యస్సై పేపర్‌తోపాటు లేచి చెంచమ్మను వాటేసుకుని, చేతులతో భుజాలు నిమిరి ముద్దుపెట్టుకున్నాడు.

చెంచమ్మ ఆ పట్టు సడలుతుండగా తలుపు గడియ వేసేసింది.

యస్సై అడుగెనక్కి వేస్తూ "గబ్బు కొడ్తున్నావ్ స్నానంచేసి రాలేదా" అని కసురుకున్నాడు.

చెంచమ్మ బెదురుతూ నిల్చున్నది. నీవిట్లా కక్కుర్తిపడతావని నేను కలగన్నానా! అన్నట్లుగా చూసింది.

నాటుకుక్క మీదికి దూకబోతున్న జాతి కుక్కలాగా చూస్తూ యస్సై "బాత్‌రూంకెళ్ళి




స్నానం చేసిరాపో" అని దోవచూపించాడు.

"అక్కడ సోపుంది. బాగా రుద్దుకుని స్నానంచేసిరా" అనేసి చెంచమ్మ వీపు చరిచాడు గుర్రాన్ని నిమిరినట్లు.

యస్సై అక్కడ లేని ప్రకాశాన్ని మెచ్చుకుని, అతను పంపిన బహుమానాన్ని, అనుభవించటానికి, భంగిమల్ని ఆలోచిస్తూ గదిలోకెళ్ళి, దుప్పటి దులిపి దిళ్ళు అమర్చటానికి నడుంవంచాడు.

ఉద్యోగహోదా ఆసరాతో వెర్రితలలేసే సరదాలు తీర్చుకోటంలో ఆరితేరిన వాడికి చెంచమ్మ తేలిగ్గా లొంగిపోయింది. మీరూ యింతేనా సామీ అనుకుంటూ, సరే తీసుకోండి ఈ చెడిన వొంటిని, అని వళ్లప్పగించేసింది. కూతురు పెళ్లికి ఐదునూర్లు యిచ్చిన దరమదాత కుతి తీర్చుతే తప్పేంలేదనుకుంటూ, తన శరీరాన్ని అర్పించింది.

వెళ్తూ వెళ్తూ "ఎల్తున్నాసామీ, దయుంచండి" అంది బయట గుమ్మం దగ్గర నిలబడి సిగ్గుతో,

యస్సైకి తన అల్పత్వం, పెద్ద అద్దం ముందు నగ్నంగా నిలబడి వికటంగా నవ్వుతూ, వెక్కిరిస్తూ కనిపించింది.

"సరేపో, తలుపేసిపో" అని కసురుకున్నాడు యస్సై.

చెంచమ్మ జానకమ్మ యింటికి దారితీసింది.

★ ★ ★

అంట్లు కడిగి, కుంచ చీపురుతో గదులూడ్చి స్నానంచేసి, ఆ చీరెకట్టుకుని అద్దం ముందు నిలబడి వుండగా, రిక్షాలో బియ్యం బస్తా వేసుకుని రామదాస్ దిగాడు.

యికిలిస్తూ ఇంట్లోకొచ్చి చెంచమ్మని చూసి "అమ్మగారు యాడకెళ్ళారూ? " అని గొణిగాడు.

"సిల్మాకెళ్ళారు సామి"

రామదాస్, రిక్షావాడి చేసహాయంతో బియ్యపు బస్తా ఎత్తుకొచ్చి, సామాన్ల గదిలో గోడవార నిలపెట్టి, దొడ్లోకెళ్ళి కాళ్ళు, చేతులు, మొహం కడిగేసి, భుజంమీద టవల్తో తుడ్చుకుంటూ రిక్షా అతన్ని "మిల్లు కాడికి పద నేవొస్తా" అని వరండాలో మూల వేసున్న కుంటి కుర్చీలో కూచున్నాడు.

ఆ మూలనుంచి హాల్లో ముప్పాతిక భాగం కనిపిస్తుంది. కిటికి రెక్కలు తీస్తే సాంతం చూడొచ్చు. ఎప్పుడొచ్చినా రాందాసు అక్కడే తిష్టవేసుక్కూచుని కొంగ జపం చేస్తాడు.

చెంచమ్మ ఆవిలించి వళ్ళిరుసుకోవటం రాందాస్ కంట్లో పడ్డది. రాందాసు కళ్ళు చెంచమ్మనే వెతుకుతూ తిరుగుతాయని ముందు జానకమ్మే పసికట్టేసింది. తర్వాత నిదానంమీద చెంచమ్మ తెల్సుకుంది.

చెంచమ్మ కిటికి దగ్గరకొచ్చి " టీ తేనా సామీ" అంది.

"నీదయ నా ప్రాప్తం. దానికోసమే మొహంవాచి చస్తున్నా మరదలా" రెండర్థాల డైలాగ్ కొట్టేశానని పొంగిపోతూ రాందాసు వెకిలిగా నవ్వాడు.

"సామెత పెద్దోళ్లూరికే సెప్పలా! కడుపు నిండిన కుక్కా కుండలు నాకుద్ది, కడుపు కాల్తున్న కుక్కా కుండలు ఎతుకుదంట సామే"

"బలే తెల్సుకున్నావ్ మరదలా, సవేడకెళ్ళినా జయించుకొస్తావ్ మరదలా. పిల్లపెళ్ళెప్పుడు? బస్తా బియ్యం యిస్తా. తొందరగా లగ్గాలు పెట్టుకో" అని లేచాడు.

నిట్టూర్చింది చెంచమ్మ, 'ఈ ఎదవలంతా ఇంతే. పోనీ అనుసూయన్నా చదూకుంది. బాలకిష్టడు దారినపడ్డాడు. అదే పదేలు.'.. అనుకుంది భారంగా.

★

# 'ఆ కొండల వెనుక' పై సమీక్షలు

ఏప్రిల్ 'చతుర'లో ప్రచురితమైన ఇచ్ఛాపురపు రామచంద్రం నవల 'ఆ కొండల వెనుక'పై మాకందిన ఉత్తమ సమీక్షలు.

## దగాపడిన తమ్ముళ్ళు

*(ప్రథమ బహుమతి రూ. 100/- పొందిన సమీక్ష)*

**అ**డవిలోని చెట్టూ, పిట్టాతోపాటు తమ మా నాన తాము బతుకుతున్నా, తమ ప్రమేయం లేకుండానే, నాగరిక ప్రపంచం దోపిడీకి గురౌతున్న గిరిజన జీవితాల్ని చిత్రీకరించింది ఈ నెల 'చతుర' నవల ఇచ్ఛాపురపు రామచంద్రంగారి 'ఆ కొండల వెనుక'.

రాజుపాకలలో రెండుమూడు వందల జనాభా ఉన్నప్పటికీ, కథంతా ముఖ్యంగా ముగ్గురు వ్యక్తులు, పూజారి, గంటందొర, మహరాజులచుట్టే అధిక శాతం తిరుగాడింది. వారి గత జీవితంలో కాని, వర్తమానంలో కాని, నాగరీకుల సంపర్కం కలిగిన ప్రతిక్షణమూ వారికి ఒక చేదు అనుభవాన్నే మిగిల్చి వెళ్ళింది. అది ప్రభుత్వాధికారులు, మతాధిపతులు అందరూ వారి జీవితాల్ని కొల్లగొట్ట ప్రయత్నించిన వారే. అయితే వారి నమాయకులుగా, అజ్ఞానులు, అనాగరికులుగా భావించి దోచుకొన యత్నించిన కుటిల నీతిజ్ఞులు, నాగరీకులు కూడా వారినించి నిజానికి నేర్చుకొనవలసినదెంతో ఉంది. శీలానికి మగాడికో నీతి, ఆడదానికోనీతి నిర్దేశించి, ఒక స్త్రీ కాలుజారితే, స్వజాతితోసహా నీతిపాఠాలు వల్లించే ఈ నవనాగరిక నీతికాములు, దొన్నుకి మహరాజు చెప్పిన విశ్లేషణ కొంచెం వంటబట్టించుకోవాలి. నక్సలైట్ ఉద్యమం కారణంగా జరుగుతున్నదేమిటనే దాన్ని గురించి కొందరిలో చెలరేగే ప్రశ్నాపరంపరను స్కూలు టీచర్ పాత్రద్వారా వెలికితెచ్చేరు రచయిత. దేశసౌభాగ్యం పేరుతో గిరిజనులను సహజావాసాలకు దూరం చేస్తున్న ప్రభుత్వ పథకాల వడిలో కొట్టుకుపోతూ, పట్నవాసపు సాంగత్యంలోని తమ చేదు అనుభవాల నేపథ్యంలో, భవిష్యత్తు గురించిన ఆందోళనతో ఒకపక్క తమ వారసుల్ని వ్యామోహ విముఖుల్ని చేయలేక, మరొక పక్క మారుతున్న పరిస్థితులతో రాజీపడలేక, పరాజయాన్ని అంగీకరించి అడవితల్లి గర్భకుహరంలోకి ఆ వృద్ధుల పయనం హృదయాన్ని కలచివేసింది.

కె.వి.రమాకాంత్,
విజయనగరం -535 002.

## ఒక అపశృతి

*(ద్వితీయ బహుమతి రూ.75/- పొందిన సమీక్ష)*

**'ఆ** కొండలవెనుక' నవల మమ్మల్ని నిజంగా కొండకోనల్లోకి తీసుకుపోయి పరిచయం చేసింది. అడవి తల్లి స్వరూపం కళ్ళముందుంచింది.

కాని మంచి నవలలో కొంత అపశృతీ దొర్లింది. సహజత్వం వున్న ఈ నవలలో మతప్రచారకుల ప్రస్తావనలో క్రీస్తుకు కృష్ణుడుకి పోలికలు చెప్పించారు. క్రీస్తు దేవదూత మాత్రమే అన్నారు. క్రీస్తు దేవునిదూత అని ఎవరన్నారు. ఎక్కడ వుంది? 'క్రీస్తు దైవకుమారుడ'ని యేసు అంటే లోకరక్షకుడని బైబిలు బోధిస్తుంది. 'ఆది యందు వాక్యముండెను. వాక్యము దేవుని యొద్దవుండె





ను. వాక్యమే దేవుడై యుండెను' అన్నది బైబిలులో వుంది. శూన్యం వుందని హిందూ గ్రంథాలుచెప్పవచ్చు. కాని క్రైస్తవులకు పవిత్రగ్రంథమైన బైబిలు అనుసరణీయం. దేవుని వాక్కు పరిశుద్ధాత్మ శక్తి వలన పరమ పావని అయిన 'కన్యమరియ' గర్భాన యేసు (రక్షకుడు)గా జన్మించాడు. యేసు పాపరహితుడుగా జన్మించిన దైవకుమారుడు. మరియకు, కుంతికి పోలికెక్కడ?

రచయితకు బైబిలు గురించి కాని క్రీస్తు ప్రభుని గురించి గానీ సవివరంగా తెలియనప్పుడు ఆ ప్రస్తావన నవలలో అనవసరం. ఒక గిరిజనునిచేత అంత పెద్దమాటలు పలికించడం అసహజంగావుంది. క్రీస్తు రొట్టెలను సృష్టించడమేకాదు మృతులను సైతం సజీవులను చేశాడు. ఒక మతాన్ని కాని, మహాత్ములను కాని తక్కువ చేయడం, కించపర్చడం రచయితకు విజ్ఞతకాదు. భారతదేశం లౌకిక రాజ్యం. ఎవరి మతాన్ని వారు ప్రచారం చేసుకోవచ్చు. 'దైవకుమారుడను అని చెప్పినందుకే క్రీస్తును సిలువ వేశారు. ఆ పాపరహిత సిలువ రక్తమే లోక రక్షణ, మోక్షమార్గం అన్నది బైబిలు సువార్త. క్రీస్తు ప్రేమస్వరూపుడైన దేవాదిదేవుని కుమారుడు. కొందరు స్వార్థపరులు తప్ప క్రీస్తు ప్రేమ రుచిచూచినవారు లోకమంతటా చేస్తున్న ప్రజాసేవ ప్రశంసనీయం. అందుకు ఉదాహరణగా 'మదర్‌థెరిస్సా' ఒక మణిపూస అనునది జగద్విదితం.

-బి.ఎస్.జ్యోతికుమారి,
తిమ్మాపురం-531 083.

## సాహసం

*(మూడవ బహుమతి రూ.50/- పొందిన సమీక్ష)*

'ఆ కొండలవెనుక' సహజత్వానికి దగ్గరగా ఉంది. ప్రకృతిలో లీనమై, స్వేచ్ఛా విహంగాలుగా సంచరించే గిరిజనుల జీవితాల యదార్థ సంఘటనల మాలిక... ఈ నవల. గిరిజన ఆచారాలు, ఆంతర్యాలు, అంతరాలు, ఇందులో బాగా వివరించారు. ప్రశాంతంగా సాగిపోయే వారి జీవిత గమనంలోకి దళారులు, వ్యాపారస్తులు, అన్నలు, పోలీసు లు, ప్రభుత్వం వారు వచ్చారు. వారి స్థిరనివాసాలను భగ్నంచేసి, వారి ఉనికినే కాలరాసే ఎన్నో రాజకీయ పలుకుబడులు వారి జీవితాలలో ప్రవేశించి వారి నమ్మకాలు, ఆచారాలు, కట్టుబాట్లు కూకటివేళ్ళతో పెకలిస్తున్నాయ్. ఇదే పరిస్థితి మరికొన్నాళ్ళు సాగితే ఆ కొండల వెనుక కథలలో బండలే వుంటాయి కానీ మాట్లాడగల గుండెలుండవ్...

అడవులలో సంచరిస్తూ, మూగజీవాలతో, క్రూరమృగాలతో సన్నిహితంగా మెలగే వారి జీవనాల్లో అల్లకల్లోలంవస్తే పట్టణంలో బతుకుదామనివస్తే మంచి వాళ్ళకు ఎప్పుడూ అవమానాలే, అన్యాయాలే... అక్కడ వుండలేక అడవులకు పోతే అక్కడ దళారులచేతిలో మోసాలు... అభివృద్ధి అంటూ వచ్చిన గిరిజన్ కార్పొరేషన్ ఉద్యోగులు... వారి ఆరోగ్యాన్ని, దేహాన్ని, మానసికానందాన్ని, శారీరకశ్రమను దోచుకొంటున్నారు.

ఇంతమంచి రచన చాలా సాహసంగా అందించిన రచయిత శ్రీ ఇచ్ఛాపురపు రామచంద్రంగారూ అందుకోండి నా హ్యాట్సాఫ్. చతురవారికి ప్రత్యేక కృతజ్ఞతలు.

-టి.ఎల్.ఎన్.మూర్తి,
రంపచోడవరం -533 288.

## మంచి నవల

*(నాలుగవ బహుమతి రూ.50/- పొందిన సమీక్ష)*

ఇచ్ఛాపురపు రామచంద్రంగారి నవల 'ఆ కొండల వెనుక' గిరిజనుల జీవితానికి అద్దంపట్టింది. కోట్ల కొలదీ వున్న గిరిజనుల జనజీవన స్రవంతిని నాగరిక ప్రపంచంలోకి తీసుకుని రావడానికి ప్రభుత్వం ప్రత్యేక శ్రద్ధ



తీసుకోలేదనేది ఎవరైనా అంగీకరించవలసిన విషయం. ఒకవైపు పట్టణ, నగర ప్రజలు అన్ని ఆధునిక సౌకర్యాలూ అనుభవిస్తూ, ప్రపంచంలోని అన్ని దేశాల ప్రజలతోనూ సెకండ్స్‌లో మాట్లాడగలుగుతూ, విమానాలలో ప్రపంచాన్ని చుట్టి వస్తుంటే గిరిజనుల జీవితాలు మాత్రం ఎక్కడ వేసిన గొంగళి అక్కడే అన్నట్లున్నాయి. అందుకు ప్రత్యక్ష ఉదాహరణ వారికోసం రిజర్వ్ చేసిన వుద్యోగాలు భర్తీ కాకపోవడమే.

ఇక మతాంతీకరణకు మూలకారణం ఏమిటో మనకు తెలుసు. అగ్రవర్ణ దురహంకారం, అంటరానితనం, చిన్నకులాలను చిన్నచూపు చూసి నందువలన బాధితులు తమను ప్రేమతో దగ్గరకు తీసిన క్రైస్తవ మిషనరీలకు దగ్గరయ్యారు. అది చారిత్రక సత్యం. అంతేగాని క్రిష్ణుడు గొప్పవాడా? ఏసు గొప్పవాడా? లేక ఇద్దరూ ఒకటేనా అనే వాదనతో పేజీలు నింపడం సరికాదు. హిందూరాజుల పెత్తనం సాగినంతకాలం నూటికి తొంభైమందిపైగా వున్నవారిని హీనంగా చూసి శూద్రులనీ, పంచములనీ ఈసడించి చదువులకు దూరంగా వుంచి పనిపాటలకు పరిమితం చేశారు. వేదమంత్రాలు విన్నవారి చెవుల్లో సీసం కరిగించి పోయాలనీ, పఠించిన వారి నాలుకలు కోయాలనీ మనువు కఠినంగా ఆజ్ఞాపించాడు. చేదు నిజమే అయినా మనదేశంలోని శూద్రులకు, అంటరానివారికి క్రైస్తవ మిషనరీల రాకతోనే చదువులు మొదలయ్యాయి.

మల్టీపర్పస్ డాములు కట్టేటప్పుడు, రిజర్వాయర్ ఏర్పడినందువలన మునిగిపోయే వూళ్ళకు, పంట భూములకు రెవిన్యూవారు విలువను అంచనావేసి నష్టపరిహారం చెల్లిస్తారు. రీహేబిలిటేషన్ సెంటర్స్ ఏర్పాటు చేస్తారు. పంట భూములకు బదులు వేరే భూములు ఇస్తారు. నవలలో వర్ణించినట్లుగా పట్టాలు లాక్కొని డబ్బుఇవ్వడం వుండదు. చెక్కులద్వారా పేమెంట్ చేస్తారు. ఈ వ్యవహారంలో మోసాలుండవచ్చు గానీ పోలీసుల ప్రమేయం వుండదు. ఈ నవలను ఇంకా బాగా రాసివుండొచ్చు. అయినా గిరిజనుల గురించి నవల రాసిన ఇచ్ఛాపురపు రామచంద్రంగారు అభినందనీయులు.

**-సి. హెచ్. శివరామప్రసాద్,**
హైదరాబాద్-500 072.

## ఆలోచనాత్మకం

*(ఐదవ బహుమతి రూ.50/- పొందిన సమీక్ష)*

**వ**స్తువు వాస్తవికతకు అద్దంపట్టినా కథనంలో 'బిగి' సడలడంతో ఒకింత అసంతృప్తి నిచ్చిన నవల 'ఆ కొండల వెనుక...'. గిరిజన జీవితం, వారి జీవన విధానం పై రచయిత చేసిన అధ్యయనం అపురూపం అన్పించినా, 'సమగ్రత' లోపించడంతో అసలు ఇంతకీ కథేమిటి? అని చివర్లో అన్పించక మానదు! హృద్యమైన సంభాషణలు, గిరిజనులు పురజనులు కావాలని చేసే (విఫల) యత్నాలూ, అటు ప్రభుత్వం, ఇటు నక్సలైట్ల మధ్య వారి పాట్లు చిత్రీకరణలో రచయిత విజయం సాధించారు. గిరిజనుల యాస అక్కడక్కడా పట్టుతప్పి మామూలు నాగరికుల శైలిలోకి వచ్చేస్తున్నట్లు అన్పించడం, అంతలోనే మళ్ళీ 'ఔచిత్యభంగం' కలగకుండా రచయిత తగిన జాగ్రత్తలు తీసుకోవడం కథనంలో స్పష్టంగా తెలుస్తుంది! మతం, చదువు, దోపిడి, ప్రజాస్వామ్యం, దాంపత్యం, పట్నవాసుల పిన్నబుద్ధులు, గిరిజనుల్లో ప్రజ్ఞావంతులు వంటి అంశాలపై రచయిత వెలిబుచ్చిన అభిప్రాయాలు పాఠకుల్ని ఆకట్టుకుంటాయి. ముఖ్యంగా క్రీస్తు కృష్ణుడు సామీప్య, సారూప్యాల గురించి భీమన్న పాత్రద్వారా రచయిత చెప్పించిన తీరు ఆలోచనాత్మకంగా ఉంది.

**-కిల్లాన మోహన్‌బాబు,**
బొబ్బిలి -535 558.





# చతుర కతలు

## రక్షణ కోరిన కంచె

బలభద్రరావు జీవితమంతా అద్దెకొంపల్లోనే బ్రతకాల్సివస్తోంది. ఇల్లు మెల్లిగా కట్టుకోవచ్చునని, చవగ్గా వస్తుంటే వూరి చివర రెండువందలగజాల ప్లాటు ఒకటి కొన్నాడు.

ప్రయత్నాలు చేయగా చేయగా అయిదేళ్లకు ఆఫీసులో హౌసింగ్‌లోన్ శాంక్షనయింది.

ఇంజనీరుకి ప్లాటు చూపించి, ఇంటి ప్లాను వేయించాలని స్థలం వద్దకు వెళ్లిన బలభద్రరావుకి పెద్ద షాక్ తగిలింది.

పని వొత్తిడులతో బిజీగా వుండి ఏడాదిగా ఇటువైపు రాలేదు. స్థలాన్ని చూళ్లేదు. ఇప్పుడు ఆ స్థలంలో అయిదారు గుడిసెలు వెలిసాయి. బంజారాలెవరో అక్కడ మకాం పెట్టేశారు.




ఖాళీ చేయమంటే; ఏడాదినుంచి తాము అక్కడే నివాసముంటున్నామనీ, రేపో మాపో పట్టాలొస్తాయనీ, ఖాళీచేసే ప్రసక్తి లేదనీ జవాబిచ్చారు వాళ్లు.

ఏంచేయాలో తోచక స్నేహితులతో మొరపెట్టుకుంటే, వాళ్ళను నాలుగుతన్ని తరిమేద్దామన్నారు. కాని బలభద్రరావు భయస్తుడు. గొడవలంటే గిట్టవతనికి. అందుకే పోలీసు కంప్లెయింట్ ఇవ్వడానికి నిశ్చయించుకున్నాడు.

ఓ స్నేహితుణ్ణి తీసుకుని పోలీస్‌స్టేషన్‌కి వెళ్ళాడతను. స్టేషన్‌లో సెంట్రీమాత్రం వున్నాడు. తక్కినవాళ్లంతా స్టేషన్ చుట్టూ వున్న అరెకరం ఖాళీ స్థలానికి ఫెన్సింగ్ వేస్తూ బిజీగా వున్నారు.

రెండు, మూడు గంటలసేపు ఓపికగా ఎదురుచూశాడు బలభద్రరావు. చివరకు విసుగెత్తి, "డ్యూటీ విడిచిపెట్టి దడికడుతూ కూర్చుంటే మాలాంటివాళ్ల గతేంకాను? " అనడిగాడు సెంట్రీని.

"అదేమన్నమాట. అది కూడా డ్యూటీయే. పని పూర్తి అయ్యేంతవరకు స్టేషన్లో అడుగుపెట్ట వద్దన్నాడు ఎస్సై. మీరు వెళ్ళి మళ్ళీ రండి" అన్నాడు సెంట్రీ.

"ఇంత హఠాత్తుగా ఆ ఖాళీ స్థలానికి ఫెన్స్ వేయాల్సిన అవసరం ఏమొచ్చిందట? " అనడిగాడు బలభ్రదరావు కుతూహలంగా.

సెంట్రీ నవ్వి, "ఓపెన్‌గా వుందికదా అని ఆ స్థలాన్ని ఆక్రమించుకోవడానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి. రాత్రి నాలుగు గుడిసెలు లేపారు మరి. దాన్ని కాపాడుకోవడానికే ఈ ప్రయత్నం" అన్నాడు వాడు.

**–తిరుమలశ్రీ**

## జ్ఞాపకశక్తి

"అది ఏ కలర్ చీరో చెప్పండి! పొరపాటున వేరేవారికి మార్పిడి అయ్యుంటుంది. మీరు కలర్ డిజైన్ చెబితే గుర్తు తెచ్చుకుని

వెతికి పట్టుకొస్తాను" అన్నాడు లాండ్రీ అతను.

"సరేలే. మిస్సయిన చీరరంగు గుర్తుకు వస్తే ఇంక నీవెందుకూ! అయినా నీకింత నిర్లక్ష్యమేమిటి? ఇంటికెదురుగా లాండ్రీ




పెట్టుకున్నావుకదాని బట్టలన్నీ నీకే ఇస్తున్నా ముకదా! మా బట్టలు నీకు గుర్తుండక్క ర్లేదా? నా చీరలన్నీ కాస్ట్లీ చీరలే! ఏ చీరో? ఏమిటో!" అంటూ శ్రీమతి రుసరుసలాడు తోంది.

"అదేంటమ్మా అలాగంటారు. మీకెన్ని చీరలున్నాయో ఏ రంగుచీరో గుర్తుపెట్టుకో లేక తికమక పడుతారేంటీ? దాదాపు ఇరవై ఇళ్లబట్టలు నా దగ్గరికొస్తాయి. అయినా అన్నీ గుర్తుపెట్టుకుంటాను. ఇన్నేళ్ల బట్టి ఎప్పుడైనా ఇలా జరిగిందా? ఆ ఒక్కచీర నిజంగా మిస్సయిందా? లేక మీరే పొరపా టున ఎక్కువ రాసుకున్నారా దిక్కు తోచ టంలేదు" అని లాండ్రీవాడి రొద.

"అంటే ఏమిటయ్యా నీవనేది నాకు లెక్క పెట్టటం కూడా రాదనా నీ ఉద్దేశం" గయ్యి మంది శ్రీమతి.

"నీవు లెక్కల్లో 'పూర్' అన్న సంగతి వాడికి తెలిసిపోయి దెబ్బ కొడుతున్నా డేమో!" శ్రీమతికి మాత్రం వినిపించేలా గొణిగాను. గుర్రుమంటూ చూసింది నావేపు.

"కనిపించిన చీరలన్నీ కొంటే ఇదిగో ఇలాగే ఉంటుంది. నాకు వంద రూపా యలు ఇంక్రిమెంటు వస్తే నీవు దాని పక్కన ఇంకో సున్న చేర్చి షాపింగ్ చేస్తావు' అంటూ నావంతు కసి ప్రదర్శించి తృప్తిప డ్డాను.

చీర వెతకటం ప్రారంభించి మూడురో జులు ఇల్లంతా ఓ కొలిక్కి తెచ్చింది. పోయిన చీర రంగుమాత్రం గుర్తుకు రాలేదు. నాలుగోరోజు సాయంత్రం ఇంటికి రాగానే శ్రీమతి మొహం వెలిగిపోతూ కని పించింది. "ఏమండీ మిస్సయిన చీర ఏదో తేలింది. అంతేకాదు. అది ఏ సందర్భంలో, ఏ నెలలో కొన్నదీ, రేటుతోసహా తేలింది" అంది.

"అలాగా! డైరీలాంటిదేమైనా రాసుకుని ఉంటే దొరికిందా?" అన్నాను నవ్వుతూ.

"బలేవారే! చీరలకోసం డైరీ కూడానా! అదేం లేదు. పక్కింటి మీనాక్షి ఇందాక మనింటికొచ్చింది. విషయం చెప్పాను. ఇంట్లో ఉన్న చీరలన్నీ ఓసారి పరికించి చూసి, "సంక్రాంతికి మీ పుట్టింటివాళ్లు పెట్టిన చీర లేదు సుమండీ అంది" సంతో షంగా చెప్పింది శ్రీమతి.

మా ఆవిడ చీర గురించి పక్కింటి మీనాక్షి జ్ఞాపకశక్తికి జోహార్లర్పించకుండా ఉండలేకపోయాను.

—ఎ. జయలక్ష్మిరాజు

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd. Hyderabad Tel: 290328 Office Address: CHATURA Monthly, Eenadu Compound, Somajiguda. Tel. Hyderabad: 3318181, 3398787; Madras: 8270434, 8251044; Vijayawada: 476685; Visakhapatnam: 552211; Tirupati: 75291; Anantapur: 33777; Rajahmundry: 79170; Karimnagar: 83216; Suryapet: 21146; Guntur: 353942; Nellore: 331080

CHATURA Telugu Monthly Hyderabad- 500 482 Regd. No. H/HD/402-RNI/32186/78